# భారతి

సాహిత్య మాస పత్రిక

మే 1985







కీసరగుట్ట శివాలయములు – కార్త్తికేయ శర్మ

హస్త ముద్రలు – వసంత

రాగోలు తామ్ర శాసనము – ముకుందరావు

కవితా మధు కింకిణి – ప్రకాశరావు

# భారతి

మాసపత్రిక

❀

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)




❀

మే - 1985

సంపుటము : 62 సంచిక : 5

---

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## మే 1985



ముఖచిత్రం :

ప్రముఖ నర్తకి కుమారి శోభానాయుడు



కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి

117వ జయంతి (20-4-'85)

# కుమారి కె. శోభానాయుడు

## "వాసం"

ప్రముఖ నాట్యాచార్య; ప్రపంచమున పేరుగాంచిన కూచిపూడి నృత్య నిపుణుడు డా॥ వెంపటి చిన సత్యం శిష్యురాలు కుమారి కె. శోభానాయుడు, కళను చక్కగా నేర్చుకొని, సాధనతో తన సొంత సొమ్ముగా చేసుకొని, [illegible] అఖిల భారతమే గాక, ఎన్నో ఎన్నెన్నో విదేశాలలో [illegible] ప్రత్యేక కళా మాధుర్యమును పంచిపెట్టిన అభినవ [illegible]

శాస్త్రీయత్వమునకు ముఖ్యత్వమిచ్చి, పేరు అపండర్య, అసభ్య పోకడలను [illegible] నర్తకి. అదియు గాక, ఈమె బి. ఏ. పట్టభద్రురాలు.

1971లో కేంద్ర ప్రభుత్వము వీరి బృందాన్ని సిక్కింకు స్వాతంత్ర్య దినోత్సవము సందర్భమున పంపినారు. 1973లో మెక్సికో, క్యూబా, వెనిజ్యూల దేశాల పర్యటనకు ప్రభుత్వం వీరిని పంపింది. కేరళ సంగీత నాటక అకాడమీ ఆధ్వర్యాన కేరళ రాష్ట్రంలో పర్యటన చేశారు. 1974లో ఇంగ్లాండులో ఎన్నో ప్రదర్శనలిచ్చారు. 1979లో కేంద్ర ప్రభుత్వం వీరి బృందాన్ని ఆఫ్ఘనిస్థాన్, ట్యునీస్, టెహరాన్ దేశాలకు పంపారు.

1988 మారిషయస్‌లో "శ్రీకృష్ణ పారిజాతం" నృత్య నాటకంతో ప్రజలను ఎంతో ఆనందపరచి కళామృతమును గ్రోలచేశారు, 2 నెలల క్రితం ఇండోనీషియా, సింగపూరు, హాంకాంగ్, వియత్నాంలలో పర్యటించారు.

ఇంకొక నెలలో అమెరికాకు వెళ్లి సుమారు 25 ప్రదర్శనలను ఇవ్వనున్నారు.

ఎక్కడైనా, ఏ ప్రదర్శన అయినా, రసికులు పండితులు వీరి కళాసంపదలో పాలుపంచుకొని నూతన ఆహ్లాదమును అనుభవించుట సర్వ సాధారణము.

మద్రాసు శ్రీకృష్ణ గానసభ, "నృత్య చూడామణి" బిరుదును ప్రసాదించుట, మన కూచిపూడి నృత్య శైలికే ఒక మకుటం.

"అభినయ రసమయి" అనే బిరుదును జంట నగర వాసులు కుమారి కె. శోభానాయుడుకు అందచేశారు.

కూచిపూడి నృత్యములో ఉన్నతస్థాయిని అందుకొని పైమెట్టున స్థిరపడిన దైవాంశయుగెల నర్తకీమణి కుమారి శోభానాయుడు అనుట ఒక సత్య వచనము.

---

ప్రారంభం

వచ్చే సంచిక నుంచే....

"దిలావర్" గారి సీరియల్ నవల

**సమిధలు !**

"అన్నపూర్ణ" గారి పెద్దకథ

**శారద నిర్ణయం**

## కాలం పన్నిన కుట్ర

కొడవంటి లీలామోహనరావు

పల్చని ఆ సెలయేటి జాలుతో  
పరుగులు పెట్టారా  
కేరింతలాడారా  
ఆడి ఆడి అలసిన మీ ముఖాల దీప్తులు  
సంధ్యలోనే మిగిలాయి.  
గొంతెత్తి పదం పాడారా  
గాలివాటుకి పులకించి పోయారా  
ప్రత్యక్ష సాక్షిగా మిగిలిన కొండలు  
తలచుకొని తలచుకొని రోదిస్తున్నాయి.  
ఆ ఇసుక తిన్నెలు  
దుర్గాలు, ప్రాకారాలు, ఉద్యానవనాలుగా  
ఇక రూపు దిద్దుకోవు.  
చిన్న చిన్న గులకరాళ్ళు  
ప్రాణాధికమైన సంపాదనగా  
ఇక చలామణి కావు.  
మీ నోట్సులోని కాగితాలు  
పడవలుగా, గాలిపటాలుగా  
ఇక పరుగులు పెట్టవు.  
ఇరవై యేళ్ళనాటి మాట.  
కాలం పన్నిన కుట్రతో  
జ్ఞాపకాలే మిగిలాయి.

# క్షితిజ

సుమ్మా నిత్యకళ్యాణమ్మ



యుగానికి లేని విలువ ఒక్క క్షణం సంతరించుకుంటుంది. జీవితకాలం అంతా శ్రమించి నిర్మించిన దానిని ఒక్క క్షణంలో నిర్మూలించవచ్చు. మానవత విస్మరించడం క్షణ మాత్రమే అయినా పరిణామం అతి భీకరంగా వుంటుంది.

శ్యామలను పెళ్ళి చేసుకోడానికి కృతనిశ్చయుడైన రంగబా[illegible] ఆమె అంటే విముఖత చూపడానికి హేతువు ఒక్క క్షణంలో జరిగి[illegible] పరిణామం.

కావాలని ప్రాకులాడడమే కనిపిస్తుందికాని ఏదీ కోరుకున్నది ఒక్కొక్కమారు దక్కదు. మానవ జీవితమే అంత. భూమి ఆకాశాలు కలిసినట్లు కన్పిస్తాయి. అయితే ఆరేఖను చేరుకోవాలని ప్రయత్నించడం సాహసమే అవుతుంది. పోగొట్టుకున్న దానిని గురించి బాధ పడని వ్యక్తి వుండడు. ఒక్క క్షణంలో చేసిన చిన్న పొరపాటు జీవితాలనే మార్చివేస్తుంది. మనిషి ఔన్నత్యానికి కొలమానం అతని అంతస్తు ఆస్తీ కాలేవు – మనిషి ఉచ్చస్థితిలో ఉన్నప్పుడు ఆదరించడం – అభిమానం చూపడం సహజమే! కాని మనిషి ఆపదలో వున్నప్పుడు ఆదుకోవాలని అనుకునేవారు అరుదు. ఈ రెండో కోవకు చెందిన వ్యక్తి తారసపడితే, అలాంటి వారి మీద ఎంతటి జుగుప్స వున్నా ఎంతటి హీనభావం వున్నా వారిలో ఆ క్షణంలో దైవం కనిపిస్తాడు.

ఇది రంగబాబు తెలుసుకున్న సత్యం.

క్షణికోద్రేకంలో దైవ సమానులను ఏ బలహీన క్షణాల్లోనో కించపరచితే ఆ దైవం క్షమించగలదు అనుకోవడం పొరపాటే !

రంగబాబు తెలుసుకోలేకపోయినదీ సత్యం.

* * *

"అదిగో, ఆ కనుపిస్తున్న డాబాలోనే వుంటున్నారు వెంకట్రామయ్యగారు" అన్నాడతను.

కాలిబాటను రెండుకిలో మీటర్లు నడిచి వచ్చిన రంగబాబుకి కొంత రిలీఫ్ క... ఈ ఊరు అతనికి కొత్త సివిల్ ఇంజనీరింగ్‌లో డిప్లమా చేసిన అతనికి ఆరు నెలలు తిరక్కుండానే ఉద్యోగం దొరికింది. ఆర్డరు చూడగానే అతనికి ఆశ్చర్యమూ ఆనందమూ కలిగాయి. ఒక మారుమూల కుగ్రామంలో అని చూసిన అతనికి బాధా కలిగింది. ఉద్యోగాలు దొరకడమే కష్టంగా ఉన్న ఈ రోజుల్లో సునాయాసంగా దొరికిన ఉద్యోగాన్ని వదులుకోవడానికి అతనికి మనస్కరించలేదు.

ఊరూ వసతులు గ్రహించుకునే వరకు సింపుల్‌గా వెళ్ళడమే వుత్తమమని నిశ్చయించుకున్నాడు.

"తోటపల్లా! చెప్పవేం. అక్కడ వెంకట్రామయ్యగారున్నారు. చాలా దొడ్డమనసు. నేరుగా అతనిండికే వెళ్ళు." అన్నారు శివనారాయణగారు. అంతకు మించి అతను ఆ వెంకట్రామయ్యగారి గురించి చెప్పలేదు. అయినా రంగబాబుకి ఏనుగు నెక్కినంత సంతోషం కలిగింది.

ఆ ఆసామి చెప్పిన డాబా ఇంటి ఇనుపగేటు తీసుకొని లోనికి వెళ్ళాడు, గేటు దగ్గరనుంచి కంకర పోసిన బాట, బాటకిరువైపులా రంగురంగుల పూలమొక్కలు. విశాలమైన ఆవరణా, ఒకప్రక్క జామి నారింజ కొబ్బరిచెట్లు.

వెంకట్రామయ్యగారు బాగా స్థితిపరుల్లాగే వున్నారు అన్న భావం కలిగింది. తలుపు బాగా తెరచివుంటే "వెంకట్రామయ్యగారూ" అని పిలిచి గుమ్మంలో నిలబడ్డాడు.

లోపల రెండుకుర్చీలున్నాయి. లోపలి ద్వారానికి కర్టెను వుంది. అంతదూరం బరువైన ఎటాచీని మోసుకు వచ్చాడేమో కుర్చీలు చూడగానే కూర్చోవాలనిపించినా 'సభ్యత కాదు' అని నిల్చునే వున్నాడు.

"ఎవరు కావాలి?

ఆ కోకిల కంఠం వినగానే అప్రయత్నంగా ఈ లోకంలో పడ్డాడు. రంభా ఊర్వశులను తలదన్నే సౌందర్యమూర్తి. తను ఉద్యోగం కోసం వచ్చాడా? పెళ్ళి చూపులకా? వెంకట్రామయ్యగారికి ఇంతటి అందమైన అమ్మాయి కూడా వుందని చెప్పని శివనారాయణ గారి మీద ఒకింత కోపం వచ్చింది

తనెవరికోసం వచ్చాడో చెప్పాడు. చెప్తున్నప్పుడు తత్తరపాటు కూడా పడ్డాడు.

"వెంకట్రామయ్యగారికోసమా? వారు పెరటి వేపు ఔట్ హౌస్‌లో వుంటున్నారు." ఆ అమ్మాయి వెంటనే తెరమరుగు అయింది.

కణకణలాడుతున్న నిప్పులమీద నీళ్ళుజల్లితే చల్లారిపోయిన నిప్పులా అతని ఉత్సాహం చల్లారిపోయింది. ఈ హరిణాక్షి వారి అమ్మాయి కాదన్నమాట.! ఈ ఇల్లూ ఈ పిల్లనూ చూడగానే వెంకట్రామయ్యగారి స్టేటస్‌మీద ఒక అభిప్రాయం కలిగింది. వారు ఔట్‌హౌస్ వాస్తవ్యులు అని తెలియగానే అతను నిరాశపడ్డాడు.

బరువైన పెట్టెను అంతకన్నా బరువైన గుండెను మోసుకొని పెరటివైపు నడిచాడు.

ఔట్‌హౌస్

తలుపులు చేర వేసివున్నాయి.

వెంకట్రామయ్యగారూ !

"ఎవరు? అంటూ ఒకయువతి వచ్చింది. రంభ ఊర్వశిలాంటి అతిలోకసుందరిని అంతకు క్రితమే చూసిన రంగబాబుకి ఆ యువతి అందగత్తె కాదని తోచింది. సాదాచీర జాకెట్టు చిన్నతనంలో ఆట లమ్మ పోసి వుంటుంది, ముఖం మీద మూడు నాలుగు మచ్చలు.

"నాన్నగారు పనిమీద వెళ్లారు పొద్దుపోతేనేకాని రారు.

అంది. రంగబాబుకేమీ పాలు పోలేదు. చేతి గడియారం పన్నెండు చూపుతున్నది. మరో ఆరు గంటలు నిరీక్షిస్తేనే కాని వారిని కలుసుకోవడం సాధ్యం కాదు. అంతవరకు ఎక్కడ గడపడం.

ఈలోగా ఆ అమ్మాయి లోనికి వెళ్ళి మంచినీళ్ళు తెచ్చింది. బయట మామిడి చెట్టు నీడలో కుర్చీ వేసి కూర్చోండి అంది రెండు నిముషాలు ఆలోచనారహితంగా కూర్చున్నాడు.

"చూడండి, అలా వూరిలో తిరిగి వస్తాను. అంతవరకు ఈ పెట్టె ఇంటిలో వుంచండి." అన్నాడు. మరో మార్గాంతరం లేక.

"ఎప్పుడనగా ఇంటినుంచి బయలుదేరారో? మీకు ఈ వూరిలో డబ్బుపెట్టినా భోజనం దొరకదు. ఒక్కపావుగంట ఓపిక పట్టారంటే మీకు భోజనం పెడతాను. ఆ తరువాత కావలిస్తే వూరు చూసిరండి.

ఇంటిలో మరోమనిషిలేనప్పుడు అక్కడ భోజనం చేయాలంటే ఆదో అపరాధంలా అసిపించింది. ఇరుగు పొరుగులు పట్టించుకోక పోవ డానికి ఇది విశాఖపట్నంలాంటి నగరం కాదు: తనను చిక్కుల్లో పెట్టుకోవడమేకాక ఆ కుటుంబాన్ని రచ్చ కీడ్చడం జరుగుతుంది.

"నాకాకలిగాలేదు"

"పన్నెండు గంటలు దాటినా ఆకలిగాలేదంటే నమ్మదగిన విష యంకాదు. భోజనం దగ్గర ఇంతమొహమాటం పనికిరాదు. మీకు అన్న మైనా పెట్టలేదంటే మానాన్న నన్నుక్షమించరు. వారిచేత చీవాట్లు తిన్పించడమే మీఅభిమతమైతే నేనువేరే చెప్పేదిలేదు" అంది.

ఇంత ఆప్యాయతను చూపిస్తున్న ఆమె మాటను త్రోసిపుచ్చ లేక పోయాడు అనేకంటే అతని కడుపుతో ఆకలి వలన ఆమె అభ్యర్థ నను త్రోసిపుచ్చలేదు అనడం సమంజసం.

"మీరు స్నానం చేస్తారా:అదిగో ఎదురుగా నుయ్యి వుంది"ఆమె చేతిలో తువ్వాలూ సబ్బుబిళ్ళా వున్నాయి.

"స్నానంచేయాలి. అయితే వీటిఅవసరం లేదు." అంటూపెట్టె తెరచి పైజామా తువ్వాలూ సబ్బూ తీసి నూతి వద్దకు వెళ్ళాడు. స్నానం చేసివచ్చే సరికి ఆమె విస్తరివేసివడ్డించింది.

'ఆమెఎవరు:అసలు ముఖపరిచయ మైనాలేదు. ఎందుకువచ్చారు అని అడగనైనా అడగకుండా చల్లటి ఆతిధ్యం ఇచ్చిన ఆమె అంటే అతనికి గౌరవం కలిగింది.

"ఇంకమీరు తిరగాలనుకుంటే వెళ్ళిరండి. అయితే అన్నంతిన గానే ఎండలో తిరగడం ఆరోగ్యానికి మంచిదికాదు. అంతగా చూడాలను కుంటే కొంచెం చల్లబడిన తరువాత వెళ్లండి. ఈవూరు చూడడానికే మంత వింతైనదికాదు. కాదంటే వూరి బయట పంటపొలాలూ గలగలా పారే సువర్ణరేఖ, నదిపక్కగా ఎత్తైన కొండలు. ఆకాశం భూమికలిసే సుందరదృశ్యం చూడవలసినవే," అంది. అప్పటికే ఆమెగదిలో పక్క వేసింది.

"మీరుకొంతసేపు విశ్రమించండి"

పల్లెటూరి అమ్మాయి ముక్కూముఖం తెలియని పరాయివాడి పట్ల ఇంతనమ్మకం వుంచడంతో అతనికి కించిత్తు ఆశ్చర్యం కూడా వేసింది. విశ్రమించడానికే నిశ్చయించుకున్నాడు. ఆమె కొసరికొసరి వడ్డించగా రోజూ కన్నా అధికంగానే తిన్నరంగబాబు ఆస్థితిలోఅడుగు బయటకు పెట్టే స్థితిలోలేదు.

రంగబాబు అలాఎంతసేపు నిద్రపోయాడో లేక ఇంకా ఎంత సేపునిద్రపోయి వుండేవాడో, పక్కగదిలో జరుగుతున్న సంభాషణతో అతనికి మెలుకువ ఎచ్చింద

"లేచావా బాబూ" ఆగృహయజమాని ప్రశ్నించాడు.

నమస్కారం, నాపేరు రంగబాబు. విశాఖపట్నంనుంచి వచ్చాను. ఇరిగేషను డిపార్టుమెంటులో ఓవర్సీరుగా నన్ను ఇక్కడ పోష్టుచేశారు. ఇంకా మాఆఫీసు సిబ్బందివచ్చి వుండదు. ఈవూరిగుండా పారుతున్న సువర్ణరేఖ నదికి ఆయకట్టకట్టి ఆనీటిని సేద్యానికి ఉపయోగించాలన్నది ప్రభుత్వపథకం. ఈవూరునాకుకొత్త. శంకరనారాయణగారు మిమ్మల్ని కలియమన్నారు. తగినవసతి గురించి మీరుప్రయత్నించ గలరని హామీ ఇచ్చారు. అందుకే నేరుగా మీయింటికి వచ్చాను. నేనొచ్చిన సమయానికి మీరులేకున్నా మీ అమ్మాయి చాలాఆప్యాయంగా ఆతిధ్యం ఇచ్చింది" అన్నాడు మాటలలోనే కృతజ్ఞతను అభివ్యక్తంచేస్తూ.

"మేమిచ్చింది ఒకఆతిధ్యమేనా? ప్రభుత్వం ఇన్నాళ్ళకైనా ఈపరిసరాలను గురించి పట్టించుకోవడం సంతోషం. భగవంతునిదయ వలన ఈబీడు భూములు ధాన్యాగారా లవుతాయి. ఈగడ్డ అన్నపూర్ణ అవుతుంది. మీకృషిఫలించాలని ఆ భగవంతుడ్ని ప్రార్థిస్తున్నాను"

వెంకట్రామయ్య గారికి ఈఇలాకాలో భూములుండ బట్టే అతను సంతోషిస్తున్నాడని రంగబాబు భావించాడు. అయితే అతను భూకామందు కాదని ఆతనికి తరువాత తెలిసింది.

"నాకు వుండడానికి ఒక ఇల్లుకావాలి. మీరుతలచుకుంటే అది పెద్దసమస్యకాదను కుంటాను"

"బాబూ! ఇదిపట్టణంకాదు అద్దెఇళ్ళుదొరకడానికి. నేను తప్ప కుండా ప్రయత్నిస్తాను. అంతవరకు మాతోపాటేవుండు"

రంగబాబు గొంతుకలో వెలగకాయ పడ్డట్టైంది.వెంకట్రామయ్య గారిది ఏమంత పెద్దఇల్లుకాదు. రెండుగదులఇల్లు. ఒకగది విశాలమైనది అయినా రెండోది చాలాచిన్నది.తనుకూడావారితోపాటేవుంటే వారికెంతో శ్రమ. పైగా ఆపిల్ల స్వేచ్ఛకుభంగం.

"బాబూ! ఏమిటాలోచిస్తున్నావు. పట్టణంలో పెరిగిననీకు ఈ ఇరుకు ఇంటిలో గడపడం కిష్టముగానే వుంటుంది. కాస్తి మరోఇల్లు దొరికేవరకు ఎక్కడైనా తలదాచుకోవాలిగా! సంకోచించకు'

"నేనుమీతోపాటే వుంటే మీకుఇబ్బంది అని తలుస్తున్నాను".

భలే! మొగమాటస్తుడివి. మాఇబ్బందుల మాటకేం. ఇలా ఆప్యా యంగా వచ్చేవారు ఎంతమంది?'

నెలరోజులకు పైగానే వారింటిలో గడపవలసి వచ్చింది రంగ బాబుకి.

* * *

గౌరవం మన్ననా వ్యక్తిని బట్టి ఆపాదిస్తాయా: వృత్తినిబట్టా? వ్యక్తి వున్నతుడౌతే వృత్తిప్రతిబంధకం కాకపోవచ్చు. పరిస్థితులు కూడా అందుకు దోహదమివ్వాలి.

రంగబాబుకి నెలరోజుల్లో చాలా సంగతులు తెలిసాయి.

వెంకట్రామయ్య కూతురి పేరు క్షితిజ. చాలా విచిత్రమైన పేరు.

"సీతను నాగేటిబాలు అనిఎందుకంటారు? ఆమె జనకమహారాజుకి భూమిలో దొరికింది. శకుంతల అన్న పేరు దుష్యంతునిభార్యకెలా వచ్చింది? శుకపికాదులు పెంచడం వలననే. భూదేవి తల్లి - ఆకాశం తండ్రి ఈరెండూ కలిసేటట్లు కనుపించేచోటు క్షితిజ. అందుకే నా కూతురిపేరు క్షితిజ" అన్నారు వెంకట్రామయ్యగారు.

"............ఆమె మీకూతురు కాదా?"

"ఎందుకు కాదు శకుంతల కణ్వమహర్షి కూతురైనప్పుడు శ్రీకృష్ణుడికి తండ్రి నందుడైనప్పుడు క్షితిజ నాకూతురు నేనామె తండ్రిని"

క్షితిజ జన్మరహస్యం తెలుసుకోవడం రంగబాబుకి సాధ్యం కాలేదు. వెంకట్రామయ్యగారు ఒకబిడ్డతండ్రిఅయినా ఆజన్మబ్రహ్మచారి. ఎవరోచేసిన పాపఫలం ఈక్షితిజ- అని కొందరినోటవిన్నాడు. అయితే అది పాపఫలం అంటే వెంకట్రామయ్యగారు అంగీకరించరు. కళ్ళు తెరువని పసికందు దొరికితే ఆమె పాలనాభారం తన నెత్తిన వేసుకున్నాడు. అతడు మహనీయుడా?లేక ఈ పాప ఫలంలో అతనికీభాగం వుందా?

కొన్నివిషయాలు మనిషికి తెలియనేకూడదు తెలిసిన తరువాత వాటిపరిణామాలు సవ్యంగా వుంటాయనుకోలేము.

వెంకట్రామయ్యగారిపై గల గౌరవం అభిమానం రంగబాబుకి అనతికాలంలోనే తుడుచుకుపోయాయి. అతనివృత్తి ఏమంత గౌరవప్రదమైనదికాదు క్షితిజ వుత్తమ సంజాతకాదు. ఆమెను పెంచడంలో అతనికి. ఎలాంటిసంబంధం వుంది? తనను వారింటిలో బంధించివుంచడంలో ఆప్యాయత వెనుక స్వార్థం ఎంత? మనిషి పట్ల అవిశ్వాసం ఏర్పడనేకూడదు ఏర్పడితే ప్రతిచర్యలోనూ ఏదోసంకుచితత్వం స్వార్థ పరత్వం కనుపిస్తాయి.

అద్దె ఇళ్ళుదొరకడాని కిది బస్తీకాదన్నారు.అది వాస్తవం కాదని రంగబాబుకి అర్థమైంది.

తనతోపాటే వుంచుకోవాలనడంలో ఎంత స్వార్థం వుంది? తమ మధ్య బంధుత్వం లేదు. ఎదిగిన కూతురు ఇంటిలో వుంది. తనదా చెప్పుకోదగిన వుద్యోగం.

"నీకేమోయ్, వెంకట్రామయ్యగారింటిలో అల్లుడి హోదా వెలిగిస్తున్నావు. మాలా చెయ్యి కాల్చుకోవలసిన అవసరం లేదు. ఏ.ఇ. నవ్వుతాలకంటాడు.

"ఇలా ఆరు నెలలుంటే నీవు నిజంగా వారి అల్లుడివే ఔతావు" అంటాడు శర్మ.

నిజంగా వారిలో అంత స్వార్థంవుందా? అతని కూతుర్ని తాను ప్రేమించి పెళ్ళి చేసుకుంటానని అతను భావిస్తున్నాడా? ఆ అపురూపసుందరికి మించిన భార్య తనకు దొరకదా ?

ఆలోచనల్లో ఒక వక్రత వచ్చిన రంగబాబుకి ఆ ఇంటిలో వుండడం ముళ్ళ మీద వున్నట్లే వుంది.

వెంకట్రామయ్యగారి ముందుచూపు గురించి రంగబాబుని చాలామంది హెచ్చరించారు. పదే పదే ఒకే విషయాన్ని ఎందరో ఎన్నో సందర్భాలలో అంటూ వుంటే అందులో నిజం వుండబోదు అని ఏ మానవుడు మాత్రం అనుకోగలడు?

వెంకట్రామయ్యగారు వేసిన వలలో చిక్కుకుంటే........ ??

అతను పగలల్లా ఇంటిలో వుండడు. తాను రోజులో కొన్ని గంటలైనా విధిగా ఇంటిలో వుంటాడు. వయసొచ్చిన స్త్రీ పురుషులు ఏకాంతంగా వుంటే? రోజులన్నీ ఒకలాగుండవు. ఏనాడైనా మతి గతి తప్పితే?........ క్షితిజ ఏమాత్రమైనా చొరవ తీసుకుంటే?........ జరిగేది ఏమిటి? జరగబోయేది ఏమిటి ?........

శాశ్వతమైన అనుబంధాన్ని కోరుకునేవారు అసత్యాన్ని ఆధారం చేసుకోలేరు, నిజం ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో తెలియదు. తప్పు చేసిన తరువాత అది తెలుసుకొని ఆమెను చేసుకుందికి తను సిద్ధపడగలడా? అలాగని దొరికిన అవకాశాన్ని వినియోగించుకొని ఒక అమాయకురాల్ని అన్యాయం చేసి మరో క్షితిజ జన్మకు కారణం కాలేడు. పోనీ ఏ నాటికైనా తాను వివాహం చేసుకోవలసిందేగా? తన మీద ఆశలుంచుకున్న క్షితిజను(?) చేసుకుంటే....?

ఆమె అతిలోకసుందరి కాదు. ఆస్తిపాస్తులు లేవు. జన్మరహస్యం నిగూఢం. మరి ఏం చూసుకొని ఆమెనే చేసుకోవాలి ?

ఏతా వాతా రంగబాబుకి ఆ ఇల్లు వదిలేయాలన్న కోరిక కలిగింది. వెంకట్రామయ్యగారిమీద జుగుప్స కలిగింది. ఆ వూరిలో అద్దె ఇళ్లే దొరకవన్నారు. అది నిజం కాదు. అదే వాస్తవమైతే తన తోటి వుద్యోగులు చెట్లకింద బస చేస్తూ ఉండేవారు.

కరణంగారు తన ఇంటిలో వుండమని రంగబాబుని ఆహ్వానించారు, మునసబూ అదే విధమైన అభిప్రాయం వెలిబుచ్చాడు. రంగబాబుకి వసతి సదుపాయం కల్పించేందుకు ముందుకి వచ్చిన వారిలో డాబాయింటి రామస్వామి వున్నాడు. వీరందరిలోనూ స్వార్థం వుంది. పల్లెప్రజలు అమాయకులనుకుంటే అది సదభిప్రాయం కాదు.వారిలోనూ స్వార్థం పేరుకుపోయింది. ఆ విషయం గ్రహించడం కష్టంకాదు. రంగబాబు చేతిలో స్టోరు వుంది. ప్రాజెక్టు కోసం సిమ్మెంటు ఇనుము రోజూ లారీలతో దిగుతోంది, సిమ్మెంటు చవుకగా సంపాదించాలన్నా తను వారికి వుద్యోగాలు ఇప్పించాలన్నా రంగబాబులాంటివారి ఆసరా కావాలి.

కరణం మునసబుల అభ్యర్థనకన్నా రామస్వామి అభ్యర్థన అతన్ని ఆకర్షించింది.

కారణం.........?

అతని కూతురు క్షితిజ కాలిగోటికి సరితూగదు. వారింటిలో వుంటే ఆమెను రోజూ చూసే అవకాశం వుంటుంది. ఏడడుగులు కలసి నడుస్తే వారు వీరౌతారు. వారింటిలో వుండి తరుచు కలుసుకొని మాట్లాడుతూ వుంటే అది చివరకు ప్రేమగా మారే అవకాశం వుంది క్షితిజంటే నచ్చలేదు కాని శ్యామలకేం తక్కువ? ప్రేమ వివాహమైనా కట్న కానుకలకు లోపం వుండదు.

రంగబాబు ఆశయం రామస్వామి ఆశయం పరస్పర విరోధమైనవి కావు. శ్యామలతో పరిచయం దినదిన ప్రవర్ధమానమైంది. పని జరుగుతున్న చోటుకి శ్యామల ఒకటి రెండు పర్యాయములు రంగబాబుతో వెళ్ళింది. ఆమె నవ్వుతూవుంటే రంగబాబుకి ప్రకృతిలో వింతలు గోచరించేవి.

* * *

వెంకట్రామయ్యగారు రంగబాబుని అప్పుడప్పుడు కలుస్తూనే వుండేవాడు. ఏదో మిషను తన ఇంటికి భోజనానికి ఆహ్వానించేవాడు.

నలుగురిలో వుండేవాడికి నమ్మిక ముఖ్యం. నమ్మి చెడవచ్చు. నమ్మక బాగుపడడం సాధ్యం కానిది. అందులోనూ స్నేహితులు ఒకే మాట అంటే కాదను కోవడం ఎలా? ఆ పిలుపులో ఇంకా స్వార్థం వుంది. ఎలాగైనా తనను మచ్చిక చేసుకోవాలనుకొన్న అభిమతం నిబిడీ కృతమైంది అనుకునేవాడు. అతను పలకరిస్తే వంటిమీద తేళ్ళు జెర్రులు ప్రాకినట్లు భావించుకునేవాడు.

నలుగురితో కలసిమాట్లాడుకునే సమయంలో నూనె మరకల బట్టలతో దర్శనమిచ్చి 'బాగున్నావాబాబూ ?' అని పలకరిస్తే అస హ్యించుకునే స్థితికి దిగజారేడు.

"చూడండి ! వెంకట్రామయ్యగారూ ! మీరు ఇలా తరచువచ్చి నాపనిలో ఆటంకం కలిగించకండి. నేనొచ్చిన కొత్తలో మీరిచ్చిన ఆతిథ్యాన్ని దృష్టిలో వుంచుకొని ఇంత వరకు మిమ్మల్ని గౌరవిస్తున్నాను. మీరాకతోలి ఆంతర్యాన్ని అర్థంచేసుకోలేని పసివాడినికాను. హీనకుల జాతను కట్టపెట్టాలనుకుంటే అది మీతుచ్ఛపుకోరికే ఔతుంది. మంచి వంశంలో జన్మించిన నేను అలాంటి చరిత్ర హీనురాలిని ఎలా పరిణయ మాడుతాననుకుంటున్నారు ?" రంగబాబు క్షణికావేశంలో ఒకనాడు తొందరపాటుతో అనేశాడు.

"ఇదానీవు నన్నర్థం చేసుకున్నావు ?" వెంకట్రామయ్య బాధతో అన్నాడు. అతని కన్నులు మసద్దయ్యేయి.

రంగబాబు ఆ తరువాత తన తొందరపాటుకి విచారించకపోలేదు అయితే అది గత జలసేతు బంధనం.

శ్యామలా రంగబాబుల ప్రణయం అంతరాయం లేకుండా సాగుతున్నది. చివరకు పెళ్ళి నిశ్చయమైంది. కొన్ని విషయాలు గోప్యంగా దాచినా దాగవు. ఈ విషయం ఎంత మందికి తెలిసిందో తెలియవౌకాని వెంకట్రామయ్య చెవినిపడింది.

ఈర్ష్యా పగ అనే పదాలకు అర్థం తెలియని అతను రంగబాబుని అభినందించకుండా వుండలేకపోయాడు " బాబూ ! మాకు బూరెముక్కలు పెడతావటగా' శ్యామల నీకు నిజంగా తగినపిల్ల నీ ఎంపిక బాగుంది" అన్నాడు.

"వెంకట్రామయ్యగారూ ! ఆ రోజు క్షణికావేశంలో నోరు జారేను క్షమించండి "

"వెర్రివాడా ! ఇంత చిన్న విషయానికి నొచ్చుకోవాలా ? అది మానవ సహజం ఆసంగతి నేనప్పుడే మరచిపోయాను. ఉద్యోగ రీత్యా వచ్చి మా వూరివారి అల్లుడౌతున్నావంటే నాకదే సంతోషం నాకు క్షితిజ ఎంతో శ్యామలా అంతే !"

రంగబాబుకి ఒక విషయం అడగాలని వుంది.

'మీరు క్షితిజను నాకివ్వాలని అందుకే నాపట్ల అమితానురాగాలు చూపించేవారని నలుగురూ అనేవారు అది సత్య దూరమా' అని.

కాని అలా అడిగే ధైర్యం లేదు. అతని హృదయాన్ని మరోమారు గాయపర్చడమే మిగులుతుంది. అతనివ్వబోయే జవాబు అనూహ్యం కాదు.

'నన్ను చులకనగా అంచనా వేసుకున్నావు క్షితిజ పెళ్ళి పెద్ద సమస్యేకావచ్చు. కాని అందుకోసం వలవేసి నిన్ను అందులో ఇరికిస్తానని ఎలా అనుకున్నావు ? ప్రేమించడం నేరం కాదు సహజం అయితే అసహజరీతిలో ప్రేమజాలాన్ని విసిరి నిన్ను అల్లుడిగా చేసుకోవాలన్న దుర్బుద్ధి మాకు లేదు.'' అని తన ముఖం మీదే అనేయగలడు.

* * *

రోజులన్నీ ఒకే లాగుండవు. ఒక మారు సైటు మీద పని చూసి జీపులో వస్తున్నాడు రంగబాబు. సైటుకోసం వేసిన టెంపరరీ రోడ్డు. వంకరటింకరలకు లెఖ్ఖలేదు. లోతులోంచి జీపు మీదకు ఎక్కుతున్నాది. ఎదుటునుంచి రాళ్ళతో నిండిన లారీ దిగుతున్నాది. ప్రమాదాలు అజాగ్రత్త వలననే జరుగుతాయి. ఎవరి అజాగ్రత్త వలన ప్రమాదం సంభవించింది అన్న విచారణ వలన ఫలితం శూన్యం. రెండు వాహనాలూ ఢీ కొన్నంత రంగబాబుకి తెలుసు, ఆ తరువాత ఏమి జరిగింది?....

తెలివి వచ్చేనాటికి చేతికి కాలికి బేండేజీలతో పాతికమైళ్ళ దూరంలో ఒక ఆసుపత్రిలో వున్నాడు.

"అదృష్టవంతుడివి చిన్న దెబ్బలతో బయట పడ్డావు. ముందు సీటులో ఏ. ఇ; డ్రైవరు పాపం అక్కడికక్కడే చచ్చిపోయారు." అన్నాడు వెంకట్రామయ్యగారు అతని ముఖం వాడిపోయింది. మనిషి బలహీనంగా వున్నాడు. పక్కనే క్షితిజ కూడావుంది. ఇద్దరిముఖాల లోను ఒక విధమైన తృప్తి.

శ్యామలకోసం రంగబాబు కళ్ళు గాలించాయి,

"వెంకట్రామయ్యగారు! ఎంత కాలంగా నేనిక్కడ ఉన్నాను"

"ఎంత కాలమైతేనేం ? నీవు బ్రతికేవు"

"శ్యామల లేదా ?"

"వస్తుంది బాబు"

ఇంతలో డాక్టరూ నర్సూవచ్చారు. వెంకట్రామయ్య క్షితిజా బయటకు వెళ్ళారు.

"డాక్టర్ ! నేను ఎంత కాలంగా ఇక్కడ వున్నాను !"

"మీరు కూర్చున్న జీపు ఏక్సిడెంటుకి లోనైంది. మీ కాలి ఎముకకు బాగా దెబ్బతగిలింది తీసివేయవలసి వస్తుందనుకున్నాం. రక్తం కూడా బాగాపోయింది. ఏక్సిడెంటు విషయం తెలియగానే రామస్వామి గారు శ్యామలా మీకాబోయె అర్థాంగి, వచ్చారు. రామస్వామిది మీ గ్రూపే.

"అతను తనరక్తాన్నిచ్చి నన్ను బ్రతికించాడా ? డాక్టర్ ! నాకాలు తీసేసారా ? నేను అవిటివాడినా ?"

"రక్త మిచ్చినందున మీరు బ్రతుకుతారు కాని కాలుబాగు కాదని అతను తెలుసుకొని అనారోగ్యం అనే నెపంతో తన రక్తమివ్వ డానికి అతను అంగీకరించలేదు. చాలా మంది రక్తం పరీక్ష చేసాము. మీది ఓ గ్రూపు ఆగ్రూపు దొరకడం చాలా అరుదు. అదిగో అలాంటి సమయంలో దేవుడిలా వెంకట్రామయ్యగారు. ఆదుకున్నారు. మనిషిగా మీరు బ్రతకాలంటే కాలుతీయవలసిన అవసరం వుంది."

"డాక్టర్ ! నన్నెందుకు బ్రతికించారు ? ఈ అవిటి బ్రతుకు ఎంతహీనమైంది. అంతకన్నా చావే నయం."

"మీరు అనవసరంగా వర్రీకాకండి. మరేం భయం లేదు. మీరు అదృష్టవంతులు."

"డాక్టర్ ! మనిషిప్రాణం నిలబెట్టడం మీ విద్యుక్త ధర్మం కావచ్చు. అయితే అవిటి జీవితం ఎంత దుర్భరమో మీకు తెలియదు. శ్యామల ఈ అవిటివాడిని చేసుకుంటుందా ? నాకీ ప్రపంచంలో ఏం మిగిలింది ? ఏం చూసుకొని నన్ను జీవించమంటారు ?"

"శ్యామల గురించి మీరు ఆలోచించ వలసిన పనిలేదు. ఆవాడే ఆ తండ్రీ కూతుళ్ళు మీ మీద ఆశవదులుకొని వెళ్ళిపోయారు.కాని...."

"ఏమిటి ?"

"మీకాలు తీసివేయలేదు. వెంకట్రామయ్యగారు పట్నం వెళ్ళి మంచి అనుభవంగల ప్రైవేటు డాక్టర్ని తీసుకు వచ్చారు మీ చికిత్స కోసం తన జీవనోపాధిఅయిన సైకిలు షాపుని అమ్మి మీ చికిత్స చేయించారు. విరిగిన ఎముకస్థానంలో స్టీలురాడ్ అమర్చాము. మీరు మామూలుగా నడవగలరు.

* * *

రంగబాబులో ఆత్మసంఘర్షణ మొదలైంది.

కావాలని ప్రాకులాడడమే కనిపిస్తుంది కాని కోరుకున్నది ఒక్కొక్కమారు దక్కదు. చావు బ్రతుకుల మధ్య వున్న తనకు కాబోయే అర్థాంగి రాత్రీపగలూ సేవలు చేస్తూ బ్రతికించుకుంటే అందులో ఎంతటి తృప్తివుండేది ? జీవితంలో ఒక్కక్షణంలో చేసిన పొరపాటు జీవితాలనే మార్చివేస్తుంది. అవిటి జీవితం హేయమమైనదే కావచ్చు. కాని ప్రమాదాలు కోరితెచ్చుకునేవికావుగా ? ఈ ప్రమాదం వివాహం జరిగిన తరువాత జరుగుతే శ్యామల ఇంతతేలికగా తప్పు కునేదా ? మనిషి ఔన్నత్యానికి కొలమానం అతని అంతస్తూ ఆస్తికా లేవు. మనిషి ఉచ్చస్థితిలో వున్నప్పుడు ఆదరించడం-అభిమానం చూపడం సహజమే' కాని మనిషి ఆపదలో వున్నప్పుడు ఆదుకోవాలను కునేవారు అరుదు. రామస్వామికి తగినంత ఆస్తివుంది. అతను కోరు కుంటే సమయానికి సరియైన వైద్యం చేయించగలిగేవాడు. కాబోయే అల్లుడిపట్ల ఆ మాత్రం అభిమానం చూపించలేక పోయాడు. ఈనాడు వైద్యవిజ్ఞానం బాగా పురోభివృద్ధి చెందింది నయం కావనుకునేరోగాలు నయమౌతున్నాయి. రామస్వామి మీద రంగబాబుకి అసహ్యం వేసింది.

వెంకట్రామయ్యగారి మీద అంతులేని ఆదరం పెరిగింది. ఎవరికెవరు? తాను అతనికేమౌతాడు ? తన ఆరోగ్యంకోసం అత నెందుకు ప్రాకులాడేడు? ఆపరేషను మాటతో అయ్యేదికాదు. తన జీవనోపాధి అయిన షాపుని అమ్మవలసిన అవసరం అతనికెందుకు ? అతని ఋణం తనెలా తీర్చగలడు?

రంగబాబు తిరిగి మనిషయ్యాడు. యథావిధిగా ఉద్యోగంలో చేరాడు.

"రంగబాబు! నీవు అదృష్టవంతుడవని చెప్పే కంటే మా శ్యామల అదృష్టవంతురాలని చెప్పుకోవాలి. ఎంత డబ్బు ఖర్చు అయినా సరే నయం చెయ్యమని డాక్టరుకి చెప్పాను. నాకు కాలునయం చెయ్యడం సాధ్యం కాదన్నారు. వెంకట్రామయ్య నీమీద అభిమానం

చూసినట్లు నటించి నయం చేయించింది తనేనని కోతలు కోస్తున్నాడు. అతను ఖర్చుచేసినడబ్బు పారేస్తాను. ఏమనుకుంటున్నాడో"

పరిస్థితులను అర్థం చేసుకోలేని పసివాడివి మాయమాటలతో మభ్య పరిచే వాచాలత.

"యుగానికి లేని విలువ ఒక్క క్షణం సంతరించుకుంటుంది. జీవితకాలం అంత్యాక్రమించి నిర్మించిన దాన్ని ఒక్క క్షణంలో సమూలంగా నిర్మూలించవచ్చు. మానవతను విస్మరించడం ఒక్క క్షణమైనా పరిణామం భీకరంగా వుంటుంది. నాకు పరిస్థితులు తెలియవని అపోహ పడకండి. కనీసం రక్తదానం చేసినా అవిటిగానైనా బ్రతక గలనన్నారు డాక్టర్లు. మీ రక్తాన్ని సాటి మనిషికి ఇవ్వమని కోరారు. అప్పుడు మీరేం చేసినారు?అవిటివాడికి రక్తం దానం చేసి ప్రయోజనం లేదని, ఆ ఒక్క క్షణంలో మానవత్వాన్ని విస్మరించారు. భగవంతుడి దయవలన నేను బ్రతికాను మనిషినయ్యాను. భగవంతుడు ఎక్కడో అదృశ్యంగా లేడు. మంచి మనుషుల హృదయాల్లో ఆశీనుడై వున్నాడు. ఎంతో ఆస్తిపాస్తులున్న మీరు సాహసించి ఒక మనిషి ప్రాణం నిలపెట్టలేక పోయారు. తన దగ్గర ఏమీ లేకున్నా అతను నిస్వార్థంగా అంతా ధారపోసాడు. ఈనాడు నేను మనిషినయ్యాను అంటే అది శ్యామల అదృష్టం కాదు. క్షితిజ అదృష్టం."

రామస్వామి కోపాన్ని ప్రదర్శించి వెళ్ళిపోయాడు.

రంగబాబు తన మనోవాంఛను వెంకట్రామయ్యకు తెలియ పరిచాడు. ఈ ప్రస్తావన అతన్ని దిగ్భ్రాంతుణ్ణి చేసింది.

"బాబూ' మనిషిని ఆదుకోవటం ఒక అద్భుత విషయమా? కష్ట సమయంలో ఆదుకోవడం మానవధర్మం నీకు రామస్వామి తన కూతుర్ని ఇవ్వాలనుకుంటున్నాడు. నువ్వు ఆ అమ్మాయి పట్ల మొగ్గు చూపావు. నాకు క్షితిజ ఎంతో శ్యామలా అంతే. ఒక చిన్న పొర పాటు మూలంగా ఇప్పుడు నీ నిర్ణయం మార్చుకోవడం సమంజసం కాదు. పైగా ఒక వూరివాళ్ళం. వాళ్ళ కళ్ళలో నేను స్వార్థ పరుడి నౌతాను!"

"ఇది మీ ఔన్నత్యానికి తార్కాణం. మనిషి ఉచ్ఛస్థితిలో వున్నప్పుడు ఆదరించడం అభిమానం చూపడం లోకసహజం. ఆపదలో వున్నప్పుడు ఆదుకునేవారు అరుదు. మీరు రెండో కోవకు చెందుతారు. నా నిశ్చయాన్ని మార్చాలని మీరు తలుస్తే అది దురదృష్టకరం. శ్యామలది అపురూపమైన అందంకావచ్చు. ఆ అందం వెనుక అనురాగం లేదు. ఆత్మీయత లేదు. ఈ ఏక్సిడెంటు మూలాన నాకు కనువిప్పు కలిగింది."

వెంకట్రామయ్య బదులు చెప్పలేదు.

మౌనం అర్థాంగీకారం అనుకోవడంలో రంగబాబు పొరపాటు లేదు.

అయితే బదులు చెప్పవలసిన బాధ్యత క్షితిజదైంది.

"రంగబాబుగారూ! మానవత విస్మరించడం ఒక్క క్షణమే అయినా దాని పరిణామం భీకరంగా వుంటుంది. ఉద్యోగ పరంగా మీరు మా వూరు వచ్చారు. మీకు మొట్టమొదట నీడనిచ్చింది మేము. భారతీయ సంస్కృతికి ప్రతీక మానాన్న. వారి పెంపకంలో పెరిగిన నేను మిట్టమధ్యాహ్నం భోజనాల వేళ వస్తే మీకు బలవంతంగానే కానీయండి భోజనం పెట్టాను. మీరు ఎవరో-ఏ పనిమీద వచ్చారో కనుక్కోవలసిన అవసరం నాకు లేదు. భారతీయ వనితగా నా బాధ్యత అతిథిని ఆదరించడం వరకే పరిమితం. ఒంటరిగా మీరు అవస్తలెందుకు పడాలని మా నాన్న మిమ్మల్ని తమతోపాటే వుండమన్నారు. నెలరోజులు మీరు మా అతిథిగా మెలిగారు. ఆ నెలరోజుల్లో మా ప్రవర్తన ముఖ్యంగా నా ప్రవర్తనలో చెడు గోచరించిందా? మిమ్మల్ని ప్రేమజాలంలో ఇరికించడానికి నేను ప్రయత్నాలు చేసానా? మీ హృదయం మీద చేయి వేసుకొని చెప్పండి. మానవత్వంతో మీ బాగోగులని విచారించడం నేరమా? మీరు చేసిన ఆరోపణ క్షమించ గలిగేదేనా? నిజమే నేను ఎలా జన్మించానో నాకు తెలియదు. కన్న వారెవరో నాకు తెలియదు. కళ్ళు తెరవని పసికందుని ఆదరించడం నేరమా? వెంకట్రామయ్యగారు చేసింది నేరమా లేక న్యాయమా? నా మీద వాత్సల్యంతో అతను పెళ్ళికూడా చేసుకోలేదు. జన్మతః సంస్కారం కాదు. అది పెంచిన పెంపకంలో వుంటుంది. ఒకే తల్లి కడుపున పుట్టిన రెండు చిలకల కథ మీరు చదువుకోలేదా?

నాపేరు క్షితిజ. ఈ పేరే పెట్టాలని నా తండ్రికి ఎందుకు తట్టిందో ఈ రోజు నా కర్థమైంది. భూమి ఆకాశాలు ఒక రేఖ దగ్గర కలిసినట్లు మనం భ్రమిస్తాం. అయితే ఆ రేఖలు కలుసుకోవు. మీ లాంటివారికి అది సాధ్యం కానిది."

క్షితిజ మాటలు రంగబాబుకి తగలవలసిన చోటే తగిలాయి.

ప్రొఫెసర్ బి. ఆర్. కె. రావు

# ఏడవ ప్రణాళికకు అవశ్య మార్గము

ఏడవ పంచవర్ష ప్రణాళిక గమనమార్గ పత్రాన్ని ప్రణాళికా సంఘం తయారుచేసింది. అయినా ప్రణాళిక తుదిరూపం తయారుకు కొన్ని సూచనలు చేయడం భారతదేశ క్షేమం దృష్ట్యా అవసరము. నిర్భయంగా, నిష్పాక్షికంగా ఈ సూచనలు చేస్తున్నాము.

ఇంతవరకు 35 సంవత్సరాలుగా అమలు జరిగిన ప్రణాళికా రచనలో కొన్ని దొసగులున్నా, కొన్ని లాభాలు సమకూరినవి. అంతటితో సంతృప్తి పడకుండా తప్పుల్ని తొలగించి, మంచిని పెంచాలి.

35 సంవత్సరాలు ప్రణాళికా రచన అమలు జరిగినా భారత ప్రజల్లో 50 శాతం మంది దారిద్ర్య రేఖ క్రింద ఉన్నారంటే మన ప్రణాళికా రచనలో కొంత లోపం ఉన్నదని స్పష్టమౌతోంది. ఉద్యోగాలను హెచ్చిస్తున్నా నిరుద్యోగం అంతకంటె హెచ్చుగా పెరుగుతోంది. ఈ నిరుద్యోగం గ్రామాల్లో హెచ్చుగా ఉన్నది. ఇతరచోట్ల పనిదొరకని వారంతా వ్యవసాయాన్ని ఆశ్రయిస్తున్నారు. దేశజనాభాలో నూటికి 70 మంది దారిద్ర్యరేఖకు సమీపంలో ఉన్నారు. ఈ 70 శాతంలో 90శాతం వ్యవసాయరంగంలో బీదరికం అనుభవిస్తున్నారు. కనుక నిజమైన కఠిన సమస్య గ్రామాల్లో వ్యవసాయ రంగంలో ఉన్నది. ఈ సమస్యను సత్వరమే తప్పకుండా పరిష్కరించాలి. చిన్న రైతులు ఉపాంతకర్షకులు, వ్యవసాయ కూలీలు ఈ దారిద్ర్యాన్ని పంచుకొని బాధపడుతున్నారు. దేశంలో రక్తపాతం జరగకుండా వుండాలంటే ప్రజాస్వామ్యం మనాలంటే శాంతంగా అభివృద్ధి సాగాలంటే వీరిపేదరికాన్ని తొలగించాలి.

గ్రామీణ జనాభాలో పట్టణ జనాభా 24 శాతం ఉన్నది. వ్యవసాయ వృద్ధి రేటు కంటె జనాభా వృద్ధి రేటు కొంచెం హెచ్చుగా ఉన్నది. పట్టణ ప్రజల్లోని హెచ్చు అనుపాతం గ్రామీణ బీదల వలెనే పేదరికంతో బాధపడుతున్నారు. వినియోగవృద్ధి రేటు జనాభావృద్ధి రేటుకంటె కొద్దిగా మాత్రమే హెచ్చుగా ఉన్నది. పేదరికం తొలగాలంటే ఈ వినియోగ రేటు చాలదు. దీన్ని తగినంతగా పెంచాలి.

కొంత స్వయం సంపూర్ణత వల్ల గమనార్హమైన స్వయం సంతృప్తిని పొందాము. దిగుమతులు తగ్గించుకోగల్గాము. సాంకేతికులు సాంఖ్యకంగా బాగానే లభ్యమౌతున్నారు. క్షామాలను అరికట్టాము. అయినా నిరుద్యోగము, దారిద్ర్యము పెరుగుతూనే ఉన్నవి. అంటే సాధించిన 3½ శాతం సాలీనా ఆర్థికవృద్ధి రేటు చాలదన్నమాట. అందువల్ల సాధించింది ఇంపుగానే వున్నా, తగినంతకాదని అర్థము. అయితే స్వాతంత్ర్యానికి పూర్వం కంటె పరిస్థితులు మెరుగ్గానే వున్నాయనడాన్ని కాదనరాదు. ఇందువల్ల నిద్రపోకూడదు. అందుచేత ఏడవ పంచవర్ష ప్రణాళికను జరిగిన ఆరు పంచవర్ష ప్రణాళికల కంటె భిన్నంగా రచించాల్సి ఉన్నది.

భారతీయ ఆర్థికాభివృద్ధి వ్యూహంలో మార్పురానిదే 2000వ సంవత్సరం నాటికి చెప్ప దగ్గ ఆర్థిక మెరుగుదలను సాధించలేము. ఆర్థిక పరిస్థితుల్ని మార్చగలవారి ఆలోచనా సరళిలోనే ముందుగా మార్పురావాలి. ఇప్పటికీ ఆరవ ప్రణాళిక సాలీనా 3½ శాతం వృద్ధి రేటునే సాధిస్తూ వుండటం అనుకూలంకాదు ఇప్పటికి విదేశీ ద్రవ్య మారకంలో రూ 1500 కోట్లలోటు వుండటాన్ని భరించలేము. విదేశీ మారకద్రవ్యాన్ని పొదుపుచెయ్యాలి, విదేశీ మారకద్రవ్యంతో అవసరంలేని ఆర్థిక కార్యక్రమాలనే ఏడవ ప్రణాళికలో చేపట్టాలి. ఆర్థిక గుత్తాధిపత్యాన్ని పెంచేరాయితీలను అంత మొందించాలి. ఆర్థిక రక్షణతో గుత్తసంస్థలు ఉత్పత్తిచెయ్యడం వల్ల ఉత్పాదన ఖర్చులు పెరిగినవి. ఉత్పాదన ఖర్చులు పెరిగితే ధరలు పెరిగినవి. అందువల్ల మనవస్తువులు విదేశవిపణి వీధుల్లో వ్యాపార పోటీలో విదేశవాణిజ్యం ముందు ఓడిపోతున్నవి.

దేశీయ విపణి వీధుల మీద బ్రతకగల వస్తువుల్ని తయారు చేసి అమ్మే పరిశ్రమల్ని హెచ్చుగా వృద్ధిచేయడం అవసరం. ఈ పరిశ్రమలు వ్యవసాయ గ్రామీణ ఆర్థికవ్యవస్థల మీద ఆధారపడితే మంచిది. అంటే ఎగుమతివస్తువుల్ని ఉత్పత్తి చెయ్యవద్దని, ఎగుమతుల్ని ఆపమని చెప్పడం లేదుసుమా ! విదేశీ మారకద్రవ్య సముపార్జనకు ఎగుమతి వస్తువుల్ని ఉత్పత్తి చేసి విదేశాల్లో అమ్మడం ఎంతవరకు అవసరమో అంతవరకు చెయ్యాలి.

వ్యవసాయం మీద హెచ్చుమంది ఆధారపడి, వ్యవసాయమే హెచ్చుగా నిరుద్యోగుల్ని ఆదుకుంటున్నప్పుడు ఏడవప్రణాళిక తప్పవిసరిగా వ్యవసాయ రంగమంతటిని అన్నికోణాల నుండి అభివృద్ధి చెయ్యటానికి పూనుకుతీరాలి. అందువల్ల వ్యవసాయరంగాభివృద్ధి కవసరమైన ఉత్పత్తి కారకాలను, వ్యవసాయకుల కవసరమైన వినియోగ వస్తువుల్ని హెచ్చుగా ఉత్పత్తి చెయ్యాలి. అందు కవసరమైన పరిశ్రమల్ని గ్రామీణ రంగంలో అభివృద్ధి చేస్తే గ్రామీణ ఆర్థికవ్యవస్థ అభివృద్ధిచెంది గ్రామాల్లోని దారిద్ర్యం తగ్గుతుంది. వ్యవసాయాభివృద్ధి

వల్ల దేశ రక్షణ చేసే సైనికులకు ఆహారము, పరిశ్రమలకు ముడి పదార్థాలు, కార్మికులకు ఆహారము, ప్రజాస్వామ్యం బలపడటానికి ఆహారలబ్ధి ద్వారా సంతృప్తి లభ్యం కాగలవు.

పారిశ్రామికాభివృద్ధికి వ్యవసాయ రంగంలో లభ్యమయ్యే మిగులు కీలకమన్న విషయం మొదటి పంచవర్ష ప్రణాళిక కాలం నాటికలి నేడుకూడా నిజమే.

మనపొదుపు రేటు మూడురెట్లు పెరిగింది. అయినా మన ఆర్థిక వృద్ధిరేటు ముందంజ వెయ్యటంలేదు. ఎందువల్లనో తెలుసునా! మన మూలధన; ఉత్పత్తి నిష్పత్తి పెరుగుతూ వుండటం వల్లనే ఈ అవాంఛనీయ ఆర్థికస్థితిఏర్పడింది. పరిశ్రమల కవసరమైన అవస్థాపనకు కావలసిన వస్తువుల్ని మనమింకా దిగుమతి చేసుకుంటూ వుండడం వల్లనే ఈ దుస్థితి కల్గుతోంది. దీన్ని నివారించడానికి వేతన- వస్తునమూనా ప్రణాళికా రచన కావాలంటున్న ప్రొఫెసర్ బ్రహ్మానంద, సుప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త, ప్రణాళికా సంఘం సభ్యుడు ప్రొఫెసర్ సుకుమాయ్ చక్రవర్తి, ఆర్థిక కమీషన్ చైర్మన్ (రిజర్వ్ బ్యాంకు పూర్వపు గవర్నర్) రూ తన అభిప్రాయాన్ని బలపరుస్తున్నారని తిరుపతిలో శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం సెనేట్ హాల్లో చేసిన ఉపన్యాసంలో చెప్పారు.

నేటి ప్రణాళికారచన నమూనాకు ఒకగంపవస్తువుల్ని తయారు చేయడానికి ఆరు రూపాయలు అవసరమైతే, వేతన-వస్తు ప్రణాళికా రచన నమూనా ఆ గంపవస్తువుల్ని నాల్గురూపాయిలకే తయారుచేస్తుందని ప్రొఫెసర్ బ్రహ్మానంద ఉద్ఘాటించారు. వ్యవసాయోత్పత్తి కవసరమైన వ్యవసాయ ఉత్పత్తి కారకాల ఉత్పత్తికి ఒకరూపాయి ఖర్చుచేస్తే అందువల్లవచ్చే ఉత్పత్తిని ఉపయోగించి పరిశ్రమల్లో రెండురూపాయిల విలువగల వస్తువుల్ని ఉత్పత్తి చేయవచ్చని బ్రహ్మానంద బారంబారాటుగా చెబుతున్నారు.

అందువల్ల ఏడవప్రణాళికకు నూతన అభివృద్ధి వ్యూహంకావాలి. ఈ ప్రత్యామ్నాయ వ్యూహాన్ని తయారుచేయడానికి, అనువర్తింపు చేయడానికి రాజకీయ శక్తి పూనుకోవాలి. తద్వారా ఏడవప్రణాళిక చత్రపు- మార్పును పొందాలి.

ఆర్థిక వ్యత్యాస నిష్పత్తి ద్విగుణీకృత మయ్యింది. ప్రస్తుత వ్యవస్థలో బీదవానికంటె ధనికుడు హెచ్చుగా లభ్యం చేసుకుంటున్నాడు. ఇది తగదు. ఈ ప్రపతూడకారకాన్ని ఆపాలి. అందుకు ద్రవ్యోల్బణాన్ని ఆపాలి: ఇతర చోట్లజరిగే అనుత్పాదక ఖర్చులను ఆపటంతో పాటు రాజకీయ జూదానికి చేసే అవినీతికరమైన కోట్లవ్యయాన్ని ఆపితీరాలి. వేతన- వస్తు నమూనా ప్రణాళిక రచన అమలుకు హెచ్చుగా విదేశీ మారకద్రవ్యం అవసరం కాదు. వ్యవసాయోత్పత్తులకు హెచ్చుగా డిమాండ్ వున్నవిషయాన్ని గమనించి ఏడవప్రణాళిక వాటి ఉత్పత్తి పూనుకోవాలి. అయితే అవసరమైన మేరకు రక్షణపరిశ్రమల్ని ఇతర పరిశ్రమల్ని అభివృద్ధి చెయ్యటం కాదనము. ముఖ్యంగా వ్యవసాయ రంగాభివృద్ధి కవసరమైన పరిశ్రమల్ని తగినంతగా అభివృద్ధి చెయ్యాలి.

ఏడవ ప్రణాళిక కవసరమైన కొన్ని ముఖ్యవిషయాల నిర్దేశం పొందుపరుస్తాను.

1 పెట్టుబడివల్ల వచ్చేఉత్పత్తిని లాభదాయకమైన నిష్పత్తిలో పొందాలి. అంటే మూలధన, శ్రామిక సామర్థ్యము పెరగాలి. ఇందుకు అనువైన సాంకేతిక పద్ధతిని ప్రవేశపెట్టడానికి వెనుకాడరాదు.అయితే నిరుద్యోగం తొలగాలి కాబట్టి టెక్నాలజీ నిరుద్యోగం పెంపుదలకు తోడ్పడరాదు. ఈ సమన్వయాన్ని జాగ్రత్తగా సమకూర్చవలసి ఉన్నది.

2 అవసరమైనమేరకు రక్షణ పరిశ్రమల్ని, ఇతర పరిశ్రమల్ని అభివృద్ధిచేసుకోవచ్చు. కాని వ్యవసాయ రంగాభివృద్ధికి, వినియోగ వస్తూత్పత్తికి అవసరమైన పరిశ్రమల అభివృద్ధికి సముచిత ప్రాధాన్యత నివ్వాలి. పారిశ్రామికంగా వెనుకబడి వున్న ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాల్లో తగిన పరిశ్రమలను నిర్మించవచ్చు.

3. నిరుద్యోగాన్ని తొలగించాలి. ముఖ్యంగా గ్రామీణ నిరుద్యోగం తొలగాలి. ఇందువల్ల దారిద్ర్యం తొలగాలి.

4. గుణాత్మకమైన సాంకేతిక, వృత్తి విద్యలు అభివృద్ధి చేయబడాలి. ఏదురభిమానాలకు లోనుగాకుండా ఔచిత్యం గల ఉపాధ్యాయులకు,విద్యార్థులకు మంచిని తగినన్ని విధాల చేకూర్చాలి. విద్యా రంగంలో వున్న దురభిమానాల్ని, దౌష్ట్యాలను, అవినీతిని, అసమర్థతను, ధనలోభాన్ని తుడిచిపెట్టాలి. విద్యారంగాభివృద్ధి కవసరమైన వసతులన్నింటిని అందించాలి.

5. వ్యవసాయ రంగాభివృద్ధికి అవసరమైన హంగులన్నింటిని సమకూర్చాలి.హరిత విప్లవాన్ని విజయవంతం చెయ్యాలి. వ్యవసాయాభివృద్ధికవసరమైన సర్వ నీటిపారుదల సౌకర్యాలను, యంత్రాలను, టెక్నాలజీని, ఎరువులను, మేలువిత్తనాలను, మందులను అందించి తీరాలి. హరిత ప్రక్రియవల్ల, యంత్రసమన్విత వ్యవసాయం వల్ల గ్రామీణ రంగంలో సాలుకు పన్నెండు నెలలూ పని లభ్యమౌతుంది. ఇందువల్ల వేతనాలు అంది పేదరికం తొలగుతుంది.

6. రాజకీయాలలో జ్ఞానాభివృద్ధి నీతి, కార్యదక్షత, సమర్థత, దేశభక్తి, అవకాశవాద రాహిత్యత, పదవీకాంక్షారాహిత్యత, సేవాదీక్ష మొదలైన సుగుణాలు పెరిగితేనే ఆర్థిక అభివృద్ధికి కావలసిన నాయకత్వం లభ్యమై పేదరికం బాగా తగ్గిపోవడానికి వీలుంది. రాజకీయ అస్థిమితం కల్గించే చర్యల్ని ఆపివెయ్యాలి.

7. జనాభావృద్ధి రేటును తగ్గించడానికవసరమైన చర్యలన్నిం టిని తీసుకోవాలి.

8. రాజకీయ బద్మాషీని, చీకటి వ్యాపారాన్ని, ధరల పెరుగుదలను, ద్రవ్యోల్బణాన్ని ఆపి, శ్రామికుల్లో దేశభక్తి పెరిగే ఏర్పాట్లను పెంచి తద్వారా ఉత్పత్తిని పెంచి, ఆహారోత్పత్తిని బాగా పెంచి అందరికి తగిన ఆహారము, కనీస వసతి గృహము, కనీసపుదుస్తులు, కనీసపుపని, కనీసపువేతనము, సకాలంలో తగిన పెన్షనును అందించి దారిద్ర్యాన్ని బాగా తగ్గించి దేశంలో రక్తపాతం రాకుండా చూచి అభివృద్ధి ద్వారా పురోగమనాన్ని, శాంతిని, శ్రేయస్సును సమకూర్చాలి.

---

# నిస్సహాయతా పర్వం

## శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు

నేను
తమస్స మాధిలో
ముక్కు మూసుక్కూర్చున్న మునీశ్వరుణ్ణి;
పాపాలకొండలు బద్దలుచేయలేక
నిస్సహాయంగా నిలుచున్న
వజ్రాయుధం లేని యింద్రుణ్ణి —

అసమానతా రుగ్మతల మధ్య
అనారోగ్య కల్మష కుటీరంలో
అనవరతం ఆశయాలు తుమ్ముతూ
ఆదర్శాలు చీదుతూ
మాట నిలబెట్టుకోడానికి
ఆశల ఆలిని అమ్ముకొని
తనయుణ్ణే కాక మనమణ్ణి కూడా
తాకట్టు పెట్టుకొని, పోగొట్టుకొని
జీవితం కాటికాపలా కాస్తూ
ఛిద్రంతో, దరిద్రంతో కాపురం ఈడుస్తున్న
సత్యహరిశ్చంద్రుణ్ణి—

నీతి సీతని
నా జీవితాగ్ని పునీతని
రాక్షస రాజకీయుడెత్తుకొనిపోతే
విరహదగ్ధ తమోభిన్నం
ఒళ్ళంతా రాసికొని
ఏడుస్తూకూచున్న రఘురాముణ్ణి—

ఎక్కు పెట్టబడ్డ
గాండీవ దారుణాస్త్ర సముదయం
మొక్కవోయి, చిక్కువడి
స్తంభించి ఊరుకొంటే
దిక్కుతోచక చూస్తున్న ఫల్గుణుణ్ణి —

నానానేక సామాజిక పరిస్థితుల
ప్రాబల్య పాశవ దురహంకారాలు
శాపాలై, నాపాలిటిపాపాలై వెన్నంటు తుంటే
నిర్దాక్షిణ్యంగా చంపబడుతున్న కర్ణుణ్ణి—

అఖండ భూమండలం మీద
మానవతా కేతనం ఎత్తాలని ఎత్తిన
నా కరాగ్రాంగుళులు
అస్మదాచార్యులు ద్రోణులు
అడిగితే ఖండించు కొన్న ఏకలవ్యుణ్ణి—

నేను మనిషిని
మామూలు మనిషిని
నిరుపయోగమైను ఋషిని—

# హృదయమా... సాగిపోమ్మా



ఇచ్ఛాపురపు రామచంద్రం

"రండి డాక్టర్!" చిరునవ్వుతో ఆహ్వానించింది నర్స్ లాబొరేటరీ నించి వార్డ్ వేపు వొస్తున్న డాక్టర్ రిషిని.

"ఆరూ. ఏడూ ఎలాగ ఉన్నారు?" ఆత్రంగా అడిగాడాయన ఆమెని చూస్తూనే-మిగిలిన చాలా విషయాలు మరచి.

"ఆరు - లంగ్ పేషెంట్ మెరుగౌతున్నాడు. కాని....ఏడు.... హార్ట్ పేషెంట్.... నిజంచెప్పాలంటే-క్షీణిస్తూంది పరిస్థితి." మెల్లగా అంది నర్స్. అతనొక నిట్టూర్పు విడిచి బెడ్స్ వద్దకు నడిచాడు. లంగ్ పేషెంట్‌తో చాలా ఉత్సాహంగా మాట్లాడాడు. హార్ట్ పేషెంట్‌ని పలకరించేందుకే ఎంతో ప్రయత్నంచేయవలసి వొచ్చిందిఓడిపోడం తధ్యమని తెలిసి ఉత్సాహపరచడానికి లాగ. ఓడిపోతున్నది ఆ పేషెంట్ కాక తనే అనిపించిందతని కాక్షణాల్లో. అక్కడ ఉండలేక పోయినట్లు.

"నేను వెళ్తాను సిస్టర్...." అంటూ వార్డు నుంచి బయటకు వచ్చాడు. అతను తీవ్రంగా ఆలోచిస్తూ గార్డెన్ వేపు నడవసాగాడు. ఆ హార్టు పేషెంట్‌ని తను రక్షించలేడు - అనే భావం నిరుత్సాహ పరచి వొదులుతోంది. అతనిమీద జాలిగా ఉంది - చచ్చిపోతాడని - తన మీద తనకే కోపంగా ఉంది. రక్షించలేకపోతున్నానే అని.

అతను గార్డెన్‌లోకి వొచ్చేసరికి - చీకటిపడి - చందమామ వొస్తున్నాడు. అక్కడ రిషికి కొంచెం కొత్త సన్నివేశం ఎదురయింది. ఆశ్చర్యకరంగా. టీపాయ్ చుట్టూ నాలుగు కుర్చీలు. యామినితోపాటు మరో యిద్దరు యువకులు. వాళ్లు డాక్టర్‌కి నమస్కరించారు లేచి నిలబడి.

"పరిచయాలువింటూ టీ తీసుకోండి. మీరు చాలా అలసిపోయి నట్లున్నారు." కోపాలోంచి టీని కప్పుల్లో పోసి మొదటితండ్రికిఅందించింది యామిని.

"నా పేరు ప్రసాద్. యామినితో కలిసి చదివాను. యామిని నెంత ప్రేమించానో మాటలతో చెప్పలేను."

"ఓహో!" నవ్వాడాయన యామిని వేపు నువ్వేంమటావన్నట్లు చూస్తూ.

ఆమె తలవొంచుకుని.... కాని... నేను ... శేఖర్‌ని ప్రేమించాను." అంది మెల్లగా . ఎందుకో ఆ కంఠంలో తొణికిసలాట.

"అలాగా, ఐతే మీరు-" అతనివేపు చూస్తూ- "శేఖరన్న మాట. అభినందనలు. అన్నట్లు... యింతకీ మీరు యామినిని ప్రేమిస్తున్నారా?" ఆత్రంగా అడిగాడు రిషి.

"కాని... నన్ను యామిని చేసుకోడం నాకిష్టం లేదు,"

ఉలిక్కిపడ్డాడు రిషి. అమ్మాయంటే ఆయనకి పంచప్రాణాలు. శ్రీధరి చాలాకాలం క్రిందట చనిపోయింది. తనకి ఆమె గుర్తుగా యామినిని వొదిలి. అమ్మలేని ఆ అమ్మాయిని ప్రాణం కంటె ఎక్కువగా ప్రేమిస్తూ పెంచుతున్నాడు, ఆయనకి ఒక కన్ను వైద్య శాస్త్రమయితే రెండోకన్ను యామిని. ఆమెకే విధమయిన లోటూరాకూడదు జీవితంలో.

"ఎందుకని భయంగా అడిగాడు ?"

నాకు హృదయభాగంలో తరచుగా నొప్పి వస్తూంటుంది, ఉధృతంగా, బహుశా నేను హార్టు పేంషెటునేమో!"

డాక్టర్ రిషి విభ్రాంతుడయ్యాడు. శేఖర్‌కి హృదయ సంబంధ వ్యాధా!

"మీరొక్కసారి పరీక్షించి చెబితే.... మేము వొచ్చిందందుకే డాక్టర్!" ప్రార్థిస్తున్నట్లన్నాడు ప్రసాద్.

"రండి -" అంటూ శేఖర్ చెయ్యి పట్టుకుని హాస్పిటల్ భవనాల వేపు నడిపించుకు వెళ్ళాడు. డాక్టర్,

కొన్ని గంటల అనంతరం - ఒక్కడే తిరిగి వచ్చాడు తను ప్రసాదూ, యామినీ నిరీక్షించి నిరీక్షించి చాలా అలసిపోయాక

ఒంటరిగా వొస్తున్న డాక్టరేం చెబుతాడో అని వారి గుండెలు విపరీతమయిన భయంతో చాలా వేగంగా కొట్టుకుంటున్నాయి.

అతను కుర్చీలో నీరసంగా కూలబడి - "వెరీ సారీ. శేఖరం హార్టు చాలా చెడిపోయింది. మందులూ, చికిత్సా రిపేర్ చేయలేనంతగా" అన్నాడు చాలా జాలిపడుతున్నట్లు పరిస్థితికి,

ఆయన మాటలు - వారిద్దరికీ పిడుగులు పడ్డట్టే వినిపించాయి. కొన్నినిముషాలు వారి ముగ్గురి మధ్యా అతి భయంకరమయిన నిశ్శబ్దం ఆవరించింది.

"రిపేర్ చేయలేనంతగా.... కాని...రీ ప్లేస్ చేయలేనంత కాదుగా? హటాత్తుగా అప్రయత్నంగా అన్నాడు ప్రసాద్. ఆ మాటలు అతను సహజంగా అన్నట్లు లేవు. ఏదో శక్తి ఆవహించి అనిపించినట్లు. ఉలిక్కిపడ్డాడు డాక్టర్. ఒక్కసారి కళ్ళముందు-శతకోటి కాంతుల విద్యుల్లత మెరిసినట్లు. ఆ మెరుపు అతనిలో ఎంతో ఆశ, ఆనందాలతో పాటు - ఆందోళననీ భయాన్నీ కూడా కలిగించింది.

మూసుకున్న అతని కనుల వెనుక......

లాబొరేటరీలో.... క్లాంప్‌లకి బిగించబడిన కోతులు...రెండూ ఒక దానికొకటి సమీపంగా... అక్కడక్కడ రక్త బిందువులు స్రవిస్తూ. వాటిమీద ప్రయోగం చేశాడు తను. ఆరోగ్యకరమయిన ఆ రెండు కోతులకీ ఒకదాని హృదయం మరోదానికి మార్చుచేశాడు-నిన్న, ఇవాళ్టివరకూ అవి రెండూ బాగానే సజీవంగానే ఉన్నాయి!

కుక్కలఊపిరితిత్తులు (లంగ్స్) మార్చి చేసిన ప్రయోగానికి అది యిచ్చిన ఉత్సాహానికి పరిణామమిది' హాస్పిటల్లో హార్టుపేషెంట్ చేరాక - అవసరం కలిగించిన ఆలోచన కలిగించిన-కోతుల హృదయం మార్పిడి.

హార్టుమీద అది తొలి ప్రయోగం. సజీవంగా ఉన్న ఆ కోతుల మీద ఎంతో ప్రేమ కలిగింది-ఆటగాడికి తనకి విజయం చేకూర్చిన బంతి మీదలాగ.

కాని - అవి కోతులు. వాటిదీ ప్రాణమే అయినా - మనిషి ప్రాణం.

వాటిమీద చేసే ప్రయోగాలు. వాటి ఫలా ఫలా లెలా ఉన్నా ఎక్కువ చింతించ నక్కరలేదు. మనిషి సంగతి వేరు. తను ఒక మనిషిగా - మిడి మిడి జ్ఞానంతో-మరో మనిషి జీవితం మీద ప్రయోగం చేసే అధికారం తనకిలేదు ప్రాణాలతో చెలగాటమాడే హక్కు-తనకి లేదు.

"ఆరోగ్యవంతుడినైన నాలో నిశ్చయంగా ఆరోగ్యవంతమయిన హృదయం ఉండి తీరుతుంది. దానిని తీసి-శేఖర్ కమర్చండి"

"కాని నువ్వు మరణిస్తావు!" ఎలాగో అన్నాడు వొణుకుతూ.
కాని.... శేఖర్.... యామిని ప్రేమించిన శేఖర్ సుఖంగా యామినితో ఉంటాడు. ఆమె ప్రేమని పొందలేని నేనెలాగూ మరణించడానికే నిశ్చయించుకున్నాను. నేను కోరుకునేది యామిని సుఖసంతోషాలు. ఆమె కోసం ప్రాణమిస్తాను. అదేనా ఆనందం.

డాక్టర్ హృదయం గంతులువేసింది ఆనందంతో ఒక్షణం. ఎటువంటి సువర్ణావకాశమిది!హృదయం మార్పిడి.వైద్యశాస్త్రానికేమిది సరికొత్త ప్రక్రియ. ఏశాస్త్రజ్ఞుడూ దీని వేపింతవరకూ దృష్టిసారించిన దాఖలాలులేవు. తనకెంతఅపురూపమయిన అదృష్టం వరిస్తుంది. ప్రయోగానికొక మనిషి,ఆరోగ్యవంతమైన హృదయం.ప్రసాద్ కంఠంలో ఎంత నిశ్చయం.ప్రేమకింతబలముంటుందా త్యాగంచేసేశక్తిఔన్నత్యమూఉన్నాయా?

"కాని.. ప్రసాద్!.. ఈ ప్రక్రియ.. దీన్ని హార్ట్ ట్రాన్స్‌ప్లాన్టేషనే అనాలో, గ్రాఫ్టింగ్ అనాలో.. ఇది వైద్యశాస్త్రానికే విమాత్నం. దీనికింకా నామకరణమే జరగలేదంటే " డాక్టర్ మెదడు_ సజీవమయిన శిశువుని ప్రసవించే ముందు మాతృమూర్తిలా వేదన పడుతోంది. "మీరు పేరూపెడతారు, ప్రక్రియా మొదలు పెడతారు." నవ్వాడతను. "వేనా" ఆనందం.. ఆశ్చర్యం.. ఆందోళన.. భయం.. అన్నీను. ఒక అపూర్వమయిన.. అద్భుతమయిన.. విమాత్నమయిన.. ప్రపంచ గతినీ.. వైద్య విజ్ఞాన పథాన్ని మార్చివేయగలిగే అవకాశం. ఎంత అదృష్టం చేసుకుంటే లభిస్తుంది?

"వొద్దు_" అన్నాడు రిషి. అతని కంఠం వొణుకుతూంది.

"ఎందుకని?" వాడిగా ధ్వనించింది ప్రసాద్ కంఠం.

"హృదయం గురించి వైద్యరంగంలో తగినన్ని పరిశోధనలు జరగలేదింకా. లక్షణాలూ, స్వభావాలూ, చిత్రాలు, విచిత్రాలూ బయటపడలేదు. స్పాంజిముక్కవంటి హృదయం- శాస్త్రజ్ఞుడికింకా కొరుకుడు పడడంలేదు. ఒకరక్తాన్ని మరోమనిషిలో ఎక్కించడానికి పాటించవలసిన నియమాలూ తీసుకోవలసిన జాగ్రత్తలూ వలె ఒకమనిషి హృదయాన్ని మరోమనిషి కమర్చడంలో ఏం జాగ్రత్త లవలంబించాలో తెలియదు. మనిషినుంచి వేరు చేయబడిన హృదయం ఎంతసేపు మనగలుగుతుంది? హృదయాన్ని తొలగించిన మనిషిని కృత్రిమ ఉపకరణాలతో ఎంతసేపు ప్రాణాలతో ఉంచగలం? అన్నీ ప్రశ్నలే," నిస్పృహగా ఉంది డాక్టర్ కంఠం.

"ప్రశ్నలకి జవాబులు యిచ్చేది పరిశోధన. పరిశోధనకి ప్రాణం ప్రయోగం,ప్రయోగం చేయనిదే ఫలితాలురావు, ఆప్రయోగం నామీద చెయ్యండి డాక్టర్ తొలిసారిగా." నిర్ణయంతో కూడినట్లు ఇతనిమాటలు- డాక్టర్ హృదయాన్ని ఊయలలూపుతున్నాయి అతనిమీద- ప్రయోగం చేస్తే? ఆత్రత.. భయం..

"తరువాత.. కొంచెంసేపు- మీరు- హృదయం అనే మాటకు కండరం అనేలా భౌతికమయిన అర్థం వొదిలి - ప్రేమ అనే ఊహతో నామాటలర్థం చేసుకుందుకు ప్రయత్నించండి. ప్లీజ్."

"ఏమిటి?"

"భౌతిక హృదయం కుంటుపడితే మానవ శరీరం ఎలా కుంటుపడుతుందో కాల్పనిక హృదయం దెబ్బతింటే మానవ జీవితమూ అలాగే తల్లక్రిందులౌతుంది. హృదయం- ప్రేమని- మనిషి ఒక్కసారే ఒక్కరికే యివ్వగలదు. ఒక్కరి హృదయాన్నే స్వీకరించగలదు. నేను ప్రేమించిన యామిని సౌఖ్యంకోసం ఆనందంగా నేను నా హృదయాన్ని త్యాగం చెయ్యగలను. నా జన్మని ఆలాగ ధన్యం చేసుకోవాలనే నా ఆకాంక్ష, అదే నా జీవితధ్యేయం. యామిని ప్రేమని- పొందలేకపోయిన నేను ఆత్మహత్య చేసుకుందుకు నిశ్చయించుకున్నాను. నాశరీరంలోని భౌతిక హృదయం- నేను ప్రేమించిన అమ్మాయి సుఖజీవనానికీ; వైద్యశాస్త్రాన్నే క్రొత్త మలుపు తిప్పి సకలమానవాళికీ ఉపకరించే మీప్రయోగానికీ కూడా వినియోగించ బడుతుందంటే- నాజన్మచరితార్థ మౌతుందని నాకెంత సంతోషంగా ఉందో!"

డాక్టర్ గొంతుకేదో అడ్డం పడినట్లయింది. సవరించుకొని-" ఇప్పుడు- శేఖరొక్కడే మృత్యువుకి చేరువలో ఉన్నాడు, ప్రస్తుత వైద్యశాస్త్ర పరిజ్ఞానాన్ననుసరించి- నీ హృదయం తీయడమంటే- నిన్ను నిలువునా హత్యచెయ్యడమే. సారీ! నేను డాక్టర్నే కాని- హంతకుణ్ణి కాలేను."అన్నాడు, చాలా తగ్గు స్వరంతో."రేపు చనిపోయే మనిషిని- ఏ మహత్తర ప్రయోజనం కోసమయినా సరే- యివాళ చనిపోమంటే అతను ఎంత మాత్రమూ అంగీకరించడు. మనిషి ప్రాణానికున్న విలువ అది."

ప్రసాద్ నవ్వాడు. "ఐతే- అతనితో ప్రాణమే తప్ప ప్రేమ లేదన్నమాట! డాక్టర్ ముఖం చిట్లించాడు ఆలోచనలో పడ్డట్టు. హృదయంలో- కర్ణికలూ, జఠరికలూ కవాటాలూ, రక్తనాళాలూ- యిటువంటివే తప్ప ప్రేమనే పదార్థమున్నట్లు ఏశాస్త్రవేత్తా పేర్కొనలేదే! శాస్త్రజ్ఞుడి శోధనకందని యీ ప్రేమలో జీవితాన్నే త్యాగం చేసుకోగలిగే శక్తి ఎలా ఉంది?

"డాక్టర్! ఒకవిషయం గుర్తించండి. బతకాలనుకునే వాణ్ణి బలవంతంగా చంపడం సాధ్యమేమో కానీ ఆత్మహత్యచేసుకుని అయినా చచ్చిపోవాలనుకునే మనిషినెవరూ బలవంతంగా ఆపలేరు. చచ్చిపోతున్న నా శరీరాన్ని- వైద్య విజ్ఞానపురోభివృద్ధికీ మానవజాతికీ, మానవాళిసేవకీ వినియోగించుకోక వ్యర్థ పరుస్తున్న మీరు- వైద్య శాస్త్రానికీ మానవజాతికీ కూడా ద్రోహం చేస్తున్నట్టే. నాచావుకి మీ బాధ్యతలేకుండా న్యాయసమ్మతమయిన కాగితాలూ రుజువులూ నేనే ఏర్పాటు చేస్తాను. మీరు నాసూచనని అమలు జరిపేసాహసం చేయగలిగితే.... కర్తవ్యం నిర్వహించగలిగితే.... "చివరి అస్త్రం ప్రయోగించి వెళ్ళిపోయాడు.

ఇంక డాక్టర్ రిషికి నిద్రాలేదు, ఆహారమూ లేదు.

ప్రయోగ శాలలోనే గడుపుతూ ఉండిపోయాడు. స్థానికంగా అతనికీ అతని హాస్పిటల్‌కీ మంచి పేరుండడంతో మిగిలిన డాక్టర్లందరూ అతనికి శిష్యసమానులే. వారిని పిలిచి సమావేశాలూ సంప్రదింపులూ జరిపాడు। తను లోగడ యితర విషయం మీద మెడికల్ జర్నల్స్‌కి పంపి ప్రచురించిన ఆర్టికల్స్‌ని ఎందుకో మళ్ళీ చదివాడు-అవి తన కర్తవ్యాన్ని సూచిస్తాయేమో అన్న ఆశతో. చివరకు - ఆ దినం రానేవచ్చింది. అది మహత్తరమయినది. మహాభయంకరమైన దినం.

షవర్ కింద స్నానం చేస్తూంటే - మనసు ఎక్కడో తేలిపోతూంది.

ఎర్రగా ఆపిలు పండులా - సజీవమూర్తియైన ఆరోగ్యవంతమైన హృదయం.... నీలంగా.... నీరసం గొల్పుతూ.... రోగగ్రస్తమైన హృదయం చైతన్యానికి ప్రతీకలా ఆ ఎర్రని హృదయం.... వైద్య విజ్ఞానాన్ని దీనంగా బతిమాలుతున్నట్టు.... బేలగా.... జాలిగా.... నీలిహృదయం.

ఎరుపు.... నీలం ఆరోగ్యం - రోగం; జీవం - మృత్యువు. శేఖరంలోని నీలిహృదయాన్ని ఎర్రగా మార్చడం సాధ్యమేనా ?

ఆపరేషన్ థియేటర్‌లోకి రావలసిన డాక్టర్లందరూ వొస్తున్నారు. సమయందగ్గర పడుతోంది. వైద్యశాస్త్రానికే వింత అయిన హృదయపు మార్పిడిని కనులారా చూసి తరించడానికి.... నేర్చుకోడానికి... తెలుసుకోడానికి.. ఉత్సాహపరతులయిన డాక్టర్లందరూ వొస్తున్నారు.

చేతులని ఏంటీ సెప్టిక్ లోషన్‌తో కడుక్కుంటున్నాడు డాక్టర్ రిషి. రక్తాన్ని పరిశుద్ధంచేసే క్లిష్టమయిన ప్రక్రియను నెరపే ఊపిరితిత్తులు గురించి చాలానే తెలుసుకోగలిగిన వైద్య శాస్త్రం— పరిశుభ్రం గావించబడిన రక్తాన్ని శరీర భాగాలకీ, అపరిశుద్ధ రక్తాన్ని ఊపిరితిత్తులకీ పంపే రవాణా కార్యక్రమం మాత్రంచేసే హృదయం గురించి ఎక్కువ తెలుసుకోలేకపోయిందింకా. స్పాంజిముక్కలాటి.. హృదయకండరం" వైద్యవిజ్ఞానానికే అందని చందమామలా ఉండిపోయింది. ఆ చందమామ అందుతుందా ? దాన్నందుకునే ప్రయత్నం చేసే అవకాశం- అదృష్టం. అయాచితంగా అనూహ్యమయిన రీతిలో తనని వరిస్తున్నాయి.

అతని కపరిమితమయిన ఆనందం. అంతులేని ఉత్సాహం. తన ప్రయోగం సాహసం....సఫలమైతే... మనిషి మనుగడే మలుపు తిరుగుతుంది. వైద్యశాస్త్ర క్రమశిక్షణ విజయవంతంగా మానవశరీర స్థితిలో మరి కొంతభాగాన్ని లొంగదీసుకుంటుంది: విఫలమయితే ?

ఒక ఆరోగ్యవంతుడైన యువకుడు బలి అయిపోతాడు. తనలో పట్టుదల మరీ పెరిగి- విజ్ఞాన తృష్ణా వ్యసనంలో పడి-కోతులనీ కుక్కలనీ కుందేళ్లనీలాగే మనుషులని కూడా ప్రయోగాలకి చంపుతూపోతాడు. జిగీష తనని నిలవనీయదు. ఈ ప్రయోగం విఫలమైతే. డాక్టరుగా తనకున్న పేరుకి మచ్చ వొస్తుంది. మంచీ చెడూ విచక్షణని నశింపజేసే వ్యసనం-హృదయాన్ని జయించాలనే-జిగీష-తననెలాగయనా మార్చవొచ్చు.

చేతులకి రబ్బరు గ్లవ్స్ వేసుకుంటూంటే అతని చేతులు వొణికాయి. అప్రయత్నంగానే అతను చేతులురెండూ జోడించి కళ్లుమూసుకున్నాడు.

"భగవంతుడా ! నువ్వే నన్ను అర్థంచేసుకుని ఆశీర్వదించాలి. శరీరంలో కొంత భాగంగురించి తెలుసుకోగలగడమే-మిగిలిన భాగాలని కూడా జయించాలనే తృష్ణని రేకెత్తిస్తూంది నాలో. విజ్ఞానం విజ్ఞానాన్ని కోరుతుంది. విజ్ఞానం క్లిష్టమయిన మార్గంలో అయినా సరీ సాహసంగా ఉరుగెత్తమంటుంది మానవుణ్ణి."

మహాశక్తివంతమయిన వెల్లువలా తన మీదకు వొచ్చిపడిన యీ అవకాశం ఒక్కొక్కసారి అగ్నిపరీక్షలాగ అనిపించి అతని హృదయాన్ని డోలాయమానం చేస్తూంది. ఇది అదృష్టమో...అగ్నిపరీక్షో తేలకుండా ఉందతనికి. హృదయం- ఆగని ఊయలే ఔతుంది. తను ప్రాణంపోసే ధన్వంతరి కాబోతున్నాడా, ప్రాణంతీసే హంతకుడా,

ఆక్షణాలు.... పరీక్షాక్షణాలు వేగంగా దగ్గర పడుతున్నాయి. డాక్టర్ రిషి-వార్డ్ వేపు నడిచాడు. అప్పటికే ఆపరేషన్ థియేటరుని సన్నద్ధంచేసి ఉంచారు నర్సులు. డాక్టర్ రిషికి సహాయపడే సర్జన్లు సిద్ధంగా ఉన్నారు. వాళ్లందరూ డాక్టర్ రిషి కోసం ఎదురు చూస్తూన్నారు.

"ప్రసాద్ మైడియర్ ప్రసాద్!.... చూడు.... ఇప్పటికయినా మించిపోయిందిలేదు. ఆలోచించుకో మరోసారి....చివరిసారి నువ్వు వొద్దంటే యిప్పుడయినా ఆనందంగా నా ప్రయత్నం విరమించుకుంటాను"

అతను-మందహాసం చిందించాడు." అదృష్టం జీవితంలో ఒక్కసారే తలుపు తడుతుంది డాక్టర్ ! అటు ప్రేమనీ-యిటు వైద్య విజ్ఞానాన్ని సుసంపన్నం చేయగలిగే మహోన్నత మయిన యీ సువర్ణావకాశాన్ని చేజార్చుకునే అమాయకుడిగానో అజ్ఞానిగానో ఎందుకు భావిస్తారు నన్ను ?"

అంతే. మేజిస్ట్రేటు - కాగితాల మీద ప్రసాద్ సంతకాలు తీసుకున్నారు.

డాక్టరు రిషి మనస్థితి చెప్పనలవికాదు.

ఉద్రేకం.... ఉద్వేగం.... ఉత్సాహం....భయం.... ఆనందం జాలి....ఎన్నో భావాలు భావపరంపరలు.... అతని అంతరాన్ని మథించి వొదులుతున్నాయ్

థియేటర్లో డాక్టర్లు చాలా ఆత్రంగానూ ఉత్సాహంగానూ ఎదురు చూస్తున్నారు. డాక్టర్ రిషికోసం.... పేషెంట్లకోసం నాయకుడికోసం మహత్తరమూ, అపూర్వమూ అయిన సన్నివేశం కోసం. జరగబోయేది ఒకచోటనుండి మొక్కనుతీసి మరో చోట పాతడం వంటిది కాదు. నేటిదీకాదు. మనిషి ప్రాణాసికున్నంత చరిత్ర ఉంది దీనికి".

వార్డులో - గోడ గడియారం గంట కొట్టింది.

ఉలిక్కిపడ్డాడు డాక్టర్. అతనికి - కళ్ళముందు జరుగుతున్న నిజం కలకంటె కల్పన కంటె కూడా వింత నమ్మశక్యంగాకుండా ఉంది? ఇది-నిజమేనా ? కలకాదుకదా?

"ప్లీజ్ ....నాకు త్వరగా మత్తివ్వండి డాక్టర్." ప్రార్థిస్తున్నట్లే ఆత్రతగా అన్నాడు ప్రసాద్.

డాక్టరు యింక పూర్తిగా కొత్తమనిషైపోయాడు ఇపుడతను ఒక మనిషిలోని - ఇద్దరు మనుషులు కారు, ఒకే మనిషి....డాక్టర్! మత్తుమందిచ్చే అనస్తీస్ట్ వేపు చూశాడు. అర్థవంతంగా. చూసి- థియేటర్‌లోకి నడిచాడు.

"గుడ్‌మార్నింగ్ డాక్టర్."

"గుడ్‌మార్నిగ్"

అతను నాసికారంధ్రాలకు ఏంటీబయటిక్ ఆయింట్‌మెంట్ పూసుకున్నాడు. ఇప్పుడతని శరీరంలో ఏ భాగమూ కనిపించటం లేదు. స్థిరంగా.... గంభీరంగా.... నిశ్చలంగా ఉన్నాడు. ముఖానికి రబ్బరు ముసుగు (మాస్క్) వేసుకున్నాడు.

అతనిలో అంతులేని ఆత్మవిశ్వాసం.

"పేషంట్లకి వార్డులోనే మత్తిచ్చారేం. ఆపరేషన్ థియేటర్‌కి తీసుకువచ్చి కాకుండా?" ఎవరో కొత్తడాక్టరడిగాడు.

"సమస్యలు రావనుకుంటే అలాగే యివ్వడం మంచిది. ఆపరేషన్ థియేటరూ. యీ హడావిడీ చూస్తే పేషెంట్లు అనవసరంగా కంగారు పడతారు."

"ఒహో!"

వైద్య సిబ్బంది మాత్రమే అని వ్రాయబడి ఉన్న ఆ తలుపులు తెరచుకున్నాయి. రెండు స్ట్రెచర్లు....ఒకదాని తరువాత ఒకటి శేఖర్ ప్రసాద్ ....

రెండు టేబుళ్ళమీదా పడుకోబెట్టారు. డాక్టర్ నడవబోతుంటే

"అటుకాదు డాక్టర్....ఇటు...." అన్నాడు అతను.

అతనివేపు చూశాడు డాక్టర్ రిషి

ఔను. మీరు అతకబోయే హృదయం మీకు కొత్తగా అనిపించకూడదు, దీనితో మీకు పరిచయం ఉండడం మంచిది. ఆరోగ్యవంతమయిన హృదయాన్ని- పరిచయం చేసుకుంటూ....స్నేహం పెంచుకుంటూ.... తొలగించండి. దాన్ని....ఆ హృదయానికి స్నేహితుడిగా మీరే-మీ పరిచిత హస్తాలతో రెండో పేషెంట్‌లో అమర్చండి."

"థాంక్యూ వెరీమచ్. చాలా చక్కని విషయం సూచించారు. అతను- ఆత్మవిశ్వాసంతో.. ఆశతో..అటునడిచాడు. ఇంక అక్కడ కాలం స్థంభించి పోయింది- వైద్య విజ్ఞాన వినువీధిలో ఏ నవోదయం కోసమో।

తొలిచూలు ప్రసవవేదన.. ఆశతో కూడిన వేదన.. ఆనందం కోసం ఎదురు చూపుతో మిళితమయిన బాధ. జీవం ప్రసవించే ముందు జీవితాలూకు మనోభావాలు..

సాధించిన విజ్ఞానం-సాధించవలసిన విజ్ఞానంవేపు నడిపిస్తూంటే కలిగేనిషా. ఒక చేమిటి, మాటలకందని ఎన్నో మనోభావాలు.

*        *        *

అది- నాంది. అదే నాంది, మనిషి హృదయాన్ని వైద్యుడు ఆప్యాయంగా అభిమానంగా, ఆనందంగా నిమురడానికి. కాల్రక్రమాన వైద్యశాస్త్రం సాధించిన- హార్ట్ ట్రాన్స్‌ప్లాంటేషన్... గ్రాఫ్టింగ్, ఓపెన్ హార్ట్‌సర్జరీ వంటి అద్భుత ప్రక్రియలకీ. హృదయం పనిచేసే తీరుని తెలిపే ఎలక్ట్రో కార్డియో గ్రాఫ్ (ఇ. సి. జి) వంటి పరికరాలకీ- అన్నిటికీ ప్రారంభం ఆకర్షణాలే. ఆ మొగ్గనుంచే- సహస్రదళ వైద్యశాస్త్రం వికసించింది. అదర్శితే లేకపోతే- మానవ హృదయానికి యీవర్తమానమూ లేదు, భవిష్యత్తూ లేదు. అందుకే దానికంత ప్రాముఖ్యత.

ఇంకా విచిత్రంగా.. ఆ మొట్టమొదటి హృదయపు మార్పిడి అనే మహా యజ్ఞం నుంచి- ఉపఫలం (బైప్రాడక్ట్)గా సాహిత్యంలోకి సరికొత్త భావన ఉదయించింది. ఆనాటినుంచే. ఆమహత్తర సంఘటననుంచే- "హృదయమివ్వడం" అనేదానికి "ప్రేమించడం." అనే అర్ధమూ భావమూ ఉద్భవించాయేమో! అది- అత్యంత సుమూహర్తం కనుకనే—

అటు వైద్యరంగములోని (భౌతిక) హృదయమూ, ఇటు సాహితీరంగంలోని (ప్రేమ) హృదయయీ చిరంజీవులయ్యాయేమో! ఔను.

ఆనాడు- "హృదయమా! సాగిపోమ్మా!" అని ఆశీర్వదించిన వారు అన్యులూ, సామాన్యులూ కారు. దేవతలే!

# చెడు తలపులు !

ఎన్నిసార్లు
సరిదిద్దినా
ఎలాగో ఒకలాగ
"మనస్సు పుస్తకంలో"
చోటుచేసుకుంటునే ఉన్నాయి
ముద్రారాక్షసాల్లాగా॥
ఎంత టకటొంకువివి॥

# సుకవుల కవిత్వం !

ఆదిలో
లేతనౌజు
ఆపై
కవటాకు
పైపై
పండుటాకు
తాంబూలంలాగా
దాంపత్యంలాగా
ఆద్యంతమూ
రసవంతమే అది॥

(కీ. శే. మల్లాదిరామకృష్ణశాస్త్రిగారికి కృతజ్ఞతలతో)

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

శ్రీ శివలెంక ప్రకాశరావు

# మల్లవరపు కవితా మధుకింకిణి

భావకవుల అడుగుజాడల్లో నడిచి, ఒక ప్రత్యేకమైన శైలీవిన్యాసాన్ని, చిత్రమైన భావజగత్తునూ, స్వేచ్ఛాప్రవృత్తినీ హృదయవాదాన్నీ ప్రదర్శించిన 'నవభావకవి' విశ్వేశ్వరరావుగారు.,

ఆంగ్ల, వంగ సాహిత్యాంబుధులను ఆపోశన పట్టి బ్రహ్మసమాజపు వటవృక్షచ్ఛాయల్లో, రవీంద్రుడి అంతేవాసిత్వంలో. ఒక ప్రత్యేకవ్యక్తిత్వాన్ని సంతరించుకున్నారువీరు. మొదట్లో రవీంద్రుడూ, కృష్ణశాస్త్రీ వీరి పై ప్రభావం చూపారు. కాని అతికాలంలోనే వీరి సొంతగొంతు వినిపించింది. మల్లవరపు వారి కవిత్వం దాదాపుగా 1)మధుకీల (1937) (2) కళ్యాణకింకిణి (1938) అనే సంపుటాల్లో సంకలితమయింది. వీటిల్లో ఉన్న కావ్యవస్తువునుబట్టి వీరి కవిత్వాన్ని (1) ప్రణయం. (2) ప్రకృతి. (3) ఆధ్యాత్మికం, (4) స్తుతి (5) స్మృతి అనేవిభాగాలు చేసి పరిశీలించవచ్చు.

## ప్రణయం :

విశ్వేశ్వరరావుగారి కవిత్వంలో జీవనాడి ప్రణయం. స్వీయానుభవాన్ని సౌందర్యంలో రంగరించి, నిత్యనూతనంగా కళామయంగా ఒక భావరసజగత్తును నిర్మించుకున్నారువీరు, ఆ లోకాతీత జగత్తునుంచి అవతరించిన ఒక అపూర్వ శక్తిస్వరూపిణిగా తన ప్రేయసిని రూపొందించుకున్నారు. ఆమె ప్రేమస్వరూపిణి, కళామయి జీవనదేవత ఈశ్వరి అంతెందుకు ? ఆయన సర్వస్వమూ ఆమెయే !

ఆ తేజస్వరూపిణి కవి 'ఎడంద అద్దంలో ఒక నిశీధి సుముహూర్తాన 'ఆకుల్దొడిగిన పూలమొక్క'లా నిలిచింది. ఆమె తన జీవం 'ప్రాతరరుణరాగరంజితంగా ఒనర్చినట్టూ,తను ప్రభూత సుందరత్వంలో తమస్సులే ఉషస్సుగా విరిసినట్టూ భావించాడు కవి తన' తపనా ప్రతిఫల స్వరూపిణిగా, 'విస్మృతభావనాఽ బరోచ్చతారానారీమణి'గా ఆదేవతను తలంచాడు. అంతేకాదు. ఆ 'సుమకోమల సుందరోజ్జ్వల శ్రీ వ్యక్తి'ప్రసన్న సన్నిధానంలోనే భువనాలలోని సుందరోజ్జ్వలశ్రీలూ కవనంలోని గీతమంజు భావాలూ, నవమందాకిని శీతవాతపోతాలూ. రవళించాయి. స్ఫురించాయి. తళుక్కుమన్నాయి[1]అందుకే ఆ లోకాతీతను తన 'హృదయేశ్వరిగా సంభావించాడు కవి.

'తలపుల కందని తారసైగలకు, ఎరుగనే ఎరుగని విరి వాసనలకు, కనిపించిమాయమౌ కాంతి వార్తలకు' ఈయన హృదయం 'రెపరెప'లాడుతుంది 'అన్వేషణమే' ఈయన 'యాత్రాపథం'[2] తెల్లగా నెలవంక తేలిపోతున్నా, ఈ కవి 'ఊహ' చల్లగా మెల్లగా భావాలమ అల్లిబిల్లిగా పాటలు అల్లుతుంది.[3]

అందుకే ఆ జగదేకసుందరి అందచందాలు పూర్తిగా లోగొన్నాయి కవిని. ఆమె హసించే 'కెమ్మోవి'కి ఆయన నిలువెల్లా పులకరించాడు. గళమెత్తి ఆమె పాడితే ఆయన మనస్సు రెక్కలు విదిల్చి ఎగిరింది. ఆమెలావణ్యం 'ఎర్రగులాబిమొగ్గ'లా, 'చిరుతద్వీపజ్వాల'లా 'మందమలయవాత సంస్పర్శన మధురిమంలా కవి భావంలో ఒదిగిపోయింది.[4] ఆయన 'తరుణ మానసము సుధకై తపించి 'ఆమె' వికసితాధరమ్ముగ'నిలిచిపోయి మాధురుల సోలు భృంగమై మరలి[5] రాని ఒక తన్మయుతను పొందింది.

ఆ సందర్భంలో 'శ్రీచరణ పూజనాయత్తశీలుడైన తనను, 'ఏలు కొమ్మ'ని ఆ'శుభాంగి'ని అర్థిస్తూ.

'నా భాగ్యమే పండి
నా భావి వెల్తురై
నాగానమే దిగం
తాలంటి మ్రోసెనో !
నామనోరథ మీవ
నామహోదయ మీవ !
నాగానమున మ్రోయు
నాద లక్ష్మివి నీవ ![7] ఇత్యాదిగా కొనియాడుతాడు కవి.

అంతేకాదు. తన 'పేదకుటీరమే' 'హర్మ్యంగా' 'చీకటి చాయలో చిందు వెన్నెలే 'కాంచనధనం'గా[8] ప్రకటించుకొని తననొక 'గడ్డిపువ్వు[9]తో ఉపమించు కుంటాడు.

అయితే ఆమెమూర్తి, వ్యక్తి, శక్తి కవి గుండెలలో నిలిచినప్పటినుంచీ వ్యథకు గురిఅయాడు, 'కంటిరెప్పలు మింటికప్పుల'నంటేట్టు ఆమెకోసం నిరీక్షించాడు, ఆయన. చివరకు ఆ'ప్రవాస' జీవితమే ఒక 'స్వప్న' లోకంగా, 'శోకాలయంగా'[10] పరిణమించింది కవికి.

ఆ సమయంలో ఎప్పుడూ హృదయంలో 'వేదనా స్పందనమే' వినిపించింది. పదాలు కంటక పథాలపడి చీలికలయాయి. శిరోజాలు 'ఎండల శవసి, వానకు జివికి' చిందరవందరయాయి. 'తనూలత క్షుత్తృషా కాతరమయిసోలి' పోయింది."

ఆ సందర్భములోనే

'నాకులేదు సౌందర్యమ్ము, నాకు లేదు
మాధురుల జిమ్ము మోహన మంజుగళము
నాకు లేదు నీ కన్నుల నవయజేయు
చిరవినూత్న వసంతరోచిస్సు-నాది
యైన ఏకాకి యెదయ్యు నీ హస్తగతము!'[12]

అంటూ వాపోవడంలో కృష్ణశాస్త్రి రచనాధోరణిని పుణికి పుచ్చుకున్నారు మల్లవరపువారు.

భావకవికి అలభ్యమయిన ప్రియాన్వేషణలోనేసౌఖ్యం. అందుకే 'దుస్సహ శోకలోకరాజ్ఞి' అయిన తన 'ప్రియసఖి' ఎప్పుడో ఒకప్పుడు తనంతట తానేవచ్చి 'తద్రాజ్యభార పట్టభద్రత నొసగు' తుందని ఆశించారు విశ్వేశ్వరరావుగారు.

అంతేకాదు. 'కవులసౌఖ్యమ్ముదుఃఖాన' పక్వ మవుతుందని భావించి, ప్రేయసి 'బాష్పసంతతినే పుష్పమాల'గా కూర్చాడు, ఆమె ముక్తరోదన శ్రుతులలోనే 'వేదాలబుక్కు-ను' మేళవించాడు. ఆమెయే తన 'కవిత'గా సంభావించాడు. తన 'కన్నీటికాల్వ'లో ఆమె 'దుఃఖ పూతరూపం' స్నాత అయినట్లుగా తలంచాడు[13] కవి.

ఈ ప్రణయావేశంలో తన ప్రేయసీస్వరూపం 'సగముషెన్నెల సగము చీకటి'గా నిదురలోనే కదలు స్వప్నంగా, 'నీడలోదాగున్న పుష్పం'గా[14] పేర్కొంటాడు కవి. ఈ ఉపమానాలన్నీ ప్రేయసీ విరహతప్తహృదయ తత్త్వాన్నే పట్టి చూపుతున్నాయి,

చిట్ట చివరకు ఈకవికూడా కృష్ణశాస్త్రిగారి లాగానే తన ప్రేయసిని 'తెలిసి తెలియని వలపు వేకువలో స్వప్నలోకంలో కలుసుకొ గలిగారు. పొందుకు అందక అదృశ్యమయిన ఆమె ప్రేమ 'స్నిగ్ధంగా' భావించాడు కవి. ఆ అంతరమే, ఆ 'దూరమే' ఆ ప్రేమికులిద్దరినీ సుతారమైన వీణతంత్రులలో సమ్మేళవించింది.[15]

ఆ 'దివ్యాంబుజసుమం' ఆ 'సౌంధ్యసరోలక్ష్మి నోముపంట' ఆ 'చిరంతనప్రేయసి' ఎడదకరిగి 'ఆమని జల్లుగా పరిణమించి', తనకుకోరి 'జలద సోపానపంక్తుల చంచలించి అవతరించించిద'ని చెప్పి ఆ సందర్భంలో ప్రేయసిని యుగలక్ష్మి'గా 'సుఖలక్ష్మిగా' పేర్కొన్నాడు కవి.

ఆ 'కళ్యాణకింకిణి' అవతరణతో తనలోని అణువణువులో ఆమె 'సుధాలాపనమే' విన్నాడుకవి. ఆమె మంజువాణి, మంజుశింజాన కింకిణి, మృగరాగవాదిని, హృదయవీణాపాణి, నిశిరేలలో ఆత్మలో వసించే ఆమె స్పర్శ మాధుర్యం, ప్రసవపేశలం. ఆమె స్వరజీవని విశస్వర దివ్యరాణి.[16]

అందుకే ఆమెరాకతో తన 'జీవప్రాంగణమ్మే నవోద్యద్వ్యాట్యశాల' గా, హృదయ విహాయసమ్మే నవసంధ్యారాగడోల' గా[17] మారినట్లు చెప్పాడు కవి.

ఆసందర్భములో

'....' దూరమనెడి తంతువునీ
కేలనొడిచి నాగుండెల
చేరువగా చేర్చుకొంటి
వీరాతిరి నోదేవీ!
కర్పూర నివాళినిచ్చి
కరవీర సుమాలగుచ్చి
తెరమరుగయి నిలిచిపిలుచు
చెలరజనీ హృదయరాజ్ఞి!'[13]

అంటూతన ప్రణయావేశాన్ని చాటాడుకవి.

అంతేకాదు. ప్రేయసిని ఒక 'ఇంద్రజాలిక' గా భావించి

'కలిగిన స్వప్ననేత్రముల గ్రమ్మిన వాశ్రుకణమ్ములందె ని
ష్పల ప్రణయార్తి గీతముల బాడితి నాతొలికోర్కి- సాంత్వనా
విలరుతి, లేజివుళ్ల పొదివిళ్లతలంపుల దాచికొంటి చం
చల మృదుల స్మృతుల్ విగత సౌరభసూన సువర్ణపర్ణముల్'[19]

అని తన అప్రాప్త మనోహరికి విన్నవించుకొంటాడు కవి.

ఈపద్యం విశ్వేశ్వరరావుగారి వృత్తరచనా శైలికి ఒకమచ్చుతునక, పీఠప్రణయ కవిత్వంలో ఒక ఆత్మీయతా. ఒక ఆవేశం, ఒక స్వప్నలోక విహారేచ్ఛ స్పష్టంగా గోచరిస్తాయి.

## ప్రకృతి:

మల్లవరపువారి ప్రకృతి కవితకూడా ప్రణయం వైపే మొగ్గు చూపడం గమనింపతగ్గ విశేషం

ఉదా - 'చంద్ర వంకేచీర
చెరగు విసిరిందేమొ
నక్షత్ర దీపికలె
నదియించెనో యేమొ
నాపాటలో వెల్లు
నాట్యమాడింది![20]

అనడంలో కవిమీద ఉన్న ప్రకృతి ప్రభావం ద్యోతం.

అలాగే వృక్షశాఖన ఊగే ఐంటపూలు'క్రీగంట' చూచినట్లు జలజలపారే 'కొండసెలయేలు' తాళం వేస్తుంటే గాలులు పాడినట్లు 'ఉషస్సు'ను చిత్రీకరించడంలో[21] ప్రకృతిని మానవీకరించడం కానవస్తుంది.

అదేవిధంగా తెప్పవోలిక చంద్రబింబం- తేలిపోతోందనింగిని'[22] అని 'శోభాసిత పూర్ణిమా మృదుల పాలతటి తిలకంబు'గా[23] చంద్రుణ్ణి

భావించడం, 'పందిరిమంచం పరుపులాగా పింజమబ్బుల ఆకాశం' ఉంటే అందులోని వెన్నెల తెరలోనించు జాబిల్లి పరుండినట్లు ఉత్ప్రేక్షించడం[24] కవి భావనాశక్తికి నికషోపలాలు.

**ఆధ్యాత్మికం:**

మల్లవరపువారి కవిత్వంలో అంతస్సూత్రం ప్రణయం కాబట్టి వారి ఆధ్యాత్మికత మధురభక్తి ధోరణికి చెందుతుంది.

ఉదా- 'అభిసారిక' అనే కవితలో ప్రేమయూర్పుల నెగయు

నీరాజనం ఉంచి, నీపశాఖంక్రింద కృష్ణుడి కోసం వేచిఉన్న గోపిక

'నాపతీ నాపతీ
తాపమున దహనమై
పోకమును పే వచ్చి
స్వీకరింపవా నన్ను? ....
మురళీ మధురగానరవళి దేలుచువచ్చి
నాహృదయ పద్మాన నధివసింపుము పతీ,'[25] అంటూ

వేడుకోవడం ఎంతో ఆత్మీయతను ప్రకటిస్తుంది. ఇది కృష్ణశాస్త్రిగారి గోపికను తలపిస్తుంది.

**స్తుతి:**

గాంధీమహాత్ముణ్ణి పేదజనుల పెన్నిధిగా, 'నిరుపేదల మహాప్రభు'గా[26] స్తుతించడంలోనూ,

అరుగుదెమ్మా నందజీవీ
పులుగు వెన్నడు గావునీవాహా
అల్లదివినో దివము దరినో
ఎల్లహృదయము నొలుకబోసెదు
నిరనుభూత కళాంచితమ్ముగ
నీ యనర్గళ నిస్వనమ్ముల.[27]

అంటూ 'స్కైలార్క్'ను కొనియాడడంలోనూ ఈకవిస్తుతి కవిత్వం గోచరిస్తుంది.

**స్మృతి:**

కొంపెల్ల జనార్దనరావుగారు మృతిచెందిన సందర్భములో

'.... నీ సుతీక్ష్ణ రుద్రవీణ
నిశిత సూక్ష్మ నిస్వనమ్ము
నాహృదయార్త రక్తనాళ
నాళాగ్రసకజాల మ్రోగు
నేటి సందెచీకటి తెర
మాటున ఏసడి రేపని
గాటుపుసిట్టారుపులే
బాటరొదలొ దరిసియాగు ఒకవిమానీ![28]'

అంటూ మల్లవరపువారు తన ఆత్మీయతను చాటుకోవటంలో స్మృతికవిత్వం గోచరిస్తుంది.

ఈవిధంగా పరిశీలిస్తే వేదులవారన్నట్లు 'విస్తృత భావాన్ని విరళపదబంధములో ఇమిడ్చేశక్తి విశ్వేశ్వరుడిసొమ్ము'[29] అనిపిస్తుంది. సమాసఘటనంలో కొత్త స్వతంత్రధోరణి అవలంబించి, వృత్తరచన కన్నా ఛందోరీతుల్లో సరికొత్త బాటను నడిచి, భావావేశం పదాల కూర్పులో ధ్వనించే ఒకస్వతంత్ర వృత్తానికి(వెర్స్‌లైబర్) మల్లవరపువారు ప్రసిద్ధిగాంచారు. శ్రీశ్రీగారన్నట్లు! హృదయాన్ని కలవరపెట్టే ఆవస్థల నన్నింటినీ గీతాలు చేశాడు'[30] ఈయన.

వీరికవితకు భావావేశమూ, భావస్వచ్ఛత, సంగీతధోరణి, ముఖ్యలక్షణాలు. 'నీలాకాశం వెనకాలకి నిశితదృక్కులు గ్రుచ్చి' వ్రాయగల ప్రతిభాశాలి వీరు.

అందుకే మల్లవరపువారి మధుకేలవారి 'గుప్తహృద్వేల'!

మరి 'కళ్యాణకింకిణి' ప్రణయభావకింకిణి!

**అధోజ్ఞాపికలు**

| | | |
|---|---|---|
| 1. శ్రీ- కళ్యాణకింకిణి- | | పు. 3 |
| 2. సందేశము- మధుకీల- | | పు. 11 |
| 3. నిశాలోచన- | అదే- | పు. 14 |
| 4,5. గాయస్త్రీప్రియ- | ,, | పు. 24 |
| 6. శుభలేఖన- | ,, | పు. 13 |
| 7. ప్రేమగానము - | ,, | పు. 22 |
| 8. అడియాస- | ,, | పు. 34 |
| 9. గడ్డిపువ్వు- | ,, | పు. 35 |
| 10 విషాదగీతి- | ,, | పు 46 |
| 11. పిపాస- | ,, | పు. 50 |
| 12. ఆమెకే.... | ,, | పు. 62 |
| 13. ,, | ,, | పు. 66 |
| 14. అదృశ్యం | ,, | పు. 80 |
| 15. విరహవీణ | ,, | పు. 82 |
| 16. ఓరాణి- | క. కిం- | పు. 15 |
| 17. సంధ్యా- | ,, | పు. 19 |
| 18. దేవీ- | ,, | పు. 41-42 |
| 19. మోహితవని- | ,, | పు. 56 |
| 20. నిశాలోచన- | మ. కీ- | పు. 16 |
| 21 ఉషస్సు- | ,, | పు. 18 |
| 22. గడ్డి పువ్వు- | ,, | పు. 35 |
| 23. పున్నమ- | ,, | పు. 74 |
| 24. ఆకాశం- | క. కిం- | పు. 29 |
| 25. అభిసారిక- | మ. కీ- | పు. 72 |
| 26. కావ్యాంజలి- | మొ. సంపు- | పు. 143 |
| 27. భారతి- | మే 1938- | పు. 149 |
| 28. ప్రతిభ- | జన. 1938- | పు. 242 |
| 29. ప్రవేశిక- | కళ్యాణకింకిణి- | పు. 14 |
| 30. 'విశ్వం' ప్రేమగీతాలు- | భారతి- నవం 1932- | పు. 618. |

శ్రీ నేమలికంటి ముకుందరావు

# నన్నప్రభఞ్జనవర్మ్మ రాగోలు తామ్ర శాసనము సంవత్సరము-24

**1980**వ సంవత్సరములో శ్రీకాకుళం జిల్లా రాగోలు గ్రామమునకు చెందిన ఒక వ్యాపారి మూడు రాగి పట్టికలను ఆముదాల వలసలో తూకమున అమ్మ చూపుచుండగా శ్రీకాకుళం తాలూకా తహసిల్దారు వారు ఆ విషయమును కనిపెట్టి ఆంధ్రప్రదేశ్ ట్రెజర్ ట్రోవు నిబంధనలమేరకు వాటిని స్వాధీనపరచుకొని రాష్ట్ర పురావస్తు ప్రదర్శనల శాఖ కమీషనర్ వారికి పంపడమైనది. ఈ మూడు పట్టికలు ప్రస్తుతము ఆ శాఖ ప్రదర్శనశాల హైదరాబాదులో భద్రపరచబడెను. ఈ మూడు పట్టికలు వరుసగా క్రి శ. 5లేక 6వ. శతాబ్దకాల మందు కళింగ దేశము నేలిన సకల కళింగాధి పతియైన నన్నప్రభఞ్జన వర్మచే విడుదల చేయబడిన శాసనము, క్రి. శ. 11వ. శతాబ్ది మొదలు కొని 15వ. శతాబ్దివరకు కళింగము నేలిన తూర్పుగాంగవంశజులు మరియు త్రికళింగాధిపతులు నైన మూడవ వజ్ర హస్త మరియు అనంగ భీములకాలము నాటి శాసనములుగా తెలియుచున్నవి. పురావస్తుశాఖ సంచాలకుల వారి అనుమతితో యీ శాసనము ప్రకటించు చుంటిని.

శాసన స్వరూపము -

ఈ పట్టిక మూడు రాగితేకులతో కూడు కొన్నది. ఒక్కొక్క తేకు 19 సెం.మీ మరియు 7. 05 సెం. మీ పొడవు వెడల్పు కలిగి యున్నది. ప్రతితేకుకు ఎడమ ప్రక్కన 1. 00 సెం. మీ వ్యాసము గల రంధ్రము కలదు. ఈ రంధ్రము గుండా కడియము పోయి మొత్తము తేకులను గుదిగా పట్టుకొను చున్నది. కడియపు అంచులు రాజ ముద్రిక గల్గిన దీర్ఘ చతురస్ర లోహపు ముద్ద అడుగు భాగమున అతికించ బడినది. దురదృష్టవశాత్తు రాజముద్రిక కిలము పట్టి రాజ చిహ్నములు అరిగి పోయి గుర్తించుట కలవి కావటము లేదు.

మొదటి తేకు రెండవ పెడ, రెండవతేకు రెండుపెడలు మరియు మూడవతేకు మొదటి పెడ మాత్రము వ్రాయబడినవి. తేకుల అంచులు కొంది ఉబ్బెత్తుగా చేయబడిన కారణముచే వ్రాత చెదరకుండెను. మొదటి తేకు మరియు మూడవ తేకు కుడి పెడలు పగిలి కొద్ది అక్షరములు పోయినవి. అయినను మూడు తేకుల మీద అచ్చటచ్చట కిలము మూలముగ కొన్ని అక్షరములు గుర్తించనలవి గాకుండునటుల చెదిరినవి. మొదటి తేకు మీద ఏడు బంతులు, రెండవ తేకు రెండుపెడలు చెరియొక వైపు ఎనిమిది బంతులు చొప్పున పదునాలు బంతులు మరియు మూడవ తేకు మొదటి పెడ ఎనిమిద బంతులు వ్రాత కలదు. మొదటి తేకు ప్రతి బంతి చివర ఒక అక్షరము మరియు షుమారు సగ భాగము మూడవతేకు మీద వ్రాత నశించుట గమనించదగును.

లిపి దక్షిణ హిందూదేశమున వాడుక నందిన క్రి. శ. 5-6వ. శతాబ్దులనాటి పెట్టెతలకట్టు (బాక్స హెడ్) రకమునకు చెందినది. ఈ రకము ఈ రాజునకు చెందిన ఇతర తామ్ర పట్టిక, అగు బరంగ[1] విశాఖ వర్మకు చెందిన కోరషండ[2] తామ్ర పట్టిక, ఉమావర్మకు చెందిన బృహత్రోప్ప మరియు తెంబూరు తామ్ర పట్టికలు మరియు చండ వర్మకు చెందిన కోమర్తి మరియు బొబ్బిలి తామ్ర పట్టికలందు చూడనగును.

ఆకారాదికములు-

1. రేఫకు ముందు హల్లులు ద్విత్వమగుట. ఉదా :- సర్వ్వ (బంతులు 2, 7), కర్మ్మ (బంతి4), వినిర్గ్గత (బంతి 9), స్వర్గ్గ బంతి 29), పూర్వ్వ(బంతులు 15, 19, 23), గర్త్ర (బంతులు 16 18, 21,) ఆర్య్య (బంతి 18), మర్య్యాద (బంతి 24), పర్వ్వత (బంతి 22), ధర్మ్మ (బంతి 25), కాని విసర్గకు బదులు రేఫ ఉపయోగించుట తద్వారా యకారము ద్విత్వ మగుట చూడనగును. ఉదా :- సేతుభిః=ర్య్యాత్వా (బంతి 20), అటులనే కొన్ని సందర్భము లందు రేఫకు ముందు ద్విత్వము కాక ప్లోపుటయు చూడనగును. ఉదా :- బహుభిః= బహుర్దా (బంతి. 27), 2 అచ్చు ఆదిగా ఉపయోగించుట ఉదా :- ఇత్యమ (బంతి 26) 3. రెండు అర్థచంద్రాకారములు ఒక దానిపైన ఒకటి ఉంచి విసర్గగా వ్రాయుట(ః) (బంతులు 23, 27) మరియు చిన్నవృత్తములు ఒకదానిపైన ఒకటి విసర్గగా వాడుట (బంతులు 3, 15, 29). 4 ఉ మాత్ర మరియు య కారాములకు తేడా తెలియదు. ఉదా :- సేతు (బంతులు 14, 19), గుల్మ (బంతి 14). 5. ఇదే విధముగా ఎ మాత్ర ను సూచించుటకు అక్షరపు కుడిపై భాగమునగాని క్రింది భాగమునగాని చూపబడెను. ఉదా :- మై అను అక్షరము గ్రామె (బంతులు 2,8) అను మాట వూరిపేరులో (రాగోలకగ్రామే బంతి 2 ; అత్రగ్రామే బంతి 8). ఇంకా ఉదా :- యమేకం (బంతి 6), పశ్చి మే న (బంతులు 18, 21), 6. మకారాంతము ఒకేఒకచోట వాడబడెను. ఉదా :- ఫలమ్ బంతి

28. 7. రెండు వేరు శబ్దములను కలిపినప్పుడు వచ్చు మార్పు చూపకుండ యధాతథముగా ద్విత్తము చేయుట ఉదా :- ఇదం దానమ్ అనుటకు బదులు ఇదన్దానమ్ (బంతి 26.)

భాష యంతయు వ్యాస గీతము మినహా సంస్కృత గద్య. శాసన పద జాలము యించుమించు ఇదే కాలమునకు చెందిన చండవర్మ బొబ్బిలి [5] మరియు నన్న ప్రభంజ్ఞనవర్మ బరంగ[6] శాసనములందు యీ క్రింద నుదహరించిన రీతిగా పోలి యున్నది –

"సర్వాన్ సమవేతాన్కుటుంబినో భోజకాంశ్చ సమాజ్ఞాపయతి" (బొబ్బిలి శాసనము 3వ బంతి)" షట్త్రింశదగ్రహార సామాన్యన్చ.... ....శంచోపని బన్ద్యః (బంతులు 6, 7పై శాసనము) మరియు "ఆ సముద్రాక్కాన్. తారక ప్రతిష్ఠ (బరంగపట్టిక. బంతి5). శాసనపాఠము : శాసనము మహారాజ నన్న ప్రభఞ్జన వర్మచే అతని ఇరువయి నాలుగో రాజ్య సంవత్సరమందు విజయసిఙ్హ పురమునుండి విడుదల చేయబడెను. కౌణ్డిన్యస గోత్రుడు బ్రహ్మచారి బ్రాహ్మణుడు అయిన నన్దిశర్మకు రాగోలక గ్రామమందు అతని పూర్వాగ్రహార స్థలమునకు బదులు రెండు వృపక్షేత్ర ములనున్న నక్షత్రకాంకి భూమిలో కొంత భూమిని పరివర్తక వాటక నిబంధముగా సర్వకర పరిహారముగా మరియు అగ్రహారముగావించి దాన మొసగినట్లు తెలియుచున్నది. మరియు దాన ప్రతి గ్రహీతను ముందుగా చెల్లించవలసిన ఒక రకమైన పన్ను ఏబది పణములు మరియు గ్రామమున (గ్రామ సభ)కు. చెల్లించవలసిన ఇరువై దణ్డ పణములను ఉప నిబంధముగా చేసి మినహాయించెను.

దాన భూమి (పరివర్తక వాటక నిబంధము)కి హద్దులు నిడింజరువ, హొంసరేవ మరియు బలభఙ్గ అగ్రహారముల అధికారి కందకాధ్యక్షుని సమక్షమందు ఏర్పరచబడెను. ఈ అగ్రహారముల హద్దులు నగరములైన హోజామ్య, దూసి మరియు ఛిలిగొణ్డలను తాకును, దాన భూమికి అసలైన హద్దులు : ఉత్తరమున హోజామ్య సీమాంతిమము, దాని నానుకొని కరంజ తటాకపు పూర్వ శృంగము దీనికి దక్షిణమున తిమిరాఖాతము (గొయ్యి) మరియు మాసోపవాస క్షేత్రము, దీనికి ఉత్తరముగా సేతు ; తూర్పున వాపిని దాటిన తదుపరి మరీచ వృక్షము, దీనికి తూర్పున సూహిగుల్మము మరియు దీనికి దక్షిణమున ఒక కందకము ; ఆగ్నేయమున కచ్చలి కినుమ్మిక క్షేత్రముల అంచునందున్న విటపవల్మీకము ; తూర్పు దక్షిణముగా కొంత దూరమున చెట్టు, చీమల పుట్ట మరియు వీనికి పడమర కందకము ; దక్షిణమున హట్టి (పెంట లేక సంత) మరియు దీనికి తూర్పు దక్షిణముగా హాలంద వల్మీకము, దక్షిణ పడమర మందార వల్మీకము మరియు చెట్ల వరుస తదుపరి నిమ్బఖోవ (నిమ్మచెట్లు) దీనికి పురుషచ్ఛాయ మాత్రము దూరమున నున్న కందకము మరియు దీనికి పడమర సంకరార్యక ఖండమందున్న చెరువు తూర్పు శృంగము వృక్షము, దీనికి తూర్పు కరణ్ణక క్షేత్రము కందకము మరియు ఇసుక తిన్నలు పుట్టలతో కూడుకున్న దాన భూమి (ధర్మపట్టి), దీనికి దక్షిణము గాను సంకరార్యుల తోట నేల దాటిన తదుపరి అఖాతములైన కందకములు, దీనికి అవతలగా పడమర దిక్కున లేని నదికి ఆగ్నేయముగా యజ్వ యొక్క అగ్రహార భూమి మరియు పర్వతములు కందకములతో కూడుకున్నదూసి – హోజామ్య అగ్రహారముల హద్దులు.

దాన శాసనపు తేదీ నన్నప్రభఞ్జనవర్మ రాజ్యంసంవత్సరము 24 (సంకేతములలో) మరియు ఫాల్గుణ మాసపుదినము (వివరణ పోయినది) అని మాత్రము కలదు.

ఆజ్ఞప్తి రాజె వ్రాయసకాడు. దత్తకుమారుడైన మాతృవరుడు. బహుశ ఇతడు దేశాక్ష పటలాధికృతుడు.

శాసన ప్రాముఖ్యత :

ప్రశస్తి విషయమున రాగోలు శాసనము ముఖ్యముగా రాజ బిరుదావళి విషయమందు నన్న ప్రభఞ్జన వర్మ బరంగ[7] శాసనముతో సారూప్యమున్నటుల బప్ప భట్టారక పాదభక్త మరియు సకల కళింగాధిపతి బిరుదుల వలన తెలియును. కాగా ఇదే రాజు కాలము నాటి చికాకొల్లు[3] శాసనము మాత్రము పరమ భాగవతోమాతా పితృ పాదానుద్యాత అను బిరుదము సకల కళింగాధిపతి బిరుదమునకు తోడుగా కన్పట్టుచున్నది. ఈ శాసనపు రాజముద్రిక మీద పితృభక్త అని వంశనామము కలదు. ఈ మూడు శాసనములు విజయ సిఙ్హపురము, విజయ వర్ధమాన పురము మరియు, విజయ సారపల్లి రాజధానుల నుంచి విడుదల గావింపబడినవి. సింహపురము, సునగర మరియు వర్ధమానపురముల నుంచి చండవర్మ మరియు ఉమావర్మల 4,8,9, 20 మరియు 40వ రాజ్య సంవత్సరములందు విడుదల గావింపబడిన శాసనములు వారిని కళింగాధిపతులుగా, పరమభాగవత పితృ పాదాను ధ్యాతులు మరియు పరమదైవత బప్పభట్టారకులు గాను చెప్పుచున్నవి కాగా ఉమావర్మ 9వ.రాజ్యసంవత్సరపు టెక్కలి పట్టిక వరకు ముఖ్యముగా బొబ్బిలి మరియు కోమర్తి పట్టికల[10] రాజముద్రికలు చండవర్మను పితృభక్తులుగా తెలుపుచున్నవి. కాని ప్రస్తుత శాసనదాత బప్ప భట్టారకుడు మరియు సకల కళింగాధిపతి అయిన నన్న ప్రభఞ్జన వర్మయు పితృ భక్తులు మరియు కళింగాధిపతులు గానే వర్ణింపబడిన చండవర్మ ఉమావర్మలు ఒకేవంశమునకు చెందిన వారేమో తెలియదు. సర్కారు పండితులు[11] కళింగాధిపతి మరియు

సకల కళింగాధిపతి బిరుదుల ప్రాశస్త్యమును క్రీ. శ. 5-6వ. శతాబ్దుల కాలమందు కళింగము నేలిన ఆయా రాజుల రాజకీయ ఉద్దేశ ప్రతీకలుగా వారి పాలనా ప్రాంతములను సూచించునని చెప్పిరి. అటు లయిన ఈ బిరుదములు కలిగి యున్న ప్రస్తుత శాసనదాత, పై నుడి విన టెక్కలి దాన శాసనకర్త పితృభక్తుడు మరియు కళింగాధిపతి యైనఉమావర్మయు ఒకేవంశమునకు చెందినవారుగా పరిగణనలోనికి తీసుకొనవచ్చును. దీనికి బలముగా ప్రస్తుత శాసనపు వ్రాయసకాడు మాతృవరుడు ఒక ప్రమాణము. ఇతడు బృహత్ప్రోష్ఠ మరియు తెంబూరు[12] శాసనములు వ్రాయసకాడైన మాతృవరుడు ఒక్కరేనని నా ఊహ. ఇతడు బహుశ టెక్కలి శాసనపు తరువాతి కాలమునుంచి రాజోద్యోగిగా ఉన్నట్లు చెప్పవచ్చు. మరియు తేది తెలుపు సంధర్భము కూడా ఆధారమగుచున్నది. ఎట్లన ప్రస్తుత శాసనము బొబ్బిలి బరంగ పట్టికలలో ఋతువు తిథి మాదిరిగా గాక చాంద్రమానము తిధి నుటంకించును. కాగా తొలుదొల్త తేది వర్ణనలు ఋతువు మరియు తిథి వాడుకలోనున్నట్లు పెక్కు ప్రాచీన శాసనముల ద్వారా తెలియను. అటులయిన ప్రస్తుత శాసనపు కాలము, ఋతువు, తిథిని ఉటంకించు నన్దప్రభఞ్జనవర్మ 15వ రాజ్య సంవత్సరపు బరంగ శాసనపు తేదికి 9 సంవత్సరములు తదుపరిదీన్ని మరియు ఆర్. ఘోషల్ పండితుల. నిర్ణయ ప్రకారము క్రి. శ, 6వ. శతాబ్ది బొబ్బిలి[8] శాసనమునకు సమకాలికముగా కన్పట్టును.

పై విషయములకు తోడు బొబ్బిలి పట్టిక[14] నున్న మాదిరిగా పద వాక్య సరళి కూడ ప్రస్తుత శాసన కాల నిర్ణయమునకు దోహద పడుచున్నది. ఎట్లనగా 'ప్రాదేయమ్ సామ్వత్సరీకమ్ స [ప]ణాగ్ర శతద్వయఞ్చాంశమ్‌చో'పని బన్ద' బొబ్బిలి పట్టిక మాదిరి ప్రస్తుతపు పట్టికలోగూడ 'ప్రాదేయ సామ్వత్సరీకమ్ పఞ్చాశత్‌పణశ్చాగ్ర 'వాడ బడినది. ఇంకొక ఆసక్తి ఏమన ఆ కాలమునాటి మారకద్రవ్యమును బొబ్బిలి నింగొండి[15] పట్టికలలో పణములను నుటంకించునట్లు గాక పణములకు తోడు దణ్ణపణములనుటంకించుమ. సర్కారు పండితులు[16] పణముల విలువ విశదీకరించు సందర్భమున ఒక్కొక్క పణము 'ఏబదిగవ్వలు' కు సమానమని తేల్చెను. కానియీ పణమే దణ్ణపణమను కొని ప్రస్తుత శాసనములో చెప్పబడిన ఎబది మరియు ఇరువది దణ్ణములు అయిదువేల ఆరువందల గవ్వలుగా తేలును. కాగా దణ్ణపణము అనునామము గ్రామము లేక అగ్రహారము (చూ. గ్రామ స్తవక్తవ్యమ్, బంతిలి) యొక్క రక్షణ బాధ్యతలు నెరపు నట్టి గ్రామ సభకు చెల్లింపు నుంచి ప్రతిగ్రహీతను మినహాయించు సందర్భమున చెప్పునదిగా కన్పట్టుటచే దణ్డపణమని పిలువబడుతున్నట్లు తోచుచున్నది.

శాసనమందు అగుపడు గ్రామములు కొన్ని ప్రస్తుతపు శ్రీకాకుళం తాలూకా పరిధిలో అదే పేరున వున్న గ్రామములతో పోల్చుటకు వీలగుతున్నది.

సిఙ్జపురం :- శ్రీకాకుళం నరసన్నపేట వెళ్ళు దారిలో నున్న సింగుపురము.

రాగోలక గ్రామము :- శ్రీకాకుళం-ఆముదాలవలస దారిలో నున్న రాగోలు గ్రామము.

దూసి గ్రామము :- రైల్వేస్టేషన్ దూసి. ఈ గ్రామము నరసన్నపేట తాలూకా లోనిది.

హోజామ్య మరియు ఛీలిగొర్ణి అగ్రహారములు సక్రమముగా గుర్తించుట సాధ్య పడదు. కాని హోజామ్య గ్రామము క్రీ.శ. 6వ శతాబ్దికాలమునాటి ఉరజాం పట్టికలో ఉదహరించిన క్రోష్టుక వర్త విషయమునకు సంబంధించిన హోజ్జేరి గ్రామమేమో తెలియకున్నది. అటులనె ఛిలగొణ్ణ గ్రామము క్రీ.శ. 11వ శతాబ్ది తూర్పు గాంగ రాజైన మూడవ వజ్రహస్తుని కాలపు నదగాం శాసనము[18]లో ఒక ఛిలి గ్రామము సేనాధిపతి యగు పాంగు సామయస్వ గ్రామముగా కన్పట్టుచున్నది. ఈ రెండు ఒకటి అవునో కాదో తెలియదు. విడిం జెరువ గ్రామము. ఈ గ్రామము పేరున క్రీ. శ 9వ శతాబ్దమందు[19] ఒక ప్రాంతీయ పరిపాలనాభాగము కలదు. ఈ గ్రామమందు నీలీశ్వరు నుటంకించుచు చాలా శిలాశాసనములు కలవు.[20] బలభగ్గ గ్రామము ప్రస్తుత శ్రీకాళంపట్టణ పరిధిలోనున్న బలగ[21] గ్రామముగా ఊహించనగును. హోంసరేవ గ్రామమును గుర్తించుట వీలుగాదు.

అధోజ్ఞాపికలు :

1. ఒ. హెచ్. ఆర్. జె. వాల్యూం 6. పే 109 మొదలుకొని
2. ఎపి. ఇం. వాల్యూం 21, పే. 23 మొదలుకొని
3. అదె. వాల్యూం 12, పే. 4 మొదలుకొని, మరియు చూ అదే వాల్యూం 37 పేజి. 337 మొదలుకొని.
4. అదె వాల్యూం. 4, పే. 142 మొదలుకొని, మరియు అదె. వాల్యూం 27. పేజి 33 మొదలుకొని.
5. ఎపి. ఇం. వాల్యూం 27, పేజి 33 మొదలుకొని.
6. ఒ. హెచ్. ఆర్. జె. వాల్యూం 6, పేజి 109 మొదలుకొని
7. అదె. వాల్యూం 6, పేజి 109 మొదలుకొని.
8. ఇం. ఆన్టిక్వేరి వాల్యూం 13, పేజి 48 మొదలుకొని.

9. ఎపి. ఇం. 27, పేజి మొదలుకొని, అదె వాల్యూం 4 పేజి 142 మొదలుకొని, అదె వాల్యూం. 28 పేజి 298 మొదలు కొని; అదె వాల్యూం 12 పేజి 4 మొదలుకొని; అదె వాల్యూం 37 పేజి 337 మొదలుకొని మరియు అదె వాల్యూం 26, పేజి 132 మొదలుకొని.

10. అదె వాల్యూం 30, పేజి 114 మొదలుకొని.

11. ఎపి. ఇం. వాల్యూం. 12 పేజి 4 మొదలుకొని.

12. అదె. వాల్యూం. 37 పేజి 337 మొదలుకొని

13. అదె. వాల్యూం. 27 పేజి 35 మరియు వార్షికనివేదిక (శాసనశాఖ) 1934-35 పార్టు2, పేజి, 51.

14. ఏపి. ఇం. వాల్యూం 27, పేజి 35 (బంతి 6) మరియు అధో జ్ఞాపిక8; చూ. అదె వాల్యూం 30, పేజి 118 (బంతి 15).

15. ఎపి, ఇం. 30, పేజి 114 మొదలుకొని.

16. మద్రాస్ ప్రెసిడెన్సి గ్రామనామములు పట్టిక (1908)పేజి.5

17. ఎపి. ఇం. వాల్యూం 37 పేజి 159 మొదలుకొని.

18. చూ. అదె. వాల్యూం 4, నం 24

19. జె. ఒ. ఆర్. వాల్యూం 9 పేజి 50 మొదలుకొని.

20. ద. హిం. శా. సం. వాల్యూం 10లో నారాయణపురం శాసనములు.

21. మద్రాస్ ప్రెసిడెన్సి గ్రామనామముల పట్టిక(1908)పే. 5

## శాసనమూలము[22]

మొదటిరేకు

1. స్వస్తి[23] విజయ పిష్టపురాద్ ఉప్పభట్టారక[24] పాదభక్తః సకలకలి[ఞ] [ధి]-
2. పతిః శ్రీ మాన్మహారాజ నన్ద ప్రభఞ్జనవర్మా [1*] రాగో లక గ్రామేసర్వాన్ స[మే]
3. వేతాన్కుటుమ్బినో భోజకాం[25]శ్చ సమాజ్ఞాపయతి=అస్తి= అత్ర గ్రామే నక్షత్రికాన్ -
4. కభూమిః [11*] యాని-వాస్యా (స్య) భూమ్యన న్తరాణి సన్తి తమ్మ(ధ్యా)ణః పూర్వాగ్రా (గ్ర) హారస్థం [-?]
5. క్షేత్రాణి[26] చ మధ్యసీమయా ద్వౌప్రపక్షే(స్తే)తౌ తయోఃచపరి వర్తనకమ్=అన్యాధాటక [0*]
6. చ్ఛ(ప్ర)వక్ష్యేమి - రితే-ఏతద్=వాస్యదణాం యమేకమ్-వాటకిక బన్ధ స్కన్ధృత్వా-స్మాభిః ఆత్మనః పుణ్యా [యుః=యశ*]
7. సామభివృద్ధయే ఆ సముద్రాక్కర [తారక ం*] ప్రతిష్ఠమ్= అగ్రహారం కృత్వాసర్వకరప [రిహారైః=చ ప*]-

రెండవ రేకు: మొదటిపెడ

8. రిహృత్యష(ట్త్రి)మ్మ(ష ట్రి)న్మ) ద్గ్రహార[27] సామాన్య (ం*) చ్ఛాగ్రహారప్రదేయ (ం*) సామ్వత్సరీకమ్పు (ం*) చా (పఙ్గా) త్తప్రణాళ్ప్రగ్[28] దే (?)
9. దణ్డపణాళ్చవింశదుపనిబన్ధ్య గ్రామస్య[29] వక్తవ్యమ్మినిగ్గ తకస్కృత్వాస్మా [భిః*] యే (ప) వధర్మా సఙ్ఞయా స్వద్భ్యః -
10. చారిణేకొణ్డిన్యస గోత్ర (త్రా) [య*] బ్రాహ్మణనన్దితిమ్మ జేన స్వమదత్తః [*] అపిచ=అత్ర భవద్భిః హరణమ్యక
11. దూసిధిలగొణ్డ్యాగ్రా (గ) హారాణాన్నగరత్తో (రో త్ర)రే నిటిం జెరువ - హాంసరేవ - బలభఙ్గ్రామాణా న్తంద[31] క-
12. న్దక య [ధ్య] శకస్యచ సమక్ష దశి [ణ]త సేతవః ఉ త్త రేణ హొజామ్యాగ్రహార సీమాన్తస్తత [ః]
13. కరంజ[32] తటాకి కాపాల్యా పూర్వా గ్రస్కృణ్గాద్=దక్షిణేన యాత్వాతిమిర (రా) ఖాతః [1*] తస్మాత్మాసోపవాస క్షేత్ర[33] [11 పాద్య [ః*]
14. తస్యోత్తర సేతునాగత్వాపూర్వే వాపిపాల్యామతిక్రమ్య మరీచ వృక్ష స్తత్పూర్వేః సూహిగుల్మ స్తద్దక్షి -
15. ణేనగత్వా [1*] తతః తవ్వలికనుమ్మిక క్షేత్రోత్తరస (సే) తుభిరతి క్రమ్యపూర్వ దక్షిణేన విటపోవల్మీకాళ్చ

రెండవరేకు : రెండవపెడ

16. తతే-పశ్చిమేన గత్వాయాం యాత్వాపునర్ద[ణ] క్షిణేనపొట్ట (వొట్ట) తిలు[34] ప్రాగ్దక్షిణే [నా*]తి క్రమ్యహలన్దవల్మీకోత [ఃత్]-
17. దక్షిణ పశ్చిమేన మన్దార వల్మీక స్తద్దక్షిణేన విటపవ జ్ఞ్రీమ తీత్యనిమ్బాభోదా [1*] తస్యాన్ (ః) దక్షిణేన
18. పురుషళ్ళాయా (య)[35] గత్వాగత్రాన్సా (తస్యాః) పశ్చిమేన గత్వాపునస్సంకరాయ్యేక ఖిణ్డ [ః] తటాద్దక్షిణేన కృష్ణ వృత్త [ః*]స్తేతః
19. కరణ్టక క్షేత్రోత్తరే సేతునాపూర్వేణ యాత్వాదమ్మణపట్ట క్షేత్రప్రదేశే తుత్కూలన్దికావల్మీక (వీః) -

20. స్తారకష (క్షే) త్రం ప్రాప్యదక్షిణేన కిరణ్డక స్థానరల్ సంక రాయ్యేణక క్షేత్రాన్తర సేతకియ్యేణత్వాంటి (తి) షి క-

21. గత్వాణగవ్యూతి తయాగత్వణయా పశ్చిమేన యాత్వాజ్జపి గ్రహారసీమాన్తాన్కాంకా (గ్వా) తిసి నడి [1*] తామతిగ్రక [మ్యా]

22. దూస్యాగ్రహారసీమాన్తాత్పున స్సైన్వహోజ్ఞామ్యాః గ్రహార సీమా నైతియ (ప) వ్యాణతామర గత్యోణద (కో)-

23. తటాకోదక (కో)వ (వా) విప్రసాంతః[36] పూర్వోణచిత మేవదేయం తదేవమ్విదితః యుష్మాభిరసౌ

మూడవ ఱేకు :

24. బ్రాహ్మణోయదా విఖితవయ్యేణదా సేతుసీనేద్ధేకే ద్యాట్టక[37]

25. భవి (ష్య) ద్రాజభిశ్చ ధమ్మణక్రమవ (వి)క్రమణాం అన్య త్రమ్-అయోగాద్ అవాప్య [37]

26. మ్ ఇదన్ (ం) దానమ్-ఏషసతాన్ (ం) ధమ్మ (ః) పిఠ-ఋమ పశ్యద్భిఃఎవిష్యోగహోధామపాల్యః[37]

27. బహుబి [ణ] బహుధాదత్తావసుధా వసుధా (ధా)ధిపః [1-•] యస్య యస్య య [37]

28. ఫలం [11•] స్వదత్తామ్పరదత్తామ్వా (మ్వా) యత్నాద్రక్ష యుధిష్ఠిర [1•]మహీమ్మహిమ [37]

29. పాలన [మ్•] [1 •] షష్ఠిం వషణ సహస్రాణి స్వగ్గేణ వసతి భూమిద ః[1•]అక్షేప్తా చాను [37]

30. నరకేవసేదేతి [11•] శ్వయమాజ్ఞో(జ్ఞ)ప్తిః [11•] సమ్వత్సర 24 ఫాల్గుణది [38]

31. దత్తసూనునా మాతృవరేణ విఖితమితి[•]

---

22. అసలు పట్టికను చూచి.

23. చిహ్నమునసనుసరించి.

24. ఈ చివర రెండు అక్షరములు పోయినవి.

25. ఈ పదము చండవర్మ బొబ్బిలి పట్టికలో మూడవబంతిలో నున్నది, చూ. ఎపి. ఇం. వా. 27 పేజి 35

26. 'జి' అక్షరము తదుపరి 'య' మోస్తరు అక్షరపు భాగము పోయినది.

27. ఈ సాంకేతిక పద అర్థ వివరణమున ఇ. హల్జ (ఎపి.ఇం1 2, పే. 6) మరియు సి. ఆర్. కే. చార్లు (ఎ. ఆర్. ఎస్. ఐ. ఎపిగ్రఫి 1934-35 పే.51)వెలిబుచ్చిన అభిప్రాయముల పునః పరిశీలించుచు ఆర్. కె.ఘోషల్ బంగాళదేశమందు వాడుకలో నున్న ఛత్రీస్ మౌజుకు పోల్చును, ఛత్రీస్మౌజ అనగా జమీం దారిగా అభిప్రాయపడెను. కాని సర్కారపండితులు ఈమాటకు అనగా షట్త్రింశదగ్రహారము సమాన్యముగా ప్రాంతమునకు వర్తించునదిగా అభిప్రాయపడిరి. (చూ. ఎపి. ఇం. వా 30 పే. 115).





1. మొదటిఱేకు రెండవపెడ, 3. రెండవరేకు రెండవపెడ
2. రెండవఱేకు మొదటిపెడ, 4. మూడవఱేకు

28. ఈ పదము బొబ్బిలి పట్టికనందగుపడు సణాగ్రి పదమును గుర్తుచేయును. శాసనపరిష్కర్త దీనిని పఞ్చాత్రింశత్ అను పదమునకు జోడింపుగా అభిప్రాయపడి నమోదు పత్రమని తేల్చెను. దీనికి మొట్ట మొదటి ఉదాహరణలు శాతవాహనులు

[illegible]ముగా లి వాసిక మరియు కొ[illegible] [illegible] చేసు (ఎపి ఇం.వా. 27 పేజీ 3[illegible], అథోజ్ఞాపిక. [illegible]) [illegible] [illegible]తుల్యాపరిజ్ఞాన వర్మనింగొండి పట్టికలో [illegible] [illegible]గ్ర పదములో అగ్రపదము ము ముందుగా అని [illegible] [illegible]దముకు ముందుగా చెల్లించె పణముగా అభిప్రాయపడెను. [illegible] ప్రస్తుతశాసనములో అగుపడునట్టి [illegible]గ్ర [illegible]ముగా [illegible] [illegible]యుండనోపు (ఎపి ఇం. వా 30. పే. 114)

29 గ్రామస్స్వవక్తవ్యమ్ అనుపదము గ్రామ సభగా శోభచున్నది.

30. అక్షరపు క్రింది భాగము తేకురంధ్రము వలన లుప్తమయినది.

31. చదువుట అనుమానా స్పదము.

32 అక్షరము కొట్టుపోయినది,

33. బ్రాహ్మణుల ఉపవాసదీక్ష కొరకు ప్రత్యేకింపబడిన స్థలముగా తోచుచున్నది.

34 అనుమానస్పదము,

35 ఇది ఒక దీర్ఘకాల మానము చూ.ఎపి. గ్లా. పే.267 మరియు ఎ.పి ఇం. వా. 3 పేజి 134, అథోజ్ఞాపిక.1.

36. దీనికి తదుపరి అర్ధుగీతకలదు.

37 శిల పగిలినందున ఇచ్చట మరియు ఇతరప్రదేశముల అక్షరములు నశించినవి.

38. తారీఖు వివరణ మరియు వ్రాయసకాని తండ్రి పేరు, హోదా నశించినవి.-బహుశ ఈ హోదా దేశాక్షపటలాధికృత అయి వుండును. వ్రాయసకాని తండ్రిపేరు హరిదత్తలేక రుద్రదత్త అయివుండును.

---

# ఎందుకు చూస్తున్నానటు?

## శ్రీ పోతుకూచి సాంబశివరావు

[illegible]నెందుకు చూస్తున్నానటు,
[illegible]లయాన్నంత నగశిఖర ద్వయం,
[illegible] ప్రసారిత ధవళ ధూతలం
మంచు పొరల లోంచి.
తొణికిసలాడుతున్న మించు అందాల
నేనెందుకు చూస్తున్నానటు-
నిగూఢ నిమీలితలోచనాల
ఆలోచనల తరంగాల జలదాలు-
ఆ జలదాలు వదలిన నీలి పెదాల
చిన్న పరిధి వృత్తం.
ఆ వృత్తంలో స్పందించే
అనూహ్య భావ కిరణాల వెలుగులు-
నేనెందుకు చూస్తున్నానటు-
నింగి పుడమిని చుంబిస్తోందా ?
భూమి నభాన్ని చుంబిస్తోందా ?
ఆ ద్వయాన్ని వేరు చేసే సన్నని ప్రకృతిరేఖ
ఆనంద హాలాహాలాల సమన్వయ శాఖ
నేనెందుకు చూస్తున్నానటు-
నానేత్రాలు ఊర్ధ్వ జీవన భావన గతులను వెతుకు
నా సూత్రాలు సమాజ బడబానల
లోతులరీతులు వెతుకు
నానేత్రాలు, సూత్రాలు
ఆ దివ్య సుందర నవ్య దీప్తి వైపు చూస్తున్నాయి.
నేనందుకే చూస్తున్నానటు-

శ్రీమతి ఆర్. వసంత

# శిల్పాలలో హస్తముద్రలు

ముద్ర యనగానేమి? శబ్దరహితముగా కేవలము సంజ్ఞలతో మాత్రమే ఒక భావమును మౌనముగా ఒక్కొక్క భంగిమలో ప్రకటించుట, ముద్ర యనవచ్చును. నాట్య శాస్త్రములో అభినయమునకు విశిష్ట స్థానమున్నది. ముద్ర లేనిదే అభినయము లేదు. ఏ భావ ప్రకటనకైనా, ముద్రను ఒక ప్రక్రియగా నాట్యములో వాడటము అందరికీ తెలిసినదే ఈ ముద్రలు భారతీయ శిల్పాలలో కూడా భావ ప్రకటనకు ఒక ప్రక్రియగా వాడబడినట్లు. మనము చూడవచ్చును. ఉదాహరణకు మనదేశ నాగరికత, సంస్కృతికి అతి సున్నితమైనటువంటి అతి ప్రాచీనమైన అంజలి ముద్ర ఒకటి. అలాగే ప్రతి ఆచార్యులు వాడేటటువంటి చిన్‌ముద్ర మరొకటి. ఇవి రెండు కూడా మన దైనందిక జీవనములో, మన సంస్కృతిలో, మనశిల్ప నాట్య శాస్త్రములలో ఒక విలక్షణమైన అర్థాన్ని ఇప్పటికి సూచించుచున్నవి.

'నృత్తం చిత్రపరం మతమ్.'[1] శిల్పచిత్రములు నాట్యపు వేరొక స్వరూపమే. కళ యొక్క ద్విముఖములే శిల్ప, నాట్యములు. ఈ రెండును శాస్త్రములైనప్పటికి, రెండును వేర్వేరు శాస్త్రములని విభజింపలేనంత అన్యోన్యాశ్రితములు. విలాస సంయుతములైన కొన్ని శిల్పముల భంగిమలను పరీక్షించిన అవి నాట్య శాస్త్రానుసరితములని స్పష్టమగును. సత్యమే. శిల్పకళ యందలి ముద్రాభినయము అనేకములు నాట్య కళానుసరణములే. భోజుని సమరాంగణ సూత్రము[2] కూడా శిల్ప, నాట్య ముద్రాభినయముల అన్యోన్యతను విశదీకరించును. అయినా భారతీయ శిల్ప, నాట్య శాస్త్రములకు ధార్మికాధారముండుట జ్ఞప్తి యందుంచు కొనవలెను. భరతుని నాట్య శాస్త్ర మందు నుడివినట్లుగా-

నాట్య శాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతమ్ ।
నాట్యం సందర్శయా మోత్ర త్రినేత్రాయ మహాత్మన్ ॥
తతస్తండుం సమాహూయ ప్రోక్తవాన్ సురసత్తమః ।
ప్రయోగ మఙ్గ హారాణా మాచక్ష్వ భరతాయవై ॥

## ముద్రలు :

డా. శుక్లాగారు చెప్పినట్లుగా ముద్రలను 1. హస్త 2. పాద, 3, ఆసన ముద్రలని మూడు విధములుగా విభజింపవచ్చును. ముద్రలను గూర్చి విద్వాంసులనేకులు క్రింది యభిప్రాయములను వెలిబుచ్చిరి.

1. ఆర్. కె. పడోల్ గారు వైదిక, లౌకిక, తాంత్రిక యను త్రివిధ ముద్రల నేకీభవించి 'ముద్రా' యని సంబోధించిరి.

2. డా కుమారస్వామిగారు చతుష్షష్ఠి కళలలో యిదియునొక కళయని తెలిపిరి.

3. పాశ్చాత్య విద్వాంసులు కొందరు భారతీయ శిల్పము ముద్రాభినయములసహజమని భావించిరి.

ఈ వ్యాసము హస్త ముద్రకే అంకితమైనందున తత్పరముగా విమర్శింతము.

## హస్తముద్రలు :

శిల్ప శాస్త్ర గ్రంథములగు సమరాంగణ సూత్రధార, విష్ణు ధర్మోత్తర పురాణము (చిత్ర సూత్రభాగము)లు అనేక హస్తముద్రలను పేర్కొను చున్నవి. హస్త ముద్రలు త్రివిధములు.

| సమరాంగణ సూత్రధార | విష్ణుధర్మోత్తర |
|---|---|
| 1. అసంయుత హస్తములు -24 | అసంయుతహస్తములు-21 |
| 2. సంయుత హస్తములు -13 | సంయుత హస్తములు-13 |
| 3. నృత్త హస్తములు -27 | నృత్తహస్తములు -28 |

శిల్ప శాస్త్రగ్రంథముల కాలభేదము వలన అవి పేర్కొన్న హస్త ముద్రలలో కూడా వ్యత్యాసముండుట గమనార్హము.

## అసంయుత హస్తములు

సమరాంగణ సూత్రధార

1. పతాకముద్ర, 2. త్రిపతాక ముద్ర, 3. కర్తరీముఖ ముద్ర, 4. అర్ధచంద్రముద్ర, 5. అరాలముద్ర, 6. శుకతుండముద్ర, 7. ముష్టిముద్ర, 8. శిఖరముద్ర, 9. కపిత్థముద్ర 10. కటకాముఖ ముద్ర, 11. సూచీముఖ ముద్ర, 12. పద్మ కోశముద్ర, 13. సర్పశిరముద్ర, 14 మృగశీర్షక ముద్ర, 15. లాంగూలముద్ర, 16. అలపద్మ ముద్ర, 17. చతురముద్ర, 18. భ్రమర ముద్ర, 19. హంసవక్త్ర ముద్ర, 20 హంసపక్ష ముద్ర, 21. సందంశముద్ర, 22. ముకుళముద్ర, 23. ఊర్ణనాభముద్ర, 24. తామ్రచూడముద్ర,

విష్ణుధర్మోత్తర

1. పతాక ముద్ర, 2. త్రిపతాక ముద్ర, 3. కర్తరీ ముఖ ముద్ర, 4. అర్ధచంద్రముద్ర, 5. అరాల ముద్ర, 6. శుక తుండ ముద్ర, 7. ముష్టి ముద్ర, 8. శిఖరముద్ర, 9. కపిత్థముద్ర,

10. కటకాముఖ ముద్ర, 11. సూచ్యర్థ ముద్ర, 12. పద్మకోశముద్ర 13. మృగశీర్ష ముద్ర, 14. మృగలాంగూల ముద్ర, 15. అలపద్మ ముద్ర, 16. చతుర ముద్ర, 17. భ్రమర ముద్ర, 18. హంసాస్య ముద్ర, 19. హంసపక్ష ముద్ర, 20. సందంశ ముద్ర, 21. ముకుళ ముద్ర.

సంయుత హస్తములు

సమరాంగణ సూత్రధార

1. కర్కట ముద్ర, 2. స్వస్తిక ముద్ర, 3. కటక ముద్ర, 4. ఉత్సంగ ముద్ర, 5. అంజలి ముద్ర, 6. కపోతముద్ర, 7. డోల ముద్ర, 8. పుష్పపుట ముద్ర, 9. మకర ముద్ర, 10. గజదంతముద్ర, 11 అపహిత్థ ముద్ర, 12 వర్ధమాన ముద్ర, 13. శకటముద్ర,

విష్ణుధర్మోత్తర

1. అంజలి ముద్ర, 2. కపోతముద్ర, 3. కర్కటముద్ర, 4. స్వస్తిక ముద్ర, 5. కటక ముద్ర, 6. వర్ధమానముద్ర 7. ఉత్సంగ ముద్ర, 8. నిషేద ముద్ర, 9. డోలముద్ర, 10. పుష్పపుట ముద్ర, 11. మకరముద్ర, 12. గజదంత ముద్ర, 13. అపహిత్థ ముద్ర,

నృత్త హస్తములు

సమరాంగణ సూత్రధార

1. చతురస్ర ముద్ర, 2. విప్రకీర్ణ ముద్ర, 3. పద్మకోశ ముద్ర, 4. అరల కటకాముఖ ముద్ర, 5. ఆవిద్ధ వక్రక ముద్ర, 6. సూచీముఖ ముద్ర, 7. రేచితముద్ర, 8. ఉత్తాన వంచితముద్ర, 9. అర్ధరేచిత ముద్ర, 10. పల్లవ ముద్ర, 11. కేశబంధ ముద్ర, 12. లతాముద్ర, 13. గజ ముద్ర, 14. పక్షవాంచిత ముద్ర 15. పక్షప్రద్యోతక ముద్ర, 16. గరుడ పక్ష ముద్ర, 17. దండపక్ష ముద్ర, 18. ఊర్ధ్వ మండల ముద్ర, 19. పార్శ్వ మండల ముద్ర, 20. ఊరూ మండల ముద్ర, 21. ఉరఃపార్శ్వార్ధ మండల ముద్ర

విష్ణుధర్మోత్తర

1. చతురస్ర ముద్ర, 2. ఆవృత్త ముద్ర, 3. లఘుముఖ ముద్ర, 4. అరల కటకా ముఖ ముద్ర, 5. ఆవిద్ధముద్ర, 6. సూచీముఖ ముద్ర, 7. రేచితముద్ర, 8. అర్ధరేచితముద్ర, 9 అపహిత్థముద్ర, 10. పల్లవిత ముద్ర, 11. నితంబముద్ర, 12. కేశవర్ధన ముద్ర, 13. లతాఖ్యముద్ర, 14. గజముద్ర, 15. పక్షద్యోత ముద్ర, 16. అర్ధవర్థిత ముద్ర, 17. గరుడ పక్షముద్ర, 18. దండపక్ష ముద్ర, 19. ఊర్ధ్వమండలముద్ర, 20. పార్శ్వ మండల ముద్ర, 21. పార్శ్వార్ధ మండల ముద్ర 22. ఊరూమండల ముద్ర, 23. ఇష్ట స్వస్తిక ముద్ర, 24. పద్మకోశిక ముద్ర. 25. అలపల్లవ ముద్ర, 26. ఉల్బాన ముద్ర, 27. లలిత ముద్ర, 28. వలిత ముద్ర,

ఈ శిల్ప శాస్త్రములు కొన్ని అధ్యాయములనే హస్తముద్రలకై ప్రత్యేకించినప్పటికి, యివి పేర్కొన్న అన్ని హస్తముద్రలు శిల్పము లందు కన్పట్టవు. కాని యివన్నియు నాట్యమందు బహుళోపయోగి తములు. 'హస్త ముద్రలన్నియు శిల్పములలో నుపయోగింప బడలే దన్న డా॥ బెనర్జీ గారి యభిప్రాయము, మిక్కిలి సమంజసమైనది. అందువలన శిల్పములందు ద్యోతకమగు హస్తముద్రలు, శిల్పశాస్త్ర ఉదహరితములగు కొన్ని నాట్య ముద్రలు కాక, కళోపాసనా జనిత మైన మరికొన్ని ముద్రలు కూడ. కావున శిల్పములందు హస్తముద్రలు ద్వివిధములు మాత్రమే.

• నాట్యముద్రలు శిల్పి స్పష్టములగు ముద్రలు

1. అంజలి ముద్ర, 2. గజముద్ర, 3. డోలముద్ర, 4. కటక ముద్ర, 5. తర్జని ముద్ర, 6. కర్తరీ ముఖ ముద్ర, 7. అర్ధచంద్ర ముద్ర, 8. అర్ధ పతాక ముద్ర, 9. ముష్టి ముద్ర, 10. అభయ ముద్ర 11. వరద ముద్ర, 12. సింహ కర్ణ ముద్ర, 13. వ్యాఖ్యానముద్ర, 14. ఢమరుగ ముద్ర, 15. ఆలింగన ముద్ర, 16. ఊరూ ముద్ర, 17. విస్మయ ముద్ర, 18. జ్ఞానముద్ర, 19 ధ్యాన ముద్ర, 20. నిద్రా ముద్ర, 21. ధనుర్ముద్ర, 22. నాట్య ముద్ర, 23. దండ ముద్ర, 24. కటిహస్త ముద్ర, 25. ధర్మచక్ర ప్రవర్తన ముద్ర, 26. భూస్పర్శ ముద్ర, 27. కాయోత్సర్గ ముద్ర,

శిల్పములందు మొత్తము 27 హస్తముద్రలు దర్శనీయములు. కాని సి. శివరామమూర్తిగారు, డా. బెనర్జీగారు, టి. ఎ. గోపీనాథ రావ్‌గారు తదితర విద్వాంసులు 15 ముద్రలను మాత్రమే వివరించిరి.

## 1. అభయ ముద్ర:

ఊర్ధ్వ ముఖముగా హస్తము పరిశీలకుని వైపు తిరిగియుండు టను అభయ ముద్రగా వరాహమిహిరుడు బృహత్సంహిత[4] యందు వర్ణించెను. దీనినే పతాక ముద్ర[5] యని కూడ పిలువవచ్చును, కుశానుల కాలపు శిల్పములందే యీ ముద్రలు కాననగును. కుశానుల కాలపు మధురా బుద్ధ శిల్పములలోనూ, శివ-విశ్వామిత్రులున్న ధర మోష నాణ్యములందును యీముద్ర చిత్రితము. బార్‌హోత్ నందలి మహా కపి జాతకము చిత్రితమైన చోటునందు, బ్రహ్మదత్త రాజు యొక్క హస్తము ఈ ముద్రయందున్నది. హిందూ, జైన, బౌద్ధ శిల్పములన్నిటిలోను అభయ ముద్ర సర్వసాధారణముగా కన్పడును. ఈ యభయ ముద్ర కాపాడు[6] లేదా రక్షించు లేక సలహాయిచ్చు చిహ్నాత్మకమైనది. [చిత్రము 1]

## 2. వరద ముద్ర :

ఇది వరప్రద సూచాత్మకమైన మరొక సుపరిచిత ముద్ర. ఇందులో హస్తము అధోముఖముగా నుండును. ఈ ముద్రను మొహంజోదారో[7] మొహర్లలో యోగభంగిమ యందు ఆసీన శిల్ప మూర్తు లందును, హరప్పాలో లభ్యమైన మృణ్మయ శిల్పాలలోనూ ప్రపథ

మంగా కాన్పట్టు చున్నది. 'శిల్పరత్న'[8] మను గ్రంథములో యీ ముద్రను వరదాన ముద్రగా చెప్పబడినది. [చిత్రము 2]

## 3. అహోయ వరద ముద్ర :

అభయ ముద్రపు వేరొక స్వరూపమే యిది. ఈ ముద్ర యందు వేళ్ళు మాత్రము కొంత వంగియుండును. శివరామమూర్తి గారు[9] యీ ముద్రను భగవంతుడు భక్తుని వరమిచ్చెద రమ్మనుచున్న సూచాత్మకముగా వర్ణించినారు. చోళుల కాలపు సుఖాసీన స్థిత శైవ, దేవి విగ్రహములలో యీ ముద్ర కొన్ని చోట్ల దర్శనీయము. ఈ ముద్ర యొక్క ఉపయోగము అత్యల్పము. [చిత్రము 3]

## 4. అంజలి ముద్ర :

సంయుత హస్తముల కోవకు చెందిన యీ ముద్రను సాధారణముగా ఆళ్వారులు, నాయనార్లు, నందికేశ్వర, గరుడ, చండికేశ్వరాది భక్తుల విగ్రహములలో చూడవచ్చును. ఈ ముద్రను హరప్పా-మొహంజొదారో నాగరికతకు చెందినదిగానే భావింప వచ్చును. మొహంజోదారో[10] మొహర్లలో యీ ముద్ర చిత్రితమైనది. విష్ణు ధర్మోత్తరములో[11] నుడివినట్టుగా రెండు పతాక ముద్రల కలయిక యీ అంజలి ముద్ర. ముఖ్యముగా యిది పూజా కాలయందు ఉపయోగపడు ముద్ర. [చిత్రము 4]

## 5. సింహ కర్ణ ముద్ర మరియు 6. కటక ముద్ర :

అనేక విద్వాంసులు యీ రెండు ముద్రలను ఒక్కటిగానే భావించెదరు. కాని యీ ముద్రలలోనున్న వ్యత్యాసమును చిత్రము 5. 6లలో చూడ వచ్చును. శిల్ప శాస్త్రములు కూడ వీటి భేదమును వివరించినవి. కాశ్యప శిల్పశాస్త్ర మందు కటక ముద్ర విన్యాసము యీ క్రింది విధముగా అభివర్ణితము.

తర్జన్యాది కనిష్ఠాంతమ్ తత్రమూలస్తువక్రయా।

ఈశాద్వక్రం తదంగుష్ఠమ్ ఏవంస్యాత్ కటకా కృతి ॥

సింహకర్ణ ముద్ర విన్యాసమును శిల్పరత్న కావ్యములో య్యీక్రింది విధముగా చెప్పబడినది.

తదేవ సింహ కర్ణాఖ్యాం 1 తలమధ్య గతంయది ॥
మధ్యాంగుళాగ్రం వక్రంభం తదుపాఙ్గ శతం తథా।
కనామికాగ్రం శేషాః స్యుః పూర్వదా పరికల్పితాః॥

ఈ రెండు ముద్రలు ఆయుధములు లేక పుష్పములను పట్టుకొనుటలో ఉపయోగపడును. ముఖ్యముగా దేవి విగ్రహములందీ ముద్రను దర్శించ వచ్చును. ఖార్హోత్‌కు చెందిన సిరిమాదేవతా మూర్తి యీ ముద్రకు చెందిన ప్రాచీన శిల్పము.


1.అభయ ముద్ర


2.వరద ముద్ర


3.ఆహాయ వరద ముద్ర


4 అంజలి ముద్ర


5.సింహకర్ణ ముద్ర


6 కటక ముద్ర


7. గజ హస్తము


7a. దండ హస్తము


8.డోల కరము


9. డమరుగ హస్తము


10. ఆలింగన హస్తము


11 కటి హస్తము


12. ఊరుహస్తము


13. విస్మయముద్ర


14. అర్ధచంద్రముద్ర


15. ధనుర్హస్తము


16. ముష్టికరము


17. నాట్యకరము


18. నిమ్రితహస్తం


19. తర్జనిముద్ర


20. కర్తరీముఖముద్ర


21. అర్ధపతాకముద్ర


22. ధ్యానముద్ర

## 7. గజహస్తము లేక దండ హస్తము :

ఈ ముద్ర యందు హస్తము ఏనుగు తొండమువలె యుండును. [చిత్రము 7]- అన్ని నటరాజస్వామి విగ్రహములలోను యీ ముద్ర దర్శనీయము. యోగాసన స్థిత [నృసింహ] మూర్తుల తొడలపై వ్రేలాడు రెండు హస్తములందునూ యీముద్ర కన్పడును. [పటము 7]. నాట్య శాస్త్రమందు దీనిని కరిహస్తముద్రయని పిలిచెదరు.

## 8. డోలకరము :

నిలువు భంగిమలోని అన్ని దేవీ విగ్రహముల వామహస్తములు సర్వసాధారణముగా డోల ముద్ర యందుండును. [చిత్రము 8] విష్ణు ధర్మోత్తరములో యీ ముద్ర యభివర్ణితము.

సంక్షిప్తే చైవ నిక్షిప్తే తథాకాయః ప్రవేశితే ।
పతాకా లంబితౌ హస్తౌ డోలౌ పరికీర్తితౌ ॥

## 9. ఢమరుగ హస్తముద్ర :

ఈశ్వరుడు ఢమరుగమును పట్టుకొన్నప్పుడు మాత్రమే యీ ముద్ర కన్పించును. అందువలననే దీనికి ఢమరుగ హస్తమని పేరు. [చిత్రము 9]

## 10. ఆలింగన హస్తముద్ర :

ఆలింగిత పార్వతీ - పరమేశ్వరులందీముద్రను చూడవచ్చును. [చిత్రము 10]

## 11. కట్యవలంబిత ముద్ర మరియు 12. ఊరూహస్తముద్ర

వామహస్తము కటిప్రదేశముపై నుంచిన కట్యవలంబిత ముద్ర యనియు, [చిత్రము 11], కటిప్రదేశపు అధోభాగమునందు గాని లేక, సింహాది యితర ప్రాణులపైన గాని లేక గదాది ఆయుధములపై గాని వుంచిన ఊరు హస్త ముద్ర యని పిలువబడును. [చిత్రము 12] డా. బెనర్జీగారు[12] కట్యవలంబిత ముద్రగల నాణ్యములనేకముల నుదహరించిరి.

1. శివమూర్తి యున్న వేమా క్యాడ్ ఫైసిస్ నాణ్యములు
2. శివ - విశ్వామిత్రులున్న ధరఘోషుని వెండినాణ్యములు
3. శివ - చక్రేశ్వరులున్న కుణిందర నాణ్యములు
4. లక్ష్మీదేవియున్న ఇండో - పిథియన్ నాణ్యములు.

మధురలో కాన్పించు కుశానుల కాలపు అనేక బౌద్ధవిగ్రహాలలో యీ ముద్ర దర్శనీయము. తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరుల వామ హస్తము యీ ముద్రయందున్నది. స్థానక విష్ణుమూర్తి యొక్క వామహస్తము గదపై యుంచి ఊరూ హస్త నిదర్శనమై యున్నది.

### 13. విస్మయ ముద్ర

ఈ ముద్ర ఆశ్చర్య సూచకము. కైలాసనాథ ఆలయ మందిరి చండేశానుగ్రహ మూర్తి యొక్క హస్తము యీ ముద్రకొక చక్కని ఉదాహరణము [చిత్రము 13]. ఈ ముద్రకు ఉదాహరణ ములు అనేకములు. తిన్నెపెల్లి శెర్మాదేవి ఆలయ మందిరి అంజనేయ కాంస్య విగ్రహము యీ ముద్రకు చక్కని మరొక ఉదాహరణము.

### 14. అర్ధ చంద్ర ముద్ర

అగ్నిని పట్టుకున్న నటరాజ స్వామి విగ్రహముల వామ హస్తములు యీ ముద్ర యందుండును. ధనురాకారపు హస్తవిన్యాస మునకు అర్ధచంద్ర [చిత్రము 14] ముద్ర యని పేరు.

### 15. ధనుర్హస్త ముద్ర

కోదండ రామస్వామి మరియు యితర విగ్రహాలలో యీ ముద్రను చూడవచ్చును. [చిత్రము 15]

### 16. ముష్టి కరము

బల్ప్రయోగము[13] నకుపయోగపడు ముద్రయిది. కాని శిల్పము లందు ఆయుధ ధారణ కుపయోగింపబడినది. మౌర్యుల కాలపు[14] చామరగ్రాహిణులు చామరములను పట్టుకొన్న ముద్ర దీనికొక ఉదాహరణము. కుశానుల కాలపు ఖడ్గయుత హస్తము, కనిష్క[15] ప్రతిమలోని హస్తము యీ ముద్ర [చిత్రము 16] యందున్నది.

### 17. నాట్య కరము

బార్హోత్ అప్సరసల శిల్పములు, నాట్యగణపతి, కాళీయ మర్దనుడైన శ్రీకృష్ణుని వామహస్తము, చాముండి నాట్య విగ్రహాలలో యీ ముద్ర [చిత్రము 17] దర్శనీయము.

### 18. నిద్రా హస్తము

దీనిలో దేహపు పూర్తిభారము ఒకే హస్తముపై నుండును. ఈ హస్తము నేలపైన గాని యేదైనా పీఠముపైన గాని ఊదపరుచబడి యుండును. ఈ భంగిమకు [చిత్రము 18] నిద్రాహస్తమని పేరు. ఈ ముద్రగల మూర్తులు సుఖాసీనులై యుందురు. చోళుల సుఖాసీన స్థిత పార్వతి కాంస్య విగ్రహము [16] యీ ముద్రకొక రమణీయమైన ఉదాహరణము.

### 19. తర్జని ముద్ర

ఈ ముద్ర అత్యల్ప ఉపయోగితము. నాట్య శాస్త్రములో దీనినే సూచీముఖ హస్తమని పిలిచెదరు. ఈ ముద్ర [చిత్రము 19] దేనినో చూపుటకు చిహ్నముగా నుండును. బార్హోత్ నంది [17] ముద్రాయత శిల్పముల దర్శించవచ్చును.

### 20. కర్తరీముఖ మరియు 21. అర్ధపతాక ముద్రలు:

ఈ రెండు ముద్రలకు స్వల్పమైన వ్యత్యాసమున్నప్పటికిని (చిత్రము 20, 21) రెంటినీ కర్తరీ ముఖ ముద్రలనియే సంబోధింప వచ్చును. దేవతా శిల్పాలలో శంఖ, చక్రాది ఆయుధ ధారణలో నివి ఉపయోగ పడును.

### 22. ధ్యానముద్ర :

పద్మాసన స్థితమై, దృష్టిని నాసాగ్రముపై కేంద్రీకరించి దక్షిణ హస్తముపై వామహస్తముంచి కరములను పద్మాసన స్థిత పాదములపై యుంచిన భంగిమను ధ్యాన భంగిమ అనియు యీ



23. వ్యాఖ్యానముద్ర 24 జ్ఞానముద్ర

25. ధర్మశాస్త్రప్రవర్తన ముద్ర 26. భూస్పర్శ ముద్ర

ముద్రను ధ్యానముద్రగాను వర్ణించెదరు. ఈభంగిమ వర్ణన భగవద్గీత,[18] కుమార సంభవాది[19] గ్రంథాలలో చూడవచ్చును. క్రీ.పూ. 2-3 శతాబ్దపు ఉజ్జయిని[20] తామ్ర నాణ్యములందలి మూర్తులలోను, అనేక గాంధార[21] శిల్పాలలోను యీ ముద్ర దర్శితము. మధుర కళా శాల యందలి యోగ విష్ణు మూర్తులందీ ముద్ర దర్శనీయము. (చిత్రము 22)

### 23. వ్యాఖ్యానముద్ర:

బొటన చూపుడు వేళ్ళ కొనలు పరస్పర స్పర్శితములై యితర వ్రేళ్ళు తెరువబడియున్న హస్తముదను వ్యాఖ్యాన ముద్రయందురు

తీసినే సందర్శన లేక చిన్ముద్రయనికూడ అందురు. ఎల్లోరా యందలి రామేశ్వర గుహలోని సుబ్రహ్మణ్యస్వామి తన తండ్రియైన ఈశ్వరు నకు ఓంకార మంత్రార్థమును ఉపదేశించుచున్న శిల్పములో యీ ముద్ర కనపడును. బార్‌హోత్ లోని దీర్ఘ తపస్వియైన ముని తన శిష్యులకు ఉపదేశమిచ్చుచున్న చిత్రములో కూడ యీ ముద్ర చిత్రితము. (చిత్రము 23).

## 24. జ్ఞానముద్ర :

వ్యాఖ్యాన,జ్ఞానముద్రలకు వ్యత్యాసము అంతగాలేదు. వ్యాఖ్యాన ముద్రయే హృదయ సమీపమున హృదయాభిముఖముగా నున్నప్పుడు జ్ఞాన ముద్రయనబడుచున్నది. బార్‌హోత్ నందలి అజిపాలక యక్ష శిల్పములోను థియోగర్‌లోని నర-నారాయణ విగ్రహాలలోను యీ ముద్ర దర్శనీయము. కొన్ని శిల్పాలలో హస్తము పరిశీలకునివైపు కూడా తిరిగి యుండుట (చిత్రము 24) కలదు.

## 25. ధర్మ చక్ర ప్రవర్తన ముద్ర మరియు
## 26. భూస్పర్శముద్ర (:)

బుద్ధుని ప్రతిమలలో మాత్రమే యీ ముద్రను చూడ వీలగును. సారనాథ్ నందలి బుద్ధ శిల్పములో ధర్మప్రవర్తన ముద్ర యున్నది. డా. బెనర్జీగారి యభిప్రాయములో జ్ఞాన, వ్యాఖ్యాన ముద్రల కలయికయే ధర్మచక్ర ప్రవర్తన ముద్ర. ఇందులో వామ హస్తము జ్ఞాన ముద్రలోను దక్షిణ హస్తము వ్యాఖ్యానముద్రలోను వుండును. [చిత్రము 25,26]

హస్తము భూమిని స్పర్శించినపుడు యీ ముద్రకు భూస్పర్శ ముద్రయని పేరు. మహాయానశిల్పములో సూచింపబడిన ధర్మచక్ర, భూస్పర్శముద్రలు క్రమముగా వైరోచన అక్షోభయ మూర్తులలో దర్శనీయములు.

## 26. అజాన లంబ బాహు ముద్ర :

ఇది జైన మూర్తులలో మాత్రమే ఉపయోగపడును. ఈ ముద్రను వరాహమిహిరుడు ఆజాను లంబబాహు ముద్రయని సూచించినాడు.

## అధోజ్ఞాపికలు

1. విష్ణుధర్మోత్తర పురాణం.
2. హస్తేన సయ మన్నర్థమ్ దృష్ట్యాచ ప్రతి పాదయన్ ।
   సజీవ యితి దృశ్యేత సర్వాభినయ దర్శనాత్ ॥
   ఆంగ్జికే చైవ చిత్రే
3. జె. ఎన్. బెనర్జీ. డెవలప్‌మెంట్ ఆఫ్ హిందూ ఐకొనాగ్రఫీ
4. బృ. సం. అధ్యాయ 57, 33-35
5. ప్రసరితాగ్రా సహిత యత్యాంగుళ్యో భవంతిహి ।
   కుంచి తశ్చ తథాంగుష్ఠః సపాతక యితి స్మృతః ॥
   విష్ణుధర్మోత్తర అధ్యాయము 26 శ్లో. 14, 16
6. ప్రవృత్తిశ్చ కార్య కార్యే భయాభయే ।
   బంధం మోక్షశ్చ యావేత్తి బుద్ధిః పార్థ సాత్వికి ॥
   భగవద్గీత అధ్యాయము 18 శ్లో. 30
7. ఎమ్. ఎస్. వత్స్: ఎక్స్ కవేషన్స్ ఎట్ హరప్పా పు 294, ప్లే LXXVI
8. శిల్పరత్న. అధ్యాయ 16, 29
9. సి. శివరామమూర్తి: సౌత్ ఇండియన్ బ్రాంజెస్
10. హెచ్. జిమ్మర్ ది ఆర్ట్ ఆఫ్ ఇండియన్ ఆసియా వాల్. 2
11. పతాక భ్యాంతు హస్తాభ్యామ ఘస్పుటోంజలి రుచ్యతే ।
    దేవతానాం గురుణాంచ పితౄణాం చేష్యతేమనః ॥ అధ్యాయము 26
12. జె. ఎన్. బెనర్జీ పయిన గ్రంథం పు257
13. మహాభారత I, 16-17
14. వి. ఎస్. అగర్వాలా ఇండియన్ ఆర్ట్ ప్లే XX. చిత్ర 52
15. అదే ప్లే XLVII చిత్ర 158
16. డి. ఆర్. థాపర్ ఐకాన్స్ ఇన్ బ్రాంస్ ప్లే LXII
17. వి. ఎస్. అగర్వాలా, ఇండియన్ ఆర్ట్ ప్లే LXX
18. సమంకాయ శిరోగ్రీవం శ్వరయన్నచలం స్థిరః।
    సంపేక్ష్య నాసికాగ్రం స్వం దిశస్యాన్నవలోకయన్ ॥
    భగవద్గీత 6 అ, శ్లో 13
19. కుమార సంభవం III 47
20. కన్నింగ్‌హామ్: కాయిన్స్ ఆఫ్ ఏన్‌షెంట్ ఇండియా
21. హెచ్ హర్‌గ్రీవ్స్ : హాండ్‌బుక్ టు ది స్కల్ప్చర్స్ ఇన్ ది పెషావర్ మ్యూసియమ్. ప్లే 8.




( గ త సం చి క త రు వా యి )

(పాట)

బలవంతవర్మ : (రామజోగి) రామనామ స్మరణం

ఇహపర తరణం !
సాగర నిభమీ సంసారములో
జడి వానలలో సుడిగాలులలో
సీతారాముల శ్రీప్రద చరణం
సర్వకాలముల శరణం !
రామనామ స్మరణం
ఇహపర తరణం

(పాట చివరిభాగం సన్నగా దూరంలో వినవస్తూంటుంది)

యామిని : మన అంధభిక్షకుడు రామజోగిలాఉంది ! ఉజ్జయిని వెళ్లి అప్పుడే వచ్చేశాడా !

మాధవి : నిన్న సాయంత్రమే వచ్చి పాతగుర్రాల సాలదగ్గర తన మామూలు స్థలంలో వసతి ఏర్పాటు చేసుకున్నాడుదేవీ ! ఈసారి ఇద్దరు మనుమరాళ్లను కూడా వెంటబెట్టుకు వచ్చాడు. పాపం వాళ్ళ అమ్మా నాన్నా తీర్థయాత్రలకు వెళ్ళి కాశీ దగ్గర గంగానదిలో ఒక్కసారే మునిగి మరణించారట దేవీ !

యామి : అయ్యో-ఇద్దరూ ఒకసారే పోయారా !

మాధ : ఆం-కోడలు కాలుజారితే రక్షించడానికి వెళ్ళి ఆ కొడుకూ గంగానది పాలై పోయాడట, ఇంట్లో వీళ్ళను చూసే దిక్కెవరూ లేక మనుమరాళ్లను వెంటతెచ్చుకొచ్చాడు. ఇది వరకులా ఉత్సాహంగా లేడమ్మా తాత, బాగా కుంగిపోయి ఉన్నాడు.

యామి : ఉత్సాహంగా ఎలా ఉంటాడు పాపం ! సాయంత్రం వచ్చి భజనగీతాలు పాడమను. చాలా దినాలైంది విని.

మాధ : చిత్తందేవీ !

యామి : ఆ పిల్లల్ని కూడా తీసుకు రమ్మనిచెప్పు.

మాధ : అలాగేనమ్మా !

## 8

(పాట చివరిభాగం)

బలవంతవర్మ : నిత్య జయ మంగళం -

శ్రీ సీతారామ చంద్రులకూ
మంగళం !

యామిని : ఎంత మధురంగా ఉంది నీ గొంతు! నీ మనుమరాళ్ళ గొంతులూ అమృతరసధునులే ! రామజోగి ! ఏదో పూర్వజన్మల సుకృతఫలం ! ఇదిగో - ఇదిగోన మా రజనీ - రాగిణీ!

బల : మహా ప్రసాదం తల్లీ!

యామి : చూడు రామజోగి - ప్రాయంలో ఎంతో అందంగా సుకుమారంగా ఉన్నారు. ఈ అమ్మాయిలు వీళ్లు అక్కడ గుర్రాల సాల దగ్గర ఉండడం మంచిదికాదు. నువ్వేమో అంధుడివి. ఈ వాళా రేపూ పరిస్థితులు బాగులేవు. వీళ్ళని మా ఈ అంగణం లోనే ఉండనీ. ఎంతమంది ఉన్నా కావలసిన పనులేవో ఇంకా ఊరుతూనే ఉంటాయి. పిల్లలిద్దరూ బుద్ధిమంతులు. వినయ ప్రవర్తన నేర్చినవారు. మా కిక్కడ ఉపయోగకరంగా ఉంటారు.

బల : దేవీ, యామినమ్మా! అంతకన్నా నాకు కావలిసిందేముంది? తల్లీ! అవంతీ నగరంలో ఉన్న వాళ్ళపినతల్లికి వార్త పంపాను. ఇంకా ప్రత్యుత్తరం రాలేదు ఇంతవరకూ, వీళ్ళను ఎక్కడ ఎలా ఉంచడమా అని బెంగగా ఉండేది. అదీవాళ తీరిపోయింది తల్లీ !ఎంతో సుదినం ఇది! చిరకాలం కృతజ్ఞులం దేవీ!దేవుడు మిమ్మను పదికాలల పాటు చల్లగా చూస్తాడు.

యామి : ఈ రాత్రి నుండే వీళ్ళనిక్కడ ఉండనీ తాతా!

బల : మహాభాగ్యం తల్లీ !

యామి : మాధవీ - వీళ్ళు ఉండడానికి తగిన ఏర్పాటు చెయ్యి.

మాధ : ఆజ్ఞ దేవీ !

* * *

## 9

(పక్షుల కలకలం-కోయిల కూతలు)

సుజాత : (రజని) ఇదిగో దేవా! అమ్మగారు పంపారీ ఫలహారమూ, పానీయమూ.

రాజసింహుడు : అక్కడుంచు

(వీణానాదం) ఆ!

వసంత : (రాగిణి) (దూరాలలో)

-పాట-

తొలి చూపుల కలయికలో
వలపు విరుల మాలికలూ!
అమరమైన అనురాగ సుగంధం!
యుగయుగాల ప్రణయాను బంధం!
తీయ తలపు పుప్పొడులూ
తేనె కలల అలజడులూ
విరియు పసిడి వెన్నెలలే !
వీచును చలువ తెమ్మెరలే!
తొలకరి లో క్రొమ్మెరపులు
ముని వేకువ లేమెరుపులు
ఆమని కోయిల గీతులూ
హరివిల్లున గీతలూ !
తొలి చూపుల కలయికలో
వలపు విరుల మాలికలూ!



రాజ : ఎవరు నువ్వు? మాటలు రావా? ఆలిచిప్పల్లా విప్పారిన కళ్ళతో ఎందుకలా మౌనంగా ఉండిపోయావు?

సుజా : (తడబడిపోతూ) నే.... నేను.... నేను.... సు.... సు-రజని.... రజనిని !

రాజ : సురజని?

సుజా : కాదు - ఉత్తరజని - (సన్నగా నవ్వి) ఇంట్లో సుందూ అని పిలిచేవాళ్ళు.........

రాజ : రజని! ఎంత చక్కని పేరు! భయమెందుకు రజనీ? నాపేరు రాజసింహుడు. ఎన్నాళ్ళైంది వచ్చి ఈ అంగణానికి?

సుజా : నిన్ననే-మా తాత ఉజ్జయిని అంధ భిక్షకుడు రామజోగి.

రాజ : ఓ. అవునవును. అమ్మ చెప్పింది. మీ అక్క కూడా వచ్చింది కదూ. నీతో?

సుజా : (సన్నగానవ్వి) ఊహూం అక్కగాదు. చెల్లి రాగిణి. నేనే పెద్ద. ఇప్పుడా పాట పాడింది ఆదే. (నవ్వుతూ) ఆక్కడ అందరూ కలిసి పాటలు పాడిస్తున్నారు.

రాజ : ఉజ్జయిని కన్యలు అతిలోక సుందరులే కాక గాన గంధర్వులు కూడా అన్నమాట! నీవు కూడా చాలా బాగా పాడతావట కదూ రజనీ.

సుజా : (తడబాటుతో) ఆం ఏదో కొద్దిగా.........

రాజ : (నవ్వుతూ) ఇప్పుడు పాడమననులే. భయపడకు. పనిమీద వెళ్లాలి - మరొక దినం తప్పకుండా పాడాలి నువ్వు.

సుజా : తమ ఆజ్ఞ వస్తాను దేవా.

రాజ : వెళ్ళిరా. (మధురంగా వాద్య సంగీతం) ఆం, ఇదిగో రజనీ....

సుజా : దేవా ?

రాజ : ఎందుకో నిన్ను ఎప్పుడో చూసినట్లుగా అనిపిస్తున్నది.

సుజా : నిన్నా? (ఆగి) ఎందుకో నాకూ అలాగే అనిపిస్తున్నది దేవా! ఎక్కడో కలల వీధిలో కలిశామేమో ! లేక ఏదో పూర్వ జన్మలో........,

ఏమో! (ఆగి) వస్తాను దేవా!

రాజ : వెళ్ళిరా (మధురంగా వాద్య సంగీతం) ఒక్కసారి ఆగు - అలాగే నిలబడు రజనీ! ఈ పొదరింటి ఆకుల సందుల నుండి ఏటవాలుగా వచ్చిపడుతున్న కెంపు వెలుగులలో ఎంత అందంగా కనిపిస్తున్నది నీ ముఖం ! ఎంత ఎర్రగా కనిపిస్తున్నాయి నీ పెదవులు!

సుజా : దేవా !

రాజ . రజనీ!

10

వసంత: నాన్నా - అంతఃపురంలో అన్ని అంగణాలూ గాలించి చూశాం ఒక్క ఖొజ్జాల అంగణం తప్పించి, ఆ లోపలికి స్త్రీ లెవ్వరినీ వదలటం లేదు. ఒక్క యువరాణీ ఆమెతో వెళ్లే చెలిక త్తెనూ తప్ప. అక్కడ ద్వారం దగ్గర ముష్కరులైన ఇద్దరు ఖొజ్జా లెప్పుడూ వంతుల వారీగా పహారా ఇస్తున్నారు. వాళ్ళు మధుపానం చేయనివారట. ఎప్పుడూ అప్రమత్తంగానే ఉంటారు.

బలవంతవర్మ : ఓ అలాగా? నాకు పరిచయస్థుడైన ఖొజ్జా ఒకడు ఉన్నాడు. వాడిని కదిలించి చూస్తాను. మాటకారివాడు. ఎలాగన్నా మనం ఈ అయిదారు రోజులలో యువరాజు జాడ సరిగా తెలుసుకోవాలి తల్లీ. రాబోయే పంచమి యువరాణి జన్మదినం. బ్రహ్మాండంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. అతి వైభవంగా జరపడానికి. ఆ రాత్రి నృత్య, గాన, నాటిక వినోదాలలో మధుపాన విలాసాలలో మునిగి ఉంటారందరూ. మన ఝుంఝూ దళం వాళ్ళను వినియోగించి యువరాజును తప్పించడానికి అదే అదను! ఈలోగా........

వసం : శాయశక్తులా ప్రయత్నిస్తాము నాన్నా.

బలం : ఆఁ చూడు వసంతా! -రేపటికెలాగన్నా అతఃపుర నిర్మాణ రేఖా చిత్రం తయారుచేసి తీసుకు రావాలి. పరిచారికల ఖొజ్జాల అంగణాలు తప్పించి తక్కినదంతా పూర్తయిందన్నావు కదూ ?

వసం : అవును. పరిచారికల అంగణం ఈవాళ పూర్తి చేస్తాను కాని................

బల : ఖొజ్జాల అంగణం సంగతి తరువాత చూద్దాం. నేనూ ప్రయత్నిస్తాను. రేపటికెంత అయితే అంత పూర్తిచేసి తీసుకురా.

వసం : అలాగే నాన్నా. ఎవరో వస్తున్నారు. (గట్టిగా) వేగం కానీ తాతా - అక్కడ బోలెడంతపనుంది.

బల : ఆఁ అయిపోయిందమ్మా. ఇదిగో పాత్ర.

11

-పాట-

సుజా : మరపు రాదె ఓ యమునా !
అతని చేష్టలీ తీరమునా -
నా ఈ కోమల బింబాధరముల
కురిసె నాడె మధు మకరందముల -
ఒడలు జలజలా పులకరింపగా....
నరనరాలు జలదరింపగా!
మరపు రాదె ఓ యమునా!
అతని చేష్టలీ తీరమునా-

రాజసింహుడు : రజనీ ఎంత మనోహరంగా పాడావు! వింటూటే మబ్బులన్నీ దాటుకుని ఎక్కడికో ఆ నీలపు సుదూరాలకు తేలిపోతూ వెళ్ళి అక్కడ చుక్కలతో సయ్యాట లాడ్తున్నట్లుగా అయిందీ మనస్సంతా ! ఎప్పుడూ నువ్విలా పాడుతూ నా ప్రక్కనే ఉంటే" మన జీవితమంతా ఒకే ఒక అంతులేని మంజుల రాగమైతే?

సుజా : (నవ్వి) మా జయంతి ఇలాగే అనేది.... ఎప్పుడూ వసంతమే ఉండిపోతే? ఎప్పుడూ నిండు వెన్నెలే నిండిపోతే ?

రాజ : జయంతి ? జయంతి ఎవరు?

సుజా : (ఉలికిపడి) ఆఁ ? జయంతి. జయంతి మా ఊళ్ళో ఒక నెచ్చెలి. ఈ మధ్యనే పెళ్లయి అత్తవారింటికి వెళ్ళిపోయింది.

(దూరంగా వసంత పాట)

కలువలతో సాగదు నీ ఆటా -
నెలరాజా!
ఇక
మొదలైనది లే మొయిళులవేటా !

సుజా : అదిగో ఎవరో వస్తున్నట్టున్నారు. వస్తాను దేవా !

రాజా : ఎవరూ రారిప్పుడు ఉండు రజనీ!

సుజా : లేదు - ఇప్పుడు వినవచ్చిన పాట మా ర్గాగిడి హెచ్చరిక. శెలవు దేవా.

(కొద్దిక్షణాలు వాద్య సంగీతం)

మంజరి : ఓహో! ఈ పొదరింటిలో విశ్రాంతి తీసుకుంటున్నారా ముఖ్య సేనాధిపతి రాజసింహ మహాశయులు?

రాజసింహుడు : (నవ్వి) రా మంజరీ - కూర్చో అలా.

మంజ : ఎంత మెత్తగా ఉంది ఈ పచ్చిక! అవునుగాని బావా, ఇక్కడేదో పాట విన వస్తూందేం?

రాజ : పాటా? అక్కడెక్కడో ఎవరో దాసీకన్య పాడినట్లుంది.

మంజ : దాసీకన్యల గానమాధురిలో మునిగి ఉన్నా వన్నమాట! ఆ మాధుర్యం ఆస్వాదించి నంతవరకు బాధలేదుగాని అంతకన్నా ముందుకు అడుగువేస్తే మటుకు ఈ మంజరి సహించదు-జ్ఞప్తి ఉంచుకో.

రాజ : (నవ్వి) మధ్య నీకేమి? నువ్వేమన్నా సంరక్షకురాలివా నాకు?

మంజ: సంరక్షకురాలిని కాదు మహాశయా - ఈ రాజ్యానికి కాబోయే రాణిని. ఈ రాణికి రాజులు తమరు. అదీ సంగతి. తెలిసిందా?

రాజ : మన మిప్పుడు బాల్యావస్థలో లేము. అటువంటి మాటలు అన వద్దని చెప్పానా నీకు?

మంజ : అహో! నువ్వనవద్దంటే మానేస్తానా నేను?

రాజ : భౌతికంగా ఎదిగావు గాని మానసికంగా ఎదగలేదు నువ్వింకా మంజరీ!

మంజ ; పోనీ, ఆ మాత్రం కనిపెట్టగలిగావు కదా ! అదీ కనిపించ లేదేమో నీ కళ్ళకి అనుకున్నాను. చూడు బావా, తన మరణ శయ్యమీద ముద్దులమేనల్లుడివి నిన్ను పిల్చి మా అమ్మ నీ కప్పగించింది నన్ను. అమ్మ చెప్పిన దానికంతా గంగిరెద్దులా ఊఁ అని ఒప్పుకున్నావు ఆనాడు. అప్పుడు నాకు ఎనిమిదో ఏడు, అప్పటినుంచీ.........

రాజ : నేనూ చిన్నవాణ్ణే అప్పుడు. పదిహేనేళ్ళయినా నిండలేదు. ఏదో తెలియక ఊఁ అనేశాను.

మంజ : అబ్బ పాపం - నోట్లో వేలుపెడితే కొరకడం తెలియని వయస్సు కాబోలు అప్పుడు!

రాజ : చూడు, మంజరీ? ఈ కబుర్లకేమి గాని, నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి.

మంజ : ఏమిటంత ముఖ్య విషయం?

రాజ : దేవవర్మగురించి.........

మంజ : (చిరాకుగా)ఇదివరకడిగావు-నాకుతెలియదనిచెప్పాను. మళ్ళీ...

రాజ : వాళ్ళ దాయాదుల్లో ఎవరోవిరోధులు దానికి కారకులను కున్నాను. ఇదివరకు. కానీ అది సరికాదని ఋజువుచేసే ఆధారాలు దొరికాయిప్పుడు.

మంజ : ఏమిటా ఆధారాలు?

రాజ : దేవవర్మ అంగరక్షకుల శవాలు ఉత్తర దిక్కున మనవైపు అడవిలో దొరికాయి. అందువల్ల అది మనవాళ్ళు చేసిన పనే. మదనసింహుడు తనకేమీ తెలియదంటున్నాడు. కొద్దిగా తాగు బోతు-కానీ సమర్థుడు. విశ్వాసపాత్రుడు. అతని మాట సందేహించలేను. నిజం చెప్పు. ఎవరిచేత ఆ అంగరక్షకుల్ని హత్య చేయించావు? దేవవర్మ నెక్కడ బందీ చేశావు?

మంజ : నేను హంతకురాలి నంటున్నావా ?

రాజ : నీవే స్వయంగా హత్యకు దిగకపోయినా నీ అనుచరులు చేశారా పని, నీ ఆదేశం ప్రకారం. దేవవర్మను బంధించినప్పుడు సంఘర్షణలో వారు చనిపోయి ఉంటారు. ఖొజ్జాల అంగణంలో బంధించి ఉంచావు దేవవర్మను - అవునా ?

మంజ : అబ్బో (నవ్వి) నీ ఆలోచనా శక్తి చాలా నిశితమైనదేనే !

రాజ : నేనడిగినదానికి ప్రత్యుత్తరమియ్యి...అవునా?

మంజ : నీకు ప్రత్యుత్తర మివ్వవలసిన అవసరం లేదు నాకు.

రాజ : చూడు మంజరీ - దీనికి పరిణామం చాలా భీషణంగా మారి మనరాజ్యానికే విపరీతం అయ్యే అవకాశం ఉంది. నామాటవిను. మంచిగా చెప్తున్నాను. దేవవర్మను వదిలివెయ్యడం ఉత్తమం.

మంజ : ఏం? బెదిరిస్తున్నావా? నీ మాట వినకపోతే ఏం చేస్తావ్ ? నా అంతఃపురాంగణంలో నీ సైనికులే కాదు, ఒక మగ పురు గును కూడా అడుగు పెట్టనివ్వను నేను.

రాజ : ఖొజ్జాల అంగణం అంతఃపురంలో భాగం కాదు.

మంజ : కాకపోవచ్చు - కాని అక్కడికి ఎవ్వరినీ రానివ్వం. ఈ రాజ్యపు యువరాణిని - కాబోయే రాణిని. నా మాటకెదురు లేదక్కడ.

రాజ : శ్రీ విజయసింహ మహాప్రభువులే ఆ అంగణం సోదా చెయ్య మని నాకాదేశమిస్తే?

మంజ : చెయ్యనివ్వను. నాన్న నా మాట కాదనరు. ఆ ఆదేశం రద్దు చేయిస్తాను. (తనలో అనుకున్నట్లుగా) నాకు జరిగిన తీరని ఈ అవమానానికి ప్రతీకారం చేసే సాహసం లేకపోయింది. ఎవ రికీ !(గట్టిగా) బాగా విను ముఖ్య సేనాధిపతీ! నా అనుచరులే బంధించి తెచ్చారు దేవవర్మను ! ఖొజ్జాల అంగణంలో ఏడు గదులలో మధ్యగదిలో బందీగా ఉన్నాడు దేవవర్మ సర్వ మర్యాదలూ జరుగుతున్నాయి వాడికి. ఇంతవరకూ ఏ ప్రమాదమూ సంభవించలేదు. కాని మనరాజ్యం భీషణ పరి

తిస్థితినే నువ్వన్నట్లు ఎదుర్కొన వలసి వస్తే దేవవర్మ ప్రాణానికి ముప్పు కాకపోయినా వాడి పౌరుషంమీద దెబ్బతీస్తాను నేను. ఈ సంగతి తెలియ చెయ్యి సునీల రాజ్యాధిపతికి. తాను చేసిన తప్పు ఒప్పుకుని నన్ను క్షమాపణ వేడుకుంటే వాడిని వెంటనే విడుదల చేయిస్తాను. అంతవరకు వాడు బందీగా ఉండవలసిందే ! (కొద్దిగాఆగి) ఏదో సరదాగా మాట్లాడదామని వస్తే రాజకీయాల లోనికి దింపి అనవసరంగా నన్ను రెచ్చకొట్టావు. చాలు కృతజ్ఞురాలిని - వస్తాను.

రాజ : మంజరీ! (కొద్దిక్షణాలు ఆగి) చాలా ఎత్తుకు ఎదిగింది దీని మనస్సు వికృతంగా ! హేభగవాన్!

## 12

వసంత : వాళ్ళ సంభాషణంతా నేనూ రాజకుమారీ 'ఆ పొదరింటి వెనుక పొదలలో దాగుకుని పూర్తిగా విన్నాము నాన్నా.'

బలవంతవర్మ : మన అదృష్టం! మనకు కావలసిన ఆచూకీ అంతా దొరికింది వసంతా! ఇంక కార్యాచరణ మటుకే తరువాయి. చూసు మనకింకా మూడు రోజులు వ్యవధి ఉంది. మన ఝంఝూ దళం వాళ్ళు జన్మదినానికి మారు వేషాలలో వచ్చి ఇక్కడ సిద్ధంగా ఉంటారు. నువ్వు తెచ్చిన రేఖా చిత్రం చాలా బావుంది. అంతఃపుర నిర్మాణ విధం పూర్తిగా కరతలామలకం మనకిప్పుడు, చూడమ్మా ! ఖొజ్జాల అంగణం ముందు కొద్ది దూరంలో ఎడమ వైపున ప్రహరీ గోడలో పాత బావి ఒకటి వాడుకలో లేనిది ఉంది కదూ ? జన్మదినంనాడు ఆ లోపలి గడియలు తీసి ఉంచాలి మీరు రహస్యంగా. ఆ ముందు చెదలపుట్టలూ, గుబురు మొక్కలూ పెరిగిపోయి ఉన్నాయి. అందువల్ల ఎవరూ గమనించ లేరు గడియలు తీసి ఉండడం..........

వసం : అలాగే నాన్నా!

బల : చూడు, ఈ మూడు దినాలలోగా యువరాజును ఆ అంగణం నుండి మరెక్కడికన్నా తరలిస్తారేమో, ఒక కన్ను వేసి గమనిస్తూ ఉండండి. (గట్టిగా) వెళ్ళిరా తల్లీ !

వసం : అలాగే తాతా - వస్తాను.

## 13

-పాట-

సుజాత : యదుకుల మోహను పెదవి తగులగా
మురళి ఎడద ఏమగునో కానీ
ఆపరాని ఉద్వేగం !
ఆలో
అపురమైన మధురాగం!
నీ కరయుగళి సోకినంతనే
నా తనువిది ఏమగునో కానీ
నిలపలేని ఆ వేగం!
ఈలో
పొంగి పొరలు అనురాగం!

(ఇంకా ఉంది)



# పంచభూతాళి

## శ్రీ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రి

వరవ పొంగగ పంచభూతాళి సాక్షి
మా సమస్తంబు కోల్పోవ చూచె ని కర్మ సాక్షి
చిల్లిగవ్వయు, చేత చిప్పయున్ లేదు భిక్షాటనకైన
ఈ 'అన్నపూర్ణ'ను విడిచి పోదునేదేశమైన(:)
మట్టిలో దొర్లి మా బ్రదుకులు నిరసింప
మట్టి మా నోట గొట్టి ఈ పెనుతుపాను మండింప
గళము తడిసేయ నీళ్ళైన కానరావు గాని
కన్నీళ్ళు మున్నీరు గానిండె నిదిగో భవాని
ఎడద మండించు నీ తాపము సురసుర మంచు
కాష్ఠమిది కాలగారాదుగాబోలు మది కరంచు
శ్వాస తీవ్రమై పలుచనై మరుత్తులాడ
నింగి చెలంగు రాబందుల గరుత్తులాడ
అంతరంగంబు శూన్యమై ఏ యాశ లేక
దూర దూరంబుగా సాగె నాగగనంబు దాక

డా॥ ఇంగువ కార్తికేయశర్మ

# కీసరగుట్ట శివాలయములు వాస్తు సంప్రదాయము

కీసరగిరి లేక కేసరగుట్ట యని పిలువబడు గ్రామము హైదరాబాదునకు 40 కి. మీ. ఈశాన్యంగా ఘటకేసరముపోవు రహదారిలో నున్నది. ఇచ్చటి శిథిలాలలో కోటగోడలు, శిథిలమైన యిటుక కట్టడములు విరివిగా కానవచ్చును ఇటుకలు 50 × 25 × 8 సె.మీ. గలవి లభ్యమగుచున్నవి. చక్కని కొలనులు, యెత్తైనకొండలు, పెద్ద పెద్ద నిలువుబండలతో, నిమ్నోన్నతాలతో విశాలమై కానవచ్చు యీ వూర పరిసరములు ప్రాచీనంగా శాతవాహన, ఇక్ష్వాకు, విష్ణుకుండినుల కాలమున గొప్ప సుక్షేత్రములై వెలుగొందెను.

**1. కొండపైని లింగములు :** (ఛాయాచిత్రము 1)

రామలింగేశ్వర స్వామి దేవాలయమున్న కొండపైభాగము కొంతమేరకు చదునుగా రాతిబండ కానవచ్చును. (చిత్రము-4 ఈ చదును ప్రదేశమున నల్లరాయి నునుపు దేలిన లింగములు వరుసగా పైనుంచి క్రిందివరకు (చిత్రము-1) హారములోని పూల వరుసవలె కానవచ్చును ఈ కొండపైనెక్కి యెటుచూచినను యీ లింగపీఠము లుండుట విశేషము. ఈ విధముగ మనము విశాఖపట్నము జిల్లా శంకరము (అనగా సంఘారామము)లోని బొజ్జనకొండ పైని తొలచిన రాతి స్తూపముల వరుసక్రమములను కొండపైనుండి క్రిందివరకు హారముల



ఛాయాచిత్రము - కేసరిగుట్ట శివలింగముల మాల

వలె కానవచ్చుచున్నవి. ఇన్ని శివలింగములిక్కడ యెవరు? యెప్పుడు? యెందుకు ప్రతిష్టించిరి? ఈ స్థానముయొక్క విశిష్టత యెట్టిది? ఈ వ్యాసమున పరిశీలింతును.

లింగములన్నియు నల్లరాతితో చెక్కబడినవి. రుద్రభాగము గుండ్రముగా చేయబడినది. బ్రహ్మసూత్రము చూపు గీతయుగలదు. (చిత్రము-2) విష్ణుభాగము అష్టముఖముచక్కగా నునుపు చేయబడినది. ఇక బ్రహ్మభాగము నలుపలకలుగా కొన్నింట కానవచ్చినను, యిటుక పీఠములో అంతర్గతమైనది. లింగపీఠము చతురస్రమైన అరుగు లేక దిమ్మవలె లింగముచుట్టునున్నది. అంబు లేకవారి మార్గము కానరాదు. అనగా అభిషేకాది సంస్కారములకు, వాటియగు కట్టడముగాలేదు. పైన రాతిప్రణాళికాపీఠముకూడ యెచ్చటను కానరాదు. పైని యెట్టి కప్పుగాని, కనీసము గుడిసెవలెనైనా ఆచ్ఛాదనము కానరాదు. కాన యీ లింగములన్నియు విశాలమైన అంబరముక్రిందనే ప్రాచీనముగ కూడ నుండినవి. ఇకపూజ, దీప, అర్ఘ్యములెట్లు పాటించుచుండిరి?

లింగోపరి భాగమున అనగారుద్ర భాగము, పుట్టతేనె లేక వెన్న పూయుట చూచితిని ఈ ఆచారమే అనాదిగా యుండియుండవలెనని తోచుచున్నది. పుష్పములుకూడ నుంచి మ్రొక్కుదురు. అంతేకాని అభిషేకము చేయుట కానము. ఇటుక పరిమాణములబట్టి యీలింగము లన్నియు క్రీ. శ. 3-4వ శతాబ్దిని స్థాపించియుండిరని చెప్పనగును. దేవతల నగరమైనమధురలోని శిల్పములు, ప్రాచీనకట్టడముల నిట్టి లింగపీఠములు క్రీ. శ. 1-2వ శతాబ్దిపాలించిన కుషాణుల కాలమున గలవు. (చిత్రము-3), ఇందుచూపబడిన చిత్రఖండమున లింగము పెద్ద నలుచదరపు యిటుక అరుగుపై ప్రతిష్టింపబడి యున్నది. పైన గుడి లేదు. చెట్టుయున్నది. యక్షుడు దివ్వెను వెలిగించుచున్నాడు.

ఆంధ్రదేశమున శైవము చాల ప్రాచీనముగావచ్చి నాటుకొనెను గదా! ఈ లింగప్రతిష్టలుకూడ, మధురలోని లింగస్థానములవలె రమారమి ఆదేకాలమున గావింపబడి యుండెను. కొండపైని పూజింపబడు చున్న రామలింగేశ్వరాలయము కాకతీయుల కృతము. ఈ ఆలయమును చుట్టూ సిమెంటు మండపములు తదితర కట్టడములతో పూర్వ శైలిని భంగము చేసిరి. చేరువనేయున్న బండల మధ్యనొక పోధి (నీటి గుంట) గలదు. దాని చెంతనే నొక గుండురాతిపై స్థానకమూర్తి యైన చతుర్భుజ నరసింహుని యర్ధశిల్పము, విష్ణుకుండినుల కాలపు తెలుగు శాసనము "తొలచువాండ్రు" అనగా రాతిని తొలచువారని తెలియజేయుచున్నది.

ఇటీవల కాలమున అనగా 1976-79ల నీస్థానమును ఆంధ్ర ప్రదేశ్ పురావస్తు శాఖవారు త్రవ్వకముల కావించిరి. ఒక పెద్ద వేద సంస్కృత కళాశాల, మరిన్నిప్రదేశమును దర్శించు వారికనుకూలముగ నొక విశ్రాంతి గృహము యుండుటచే వినోద-విజ్ఞాన యాత్రికులకు హైదరాబాదు నగరమునకు చేరువగా నొకసుస్థలమేర్పడిన

## విష్ణుకుండినుల కాలపు ఇటుకకట్టడములు :

ఆంధ్ర ప్రదేశము, పురావస్తు శాఖవారు త్రవ్విన స్థలము కొండపడమటి యంచున వున్నకొంత మెట్టభూమికి చెందినది. ఇటు కట్టడములు పెక్కు శిథిలావస్థలో నున్నవి. అన్నియు శైవా[illegible] కూటములు. పునాది భాగములు మాత్రమేకాక కొన్నింట వాదాపు [illegible] రెండు మీటర్ల యెత్తువరకు కట్టడపుగోడలులభించినవి. పెద్ద దేవాల[illegible] ములు దీర్ఘచతురస్రములై యున్నవి. గజపృష్ఠశైలిలో నెట్టి ఆలయ[illegible] కానరాలేదు. కొన్ని ఆలయములందు మూడుగదులుగా [illegible]



( ఛాయాచిత్రము-2 )
కీసరగుట్టయిటుక యధిష్ఠానముపై లింగము

త్రికూటముగా భావింపనగును. మధ్యగా గర్భగృహము యిరువైపు[illegible] కొంచెము చిన్నగుడులుగా ఆలయములు, ముఖత వొక శాల, [illegible] ముంగట తూర్పు ముఖముగా సోపాన చంద్రశిలలతోలంకృత ద్వా[illegible] మున్నది, (చిత్రము-4) ఈ దేవాలయములన్నియు విష్ణుకుండిన

లమునాటివి. రాగిపాత్రములు, మృత్తికాకలశములు చాల లభించి యున్నవి. ఇచ్చటనే మరియొక దేవాలయము తూర్పుపక్కన వెలికి తీయబడినది. ఈ దేవతా గృహము వరుసగా మూడుగదులుగా (కొలతలు 8 × 2.65) ముందున అగ్రమంటపము 8.5 × 2.. మీ. ముఖద్వారమున అరుగుమధ్య చంద్రశిలతోటి సోపానపంక్తి చక్కగా పూత



(ఛాయాచిత్రము-8 యక్షుడు దీపము ఉంచుట)
మధుర : ఇటుక అధిష్ఠానముపై లింగము

పూసిన గోడలున్నవి. ఈ ఆలయమునకు పశ్చిమభాగమున మరియొక గుడి, దీర్ఘచతురస్రాకారము, 2.8 × 1.9 మీ. గలిగిన గర్భాలయము యించుమించు అంతే పరిమాణముగల అర్థమండపము (2.35 × 2.20మీ.) బయల్పడినవి. ఈఆలయపు యధిష్ఠానమున,యెత్తైన వుపానము, పైనిజగతి, త్రిపట్ట కుముదము, కంపము,పట్టిక వుపరి కంపము మరియు ప్రతి పట్టిక చక్కగా చెక్కబడిన యిటుకలతో నిర్మితమయినది. గర్భాలయము వెనుక గోడనానుకొని ప్రధాన దేవతను ప్రతిష్ఠించుటకుగా నొకఅరుగు చేయబడినది. వెలుపలి గోడన కోష్ఠ దేవతలనుంచుటకుగాను కుడ్యస్తంభముల సొరగులున్నవి. ఈ ఆలయమునకు ప్రత్యేకముగ యిటుక గోడప్రాకారముకూడ గలదు.

ఈ దేవాలయమును పరిశీలించుచుండగా త్రవ్వకమున, అట్టడుగు స్తరములలో కొన్ని జుగుప్సాకరమైన యవశేషములు లభించినవి. ప్రాచీన వాస్తు విన్యాసములను తెలుపు నీ సామగ్రి మరియెక్కడను లభింపనందున, ఈ దేవాలయము చాల ముఖ్యమయినదిగా నెరుగవలెను.

వాస్తువిన్యాసము :

దేవాలయము చుట్టును పునాది భాగముల స్తరములలోను, నేలపైని కొన్ని వస్తువులు ప్రతిష్ఠా పద్ధతులను తెలుపునట్టివి లభ్యమయినవి. అట్టడుగు స్తరములలో, గర్భాలయమునకు వెలుపల ప్రాకార



(ఛాయాచిత్రము-4 విష్ణుకుండినుల కాలమునాటిది క్రీ.శ.4వశతాబ్దినాటిది) కీసర గుట్ట శివాలయము

గోడకు చేరువగా, నొక మృతకళేబరము లభ్యమయినది. తలదాచుకొని మోకాళ్ళపైని చేతులుంచి, నమస్కరించుచున్నట్లుగా కానవచ్చుచున్నాడు. వాస్తుపురుషుని ఆవాహనము గావింపునప్పుడు ఈ మధ్య వయస్కుడుగా నున్న మానవుని బలిగా నొసగినట్లు తెలియుచున్నది. ఈ కర్మ బహుశవాస్తుమండలము నిర్ధరించిన వెంటనే యాచరించిరి.. ఈ విధముగ వాస్తుపురుషునికి ఆహుతి - శాంతిచేయుట, తలపెట్టిన నిర్మాణమునకెట్టి అవాంతరములు[2] రాకుండుటకుగాను వేసిరికాబోలు. నరుని బలిగా నొసగుట వాస్తుశాంతి,వాస్తుహోమ, వాస్తుబలి ప్రకరణములలో కానరాలేదుగాని శతపథబ్రాహ్మణ[3]మున నీ పురుషమేధమును చేయుట, వాస్తుపూర్వము యాచరించువిధిగా పేర్కొనబడి యున్నది.

బలికర్మ విధానమునందు దిక్కులనున్న అధిదేవతలకు శాంతి సూచించ బడినది.మాయమత (క్రీ. శ. 8వ శతాబ్ది) మను వాస్తు గ్రంథమున పశుమాంసము, మేక, జింక, లేక పంది గృహక్షాత, పాపరాక్షసి అంతక, మున్నగు క్రూర దేవతలకు ఆరగించుట చెప్పబడియున్నది.

## మృణ్మయ కలశము : (చిత్రములు 5,6,7,8)

పై దేవాలయము యొక్క అర్థమండలమున, నైఋతిదిశన నేలమట్టముపై నొక మృత్తికా భాండమును, ప్రతిష్ఠించిరి. ఈ కలశముపై చక్కగా నమర్చబడిన గుండ్రటి మూత, గలదు. క్రిందన కలశభుజముపై వర్తులముగా స్కంధమున్నది. ఈ స్కంధముపైన కుండ మధ్యభాగమున చుట్టూ కొన్ని మట్టి బొమ్మలు చేతితో చేసినవి, నతికింపబడియున్నవి. ఈ విధముగా నీ కలశముపై ఆరు స్త్రీయాకృతలు గలవు. ఇందున అయిదు కలశోదరముపైన, అనగా చుట్టున్నూ; ఒక్క స్త్రీ మాత్రము తూర్పుముఖస్తయై సుఖాశీనురాలై మూతపైని యున్నది. అన్ని స్త్రీ మూర్తులు పలంబ పాదాసనులై యుండుట గమనింపవలసి యున్నది. అన్నింటను పొత్తికడుపు, నాభి ముందు కొచ్చినటుల చూపబడియున్నది. ముఖములు వికృతముగా కానవచ్చును. ఈ స్త్రీ మూర్తులేగాక కలశమధ్యభాగమున చుట్టున్నూ యేడు సర్పములు, పడగల నెత్తుకొన్నట్లు, చూపబడినవి. అన్ని సర్పములు తోకలు కుడిప్రక్కగానే త్రిప్పుకొని యున్నవి. కలశము చుట్టును యివి ప్రదక్షిణము చేయుచున్నట్లు చూపబడినది. ఇందున రెండు సర్పములు దక్షిణ ముఖముగా నున్నవి.(చిత్రము. 6) కొంచెము పెద్దవి, పడగలు రెండు దగ్గరగా, తోకలు యిరుప్రక్కలకు పోవునట్లు చూపబడినవి. ఈ దక్షిణ ముఖమున స్త్రీ మూర్తి కానరాదు. ఈ పెద్ద నాగములను బట్టి బహుశ(4)పాతాళలోకము సూచించబడియున్నట్లుగా తీసుకొనగును. చిత్రమేమన యీ భాండముపైని తీర్చియున్న సర్పములు. స్త్రీమూర్తులు దిక్కుల, విదిక్కుల చూపబడియుంటయేగాక, నిర్దిష్టముగా నొక క్రమమున యీ ఆలయపు నేలమట్టమున ప్రతిష్ఠింపబడుట.



(ఛాయాచిత్రము-5) కీసరిగుట్టకుంభము తూర్పు ముఖము

1. తూర్పుదిక్కు (చిత్రము - 5)

కుంభముపైని మూత వికసించిన అష్టదళ పద్మమువలె కాంతముతో సహా చూపబడియున్నది. ఈ పద్మముపై స్త్రీమూర్తి మధ్యభాగమున కూర్చొని, కాళ్ళను పద్మదళములపై నుంచినట్లు కానవచ్చుచున్నది. ఈ ప్రతిమకు చేరువగా నైఋతి కోణమున కానగు స్త్రీమూర్తి శిరోజాలంకారము, కంఠాభరణములు, చెవిని కుండలములు చక్కగా నున్నవి.

2. దక్షిణముఖము : (చిత్రము - 6)

ఈ వైపున స్త్రీమూర్తి లేదు. రెండు సర్పములు పడగలు దగ్గరగా చేర్చుకొని తోకల నిరువైపు విస్తరించియున్నవి.

3. పశ్చిమ ముఖము : చిత్రము - 7

మూతపై నధిష్ఠించియున్న వెనుక భాగము మాత్రము కానవచ్చుచున్నది. దాని క్రిందుగా నున్న స్త్రీప్రతిమ ప్రలంబ పాదాసనమున యున్నది. తలపై జడను కొప్పుగా కట్టుకొని యున్నది.

4. ఉత్తరముఖము : (చిత్రము 8)

ఈ స్త్రీమూర్తి చూడ సౌమ్యముగా నున్నది. సర్పముయొక్క తోక కుడిప్రక్క తిరిగియున్నది.

**రాతిఫలకము : (చిత్రము-8)**

చతురస్రాకారమున 9 × 9 సె. మీ. కల నొక రాతిఫలకము గర్భాలయ త్రవ్వకములలో లభించెను. దీనిపైని చూపబడిన దేవతా స్వరూపములు ఆంధ్రదేశమున క్రీస్తుశకము 4-6 వ శతాబ్ది బ్రాహ్మణ మతమే రీతిగ నుండును, యెన్ని శాఖలుగా విస్తరించెనో తెలుసు కొనుటకొక నిర్దిష్టమైన యాధారశిల్పము. ఇంతటి ప్రాచీన ఫలకము అందున దైవ విగ్రహములో నిక్షిప్తమై యుండినట్టిది మరెక్కడను కాన రాలేదు. శైవ ఆగమ సాంప్రదాయ చరిత్ర, పరిణామముల నుపా సించు దేశ విదేశీయ విద్యార్థులకిది యత్యంత ప్రాముఖ్యమైనది.



(ఛాయాచిత్రము-8) కీసరగుట్ట కుంభము దక్షిణముఖము

ఈ చిన్న ఫలకమునందు శిల్పింపబడిన భగవత్ స్వరూప, ములు గూడ నట్లే విచిత్ర ప్రకృతిని కల్గియున్నవి. మధ్యగా నొక పెద్ద స్త్రీమూర్తి గలదు. అంగ సౌష్ఠవముతో వెలుగొంది ఈ మాత శిరము విశాలమైన వికసించిన పద్మము : అనగా మస్తకే పద్మం కంఠమున ముత్యాలసరము. భుజకీర్తులు, పూర్ణకుచములు, మేఖలతో బాధించినీలిగల్గి, అసామాన్యముగ కూర్చొనియున్న యీ స్త్రీమూర్తి రెండు చేతులను కల్గియున్నది. ఈ రెండు చేతుల శివ - విష్ణు సంకేత స్వరూపములనెత్తుకొని యున్నది. ఈ బృహత్ భారమునకనువుగా కాళ్ళ నొక ప్రక్కగా తిప్పుకొని పిరుదులపై భారముంచి కూర్చొని యున్నది. కుడిచేతిన లింగపీఠము నెత్తుకొని యున్నది. ఈ లింగము కొండపై కాన వచ్చిన లింగపీఠములలో పశ్చిమదభాగమున ముఖముపైపు సూత్రము కూడ చక్కగా కానవచ్చుచున్నవి. ఫలకము క్రిందుగా కుడిఅంచున నంది, దేవవీక్షణ తత్పరుడుగా చూపబడియున్నాడు. యెడమచేతిలో సింహముఖమున్నది. క్రిందభాగమున నరుడు మోకాళ్ళపై వంగి నమ స్కరించుచున్నాడు. పైని సింహము - క్రింద నరుడు, నరసింహము వ్యూహ రూపముగా నెరుగవలయును.

మధ్యనున్న ముఖ్యదేవత మహాశక్తి స్వరూపిణి- శివ-నరసింహ విష్ణురూపముల నెత్తుకొనియున్న మాతృదేవత. ఈశక్తిరూపిణి విష్ణు ధర్మోత్తరమున (3-82-8), ఈ విధముగా జపింపబడి యున్నది.

"దేవ్యాశ్చ మస్తకే పద్మం తథాకార్యం
మనోహరం, సౌభాగ్యం తత్ విజానీహి॥

ఈమెయే మహాలక్ష్మి, సర్వమంగళ, మరియు మా-దేవతలమ రుడు క్రీస్తుశకము 4 వ శతాబ్ది యిట్లుచెప్పియున్నాడు.

"ఇందిరా లోక మాతా మా
రమా మంగళదేవతా!"

పైన వివరింప బడిన ఆలయము, దేవతాస్వరూపములు, వాస్తు విన్యాసప్రక్రియల నుద్దేశింప బడిన వస్తువులు మరెక్కడను నేనెరిగి నంతలో కానరాలేదు. మరొకమారు వీటి ప్రాశస్త్యమును నెమరు తెచ్చు కొని శాస్త్రీయపరముగా వాస్తుశిల్ప కళాచరిత్రకు, కీసరిగుట్టలోని యవ శేషముల ప్రాముఖ్యతను వివరింతును.

1. ఆలయములులేక కేవలము యిటుకదిమ్మెలపై ప్రతిష్ఠింప బడిన లింగములు మధుర శిల్పములలోను త్రవ్వకములందును కాన వచ్చు శివస్థలముల బోలియున్నవి. ఇటుక పీఠములు అర్ఘ్యపీఠములే కాని అభిషేకమునకు పనికిరావు. అప్పటి పూజావిధానము కేవలము అర్చనార్ఘ్యములతో గావింపబడెను. పుట్టతేనె, వెన్నవంటి పదార్థములు యీనాటికిని లింగాగ్రముపై పూయుట నిచ్చట సుగాలీలు, రాజులు ఆచ రించుచున్నారు. ఈ లింగపీఠములు, బౌద్ధస్థలములైన, శైలవిహారములం దున్న రాతిస్తూప ప్రతీకవలె, క్షేత్రమును దర్శింపవచ్చిన భక్తులు మొక్కుబడిగా గావింపబడి యుండనగును. సర్వజనులకు పూజార్థ ములుగా, కులమత రహితమై అందరికందుబాటులో నుండెను. జైన-

బౌద్ధములందలి "దేవాయం చెయ్యం[6]"ల మాదిరివిగా గ్రహింపవలసి యున్నది.

2. త్రవ్వకముల వెలికివచ్చిన దేవాలయసముదాయము విష్ణుకుండి రాజుల కృతముగా వీరి నాణెములు, గర్భాలయములందు లభ్యమగుటను బట్టి స్పష్టమగుచున్నది. ఇదేరీతిని పెక్కు శైవాలయ ములు ఒక్కచోట కూటమిగా వుత్తర భాగమున మధురలోను, గుజరాతులోని కాయావరోహణ మందున లభ్యమ్మయినవి. ఈ కాయావ రోహణ[7] పాశుపతశివాచార్యుడైన లకులీశ పండితుని గ్రామము. ఇటీవల కర్నూలుజిల్లా వీరాపురమనుచోట త్రవ్వకములలో కూడ క్రీ.శ. 2-4వ శతాబ్ది శివాలయ కూటములు కృష్ణానది తూర్పుగట్టున బయల్పడినవి. వీరాపురములోని శివాలయముల అభిషేక-అర్చనార్ఘ్య ముల కనువుగా కట్టడముల పూర్తియేర్పాట్లుగలవు. పైనకప్పుకూడా వున్నగుడులుగా గ్రహింపవలెను.

3 పైని వివరించబడిన మృత్తికా కలశము మరెక్కడను ఇంతవరకు దొరకలేదు. ఈ పాత్రను నిధి కలశముగా లేక గర్భ పాత్రగా మాత్రమే. నెరుగరాదు.

4. దైవస్వరూపములున్న రాతిఫలకమున మహా శక్తి స్వరూపిణి, త్రిమూర్తులందు బ్రహ్మ (సృష్టి), స్థానమున తానే యుండి, శివ-విష్ణుల నెత్తుకొని యున్నది. గర్భ విన్యాస కార్య క్రమమున గుండము మధ్య హోమాగ్ని నుంచు ప్రదేశమున యీ శక్తి నాహ్వానించి పూజించి యుండిరి కాబోలు. గురువు గర్భ పాత్రను రెండుచేతులతో నెత్తుకొని తూర్పు దిక్కున తిరిగి నూరుమార్లు శక్తి మంత్రమును జపించి అర్థరాత్రిని హోమగుండమున మంత్రయుక్త ముగా గర్భన్యస్తము చేయవలెను. ఈ ప్రక్రియ ఆలయ నిర్మాణమునకు పూర్వము ఆచరించుట పాటి.

వాస్తు దేవత పాతాళ వాశి. ఈ దేవతను వాస్తునాగముగా చేసి లేక భావించి కొలచుట కద్దు. ఇచ్చట దేవాలయమున లభించిన భాండము, పైని వాస్తునాగములున్నవి. ప్రేతలు వికారమైన స్త్రీ రూపములుగా చేసిరి. ముఖములు స్పష్టముగా దిక్కుల చూచునట్లు[9] నిర్దేశింపబడినవి.

ఇచ్చట గావింప బడిన త్రవ్వకములు మరింకెన్నియో విశేషము లను తెలుపుచున్నవి.

ఆగమపండితులతో విమర్శన చేసి, అవశేషముల ప్రాముఖ్యతను తెలుసుకొని చక్కగా మరికొంత త్రవ్వకముల చేయవలసిన అవసర మున్నది. త్వరితగతిని త్రవ్వకముల సాగించి అవశేషములను స్వస



(ఛాయాచిత్రము-7) కీసరిగుట్ట కుంభము పశ్చిమముఖ మ లమునుండి తొలగించి భండాగారముల నింపిన శాస్త్రయుక్తముగాదు ప్రదేశ సంస్కృతికి, ప్రభుత్వ సొమ్ముకు తీరని అన్యాయమగును ఆంధ్ర ప్రభుత్వ పురావస్తుశాఖ, బాధ్యతతో నీ పవిత్ర స్థలమున నిశితముగా పరిశోధించ వలసియున్నది.

## ఛాయాచిత్రములు :

కేంద్రపురావస్తుశాఖ సౌజన్యంతో ప్రచురింపబడినవి.

చిత్రము - 1. కీసరిగుట్ట : శివలింగాలమాల

చిత్రము - 2. కీసరిగుట్ట : యిటుక అధిష్టానముపై లింగము.

చిత్రము - 3. మధుర : ఇటుక అధిష్టానముపై లింగము. యక్షుడు దీపముంచుట.

చిత్రము - 4. కీసరిగుట్ట: శివాలయము: విష్ణుకుండినుల కాలవ క్రీ.శ. 4-5వ శతాబ్ది.

చిత్రము - 5. కీసరిగుట్ట : కలశము, తూర్పుముఖము.

చిత్రము - 6. కీసరిగుట్ట : కలశము దక్షిణముఖము.



(ఛాయాచిత్రము-8) కీసరిగుట్ట కుంభము ఉత్తరముఖము

చిత్రము - 7. కీసరిగుట్ట : పశ్చిమ ముఖము.
చిత్రము - 8. కీసరిగుట్ట : ఉత్తర ముఖము.
చిత్రము - 9. కీసరిగుట్ట : దేవతాఫలకము.

** పెక్కు శిల్ప కళా - చరిత్ర గ్రంథముల రచయిత, కళా ప్రపూర్ణుడు, సంస్కృత పండితుడు, సదాచార సంపన్నుడు ప్రపంచ ఖ్యాతి గాంచిన పద్మభూషణ శ్రీ చిలంబూరు శివరామమూర్తిగారి దివ్య స్మృతికి భక్త్యంజలిగా సమర్పించిన ఆంగ్ల వ్యాసమున కిది తెనుగుసేత —రచయిత

## అధోజ్ఞాపికలు


1. ఇండియన్ ఆర్కియాలజి, ఏ రెవ్యూ, 1975-76 పుట-1. మొత్తము 70-లింగాలని, ఏ, పి, జర్నల్ ఆఫ్ ఆర్కియాలజి (హైదరాబాదు, 1979), I, సం. 2. పుట, 135లు పేర్కొనబడినది.చూడుడు ఇండియన్ ఆర్కియాలజి, ఏ రివ్యూ, 1975-76, పుటలు 1-2; 1976-77, పుట. 3. మరియు 1978-79. పుటలు.63-64.

2. ఇంగువ కార్తికేయశర్మ "దేవతల మధుర" ఆంధ్ర పత్రిక, కాళయుక్తి నామసంవత్సర సంచిక, ఏప్రియల్ 1978

3. స్టెల్లా క్రామ్‌రిచ్. ది హిందూ టెంపుల్ (కలకత్తా.1946). I, పుట-78, నోటు-44 మరియు పుట,.80, నోటు-52.

4. ఏ. కె. కుమారస్వామి, "ఏంజెల్ అండ్ టిటాన్, అన్ ఎస్సే ఆన్ వేదిక్ ఒంటాలజి" జర్నల్ ఆఫ్ అమెరికన్ ఓరియంటల్ స్టడీస్, సంపుటి-55. పుట. 401

5. బ్రూనో డా జిన్స్, మాయామత, (పుదుచ్చేరి, 1970) పుటలు, 99-105; ఎన్. వి మల్లయ్య, స్టడీస్; ఇన్ సాన్ స్క్రిట్ టెక్స్ట్ టెన్ టెంపుల్ ఆర్కిటెక్చరు", విత్ రెఫరెన్సు టు తంత్ర సముచ్చయ, (కాలికట్, 1949) పుట, 128. పి. కె, ఆచార్య ఆర్కిటెక్చర్ ఆఫ్ మానసార, సిరీస్, 4 (రెండవముద్రణ, 1980)పుట-61 అధ్యాయము - 8

6. ఎన్. పి.జోషి. మధురస్కల్ప్చర్సు. ఆర్కిలాజికల్ మ్యూజియం (మధుర, 1966), పుట, 80. నం. 10.

7. యు. పి. షా. "బిగినింగ్స్ ఆఫ్‌ది సూపర్ స్ట్రక్చర్ ఆఫ్ యిండియన్ టెంపుల్సు" ప్రమోదచంద్ర త్రిస్టడీస్ ఇన్ టెంపుల్ ఆర్కిటెక్చర్, (వారణాశి, 1975)పుట. 82.

8. ఇండియన్ ఆర్కియాలజీ, 1974-75. ఏ రెవ్యూ, పుటలు. 15-16; 1975-76, పుట, 15. చిత్రములు 14-18

9. ఎన్. వి. మల్లయ్య, (1949) పుటలు. 130-136. తంత్ర సముచ్చయ, పుటలు- I.96-100.

10. స్టెల్లాక్రామ్‌రిచ్, (1946), I పుట 128.




(ఛాయాచిత్రము-9) కీసరిగుట్ట దేవతాఫలకము




## 8

మా చిన్నతాతయ్య వుండేవాడే సీతయ్య-ఎంత తిండి తినేవాడో అంతపనిచేసేవాడు. మామూలుగా వాడిని భరించడం కష్టమే. కానీ మరియెలావచ్చేటో యేమిటో యింటాబయటాతిని అప్పుడప్పుడూ నానోరు తీపిచేసేవాడు. పంటకాలంలో మోపుకుప్పలు మోసేస్తే మా పెద్దతాతయ్య నరశింహులు, తమ్ముడు లక్ష్మీనారాయణ దెవిటి వెళ్ళకండా నాలుగు చివాట్లు పెట్టేవాడు. అవి యెక్కడికి వెళ్లేవో అతనికి తెలుసు. వాడ్ని సాధారణంగా యేతాం మీద చూసేవాడిని. వేకువ ఝామునించి యేతాం మీద నడుస్తున్న వాడు ఝాము పొద్దెక్కేకగానీ చద్ది అన్నం తినడానికి వచ్చేవాడుకాదు. బండెక్కితే మొఖరు మీద ముత్తో పోతులా కనిపించేవాడు. పొలంలో వీడు మనిషి రూపంలో వున్నా ట్రాక్టరుతో సమానం అనుకోండి. ఇన్ని శబ్దాలు చెయ్యించ గలిగిన వాడు సాధారణంగా మౌనంగా వుండేవాడు. అందుకే కామోసు మా అమ్మమ్మదవ్వ అలా తెగ వాగుతుండేది. వీడికి చెముడూ మూగా వుందా అంటే అదీ లేదు.

ఒకసారి నాకు యేతాం ఎక్కించి నావెంటే నడు అన్నాడు. ఆరోజు క్రింద పడిపోవలసింది. మా నాన్నకు తెలిసి సీతయ్యతాత మీద కేకలేసాడు. ఇంకోసారి పొలం దున్నుతుంటే నాగలి నాచేతికి అందిచ్చి, "తిత్తా-పప్పా" అని వాడు పశువుల్ని అదిరి అరుస్తున్నాడు. పశువులు పరుగెత్తాయి. నేను బురదలో కూరుకుపోయాను. ఇంకోసారి బండిమీద కూర్చొని తాత మెడ చుట్టూ రెండు చేతులేసి -

"నేనూ బండితోలుతాను తాతయ్యా" అంటే ఆకాశం మీద నించి పోయే విమానం చూపించి -

"నువ్వు బండి తోలవు. ఆ విమానంమీద యెగురుతావు-మన వడా! నువ్వు భూమిని యేలడానికుంటే భూమి నెందుకుదున్నుతావు", అన్నాడు.

మా నాన్న యింతమంది జ్యోతిష్యులకు నాజాతకం చూపించారు. గానీ వాళ్ళెవరూ చెప్పనిది యీ అక్షరజ్ఞానం లేని సీతయ్య తాత చెప్పింది యీనాడు నిజమైంది.

ఇక మా తాతమ్మకు చిన్నకోడలు అమ్మదుకు అప్పుడప్పుడు వాగ్యుద్ధాలు జరుగుతుండేవి. అత్తగారి హితబోధ యెలాగుండేదంటే-

"ఆడు పుట్టినప్పటి నించీ వుమ్మ హెచ్చు పూరుతునే వుండి ఆడు తెచ్చింది. యెలాగొచ్చిందని అడక్కు. తెచ్చింది వండి మూడొంతులు వాడికి పెట్టి ఒక వంతు సీతంతా తినుండి."

సీతయ్య తాతకు అమ్మదవ్వ కవిత్వం అర్థం కాలేదు. ఆమె చేష్టలూఅర్థం కాలేదు. నలుగురు పిల్లల్లో పెద్దవాడు ఆర్జించగల యీడు వచ్చేసరికి వాడిని పట్టుకుని కన్నారింటికి వెళ్ళింది. మరిరాలేదు. మిగతా ముగ్గురు పిల్లలూ ఒక్కొక్కరే తల్లిదగ్గరకు చేరిపోయారు. పిల్లల్ని వదలి వుండలేక అప్పుడప్పుడు పట్నంవెళ్ళి వస్తుండిన తాతయ్య చివరికి మకాం అక్కడే పెట్టేసాడు.

కవీశ్వరుని కూతురు యిప్పుడు సర్వస్వతంత్రురాలు కాబట్టి యీ అమాయకుని మీద యెలా విరుచుకుపడ్డా అడిగేవాళ్ళు లేరు. తిట్టుకవిత్వంతో మొగుడ్ని కించపరచడం మొదలు పెట్టింది. ఒకోసారి మావూరు నడిచి వచ్చేసేవాడు. ఒకపూటా రెండు పూటలంటే ఫరవాలేదుగానీ యెవరు రోజులతరబడి యితనిని భరించగలరు. ఎవరి బాధలు వాళ్ళకున్నాయి. తిరిగి వెళ్ళక విధిలేక పోయేది.

వర్షాకాలం మొదట్లో ఒకరోజు చీకటి పడేవేళ యింట్లో పెళ్ళాం తిట్లూ పెద్దకొడుకు పోట్లూ తిని భరించలేక పట్నంనించి బతకాలని ఆశతో మావూరు బయలుదేరిపోయాడు. ఉరుములు మెరుపులతో వర్షం. వర్షానికి ఒక పచ్చని చెట్టుక్రింద తల దాచుకుంటే యెక్కడా చోటు దొరకనట్లు ఆ పిడుగు యీ చెట్టు మీదే పడింది. మా తాతయ్య ఆత్మ జ్యోతి శాశ్వతంగా ఆరిపోయింది. దీన్నే కామోసు విధి వైపరీత్యం అంటారు.

## 9

మాఇంటి దక్షిణవాసకు వెనుకకు రెండిళ్ళుండేవి. అందులో పడమరకు యేటివేపు జాలారి వెంకన్న, తూరుపువేపు పాలకుండ యెర్రయ్య వుండేవారు. ఇద్దరికీ ఆకారాల్లోగానీ అలవాటుల్లోగానీ సామ్యం వుండేదికాదు. పాలకుండవాని యింట్లో కల్లుకుండలు కనపడేవి. ఎర్రయ్య మా లక్ష్మీనారాయణ తాతదగ్గరకు తరచు లావాదేవీల విషయంలో వచ్చేవాడు. విశేషమేమంటే చెట్లు వేలంపాడి చెట్లెక్కి కళ్ళుకుండలను దించినవాడు. తాగేవాడుకాదు. ఎవరు వండినది వాళ్ళకి రుచితెలీదట. రుచి తెలీకపోతే యెందుకు తినాల - ఆయెందుకు తాగాలనే వాడు. ఈ నియమంవల్ల నాలుగు రాళ్ళు కల్లు వ్యాపారంలో కూడబెట్టి వడ్డీలకు తిప్పేవాడు.

ఇక జాలారి వెంకన్న జాలారి వృత్తిచేసేవాడు కాదు. నల్లగా బలిష్టమైన చేతులతో ఉండేవాడు. ఊరిలో ఇప్పటికీ ఓదరేవని ఉంది. ఆ ఓదరేవుకో బల్లకట్టు వుండేది. ఆ బల్లకట్టునడిపే నావికుడు జాలారి వెంకన్న. ఎన్ని పెద్దేరులొచ్చినా యీ తిపిరీలు కొట్టిన సీమ వాడిని ముంచలేక పోయింది. సాయంత్రం అయితే తప్పతాగేసేవాడు. గవి

కొచ్చినా నాకు తాతలా అని గెంతేవాడు. వాడు మొండిమనిషని పేరు పడిపోయాడు. మూడు పూటలూ చేపలకూర లేకపోతే ముద్దదిగేదికాదు. వీళ్ళిద్దరూకలిసి ఒకసారి మాలక్ష్మీనారాయణతాతయ్య దగ్గరకు తగువు పరిష్కారానికి వచ్చారు. బల్లకట్టు వేళం పాడడానికి డబ్బుచాలకపోతే వడ్డీకి యెర్రయ్యదగ్గరనించి కొంత డబ్బు అప్పుతెచ్చాడు. అసలు వడ్డీ కలిపి యిస్తానంటే ఆసలు యిచ్చి వడ్డీ వద్దంటున్నాడు యెర్రయ్య.

"బాబూ సెప్పండి. వడ్డీకట్టకుండా ఆడికి రుణపడితే అది రుణం యెలాతీరుస్తాను?"

"ఇదేమిటి యెర్రయ్యా? వడ్డీవ్యాపారం చేసిన వాడివి. వడ్డీ పుచ్చుకోననడానికి కారణం యేమిటి? పొరుగోడైనా యిదివరకు పుచ్చుకున్నావే".



"సీకటిపడ్డేటకడే పేణాన్ని యీ ఒడ్డునుంచి ఆ ఒడ్డుకు పసే మీద అటుపక్కవూర్లో మొగుడు సావు బతుకుల మద్దిన వున్నాడని వచ్చినాది కాదా- ఆయమ్మని బల్లకట్టేసి పొంగిపోతున్న యేటిని బండితో దాటేసినాడుకదా- మరి వడ్డీయెలా పుచ్చుకోమంటావు?"

"ఏవిరా వెంకన్నా నివ్వేమంటావ్?"

"ఈడిమాటిన్నాను. నిజమే! ఆయమ్మ డబ్బులివ్వకపోతే పోనీ కదా యీ వడ్డీడబ్బు వుంచేసుకోమన్నందుకు వుంచేసుకుందును. నాకేల యీడిడబ్బు? మాటంటే మాటే...." అంటూ యిచ్చు రూపాయిలు "లెక్కేసుకోండి" అంటూ మాతాత అరుగుమీదపడేసి వెంకన్న వెళ్ళిపోయాడు.

అలాంటి జాలరి వెంకన్నను వరదనీరు యెన్నిసార్లు ముంచడానికి ప్రయత్నించినా యీదుకొచ్చేవాడు. ఈ యేటిమీద వంతెన పడ్డాక కడుపుకు జరక్క కల్లుకు దొరక్క బాధపడిపోయాడు. వంతెనచూసి భయపడ్డట్టు వర్షాలు తగ్గాయి వరదలూ తగ్గాయి. భుజంమీద వలవేసుకుని వేటకు వెళ్ళేవాడు.

వెంకన్న యీత యెరగని లోతులుండేవికావు. వీడి యీతకు లొంగని ప్రవాహం వుండేదికాదు.

ఓడరేవులో యితన్ని ముంచలేని గంగమ్మ ఓడరేవు ప్రక్కనే వున్న వల్లకాటిలో వీడి బుగ్గిని వరద వెల్లువై కలుపుకుంది.

## 10

మా వీధికి తూర్పున చివరింట్లో అప్పారావు మామ వుండేవాడు. మా లక్ష్మీనారాయణ తాత భార్య సుందరమ్మ వుందికదా. ఆవిడ అక్క ఆదెమ్మ కొడుకు. ఊర్లో వీధిలో యెందరో అప్పారావులుండటంవల్ల యితనిని ఆదెమ్మగారి అప్పారావు అనేవారు. సంగీతం మేష్టారంటే అందరికీ తెలిసేది. గిరజాలు, ఆ పొడుగూ, ముక్కూ అంతా అచ్చంగా కపిలవాయి రామనాథ శాస్త్రిలా వుండేవాడు.

వాళ్ళింటి మొదట్లో పెద్ద జామ చెట్టు వుండేది. తెగ కాయలు కాసేది. కానీ యెవర్నీ చెట్టు యెక్క నిచ్చేవాడు కాదు. పోనీ వాళ్ళు కోసి తినేవారుకాదు. పక్షులు కొరికి రాల్చిన పళ్ళను పిల్లలకిచ్చేవారు ఎందుకీ మామ యిలా చేసేవాడంటే ఆ పళ్లుండటం వలన ర్రొతుళ్ళు ఉదయం చిలకలు గుంపులు గుంపులుగా వచ్చేవి. అవి అరుస్తుంటే అతగాడు అరుగుమీద కూర్చొని హార్మనీ వాటి వేపు ధ్యాసగా చూస్తూ వాయించేవాడు.

ఇక ఆదెమ్మ అవ్వ వుండేదే! వేసవిలో పెరట కాగుచెట్టు కింద కూర్చునేది. చలికాలంలో కుంపటి యెదరగా పెట్టుకుని రాగాలు తీసేది. నేనొకసారి ఆమె కప్పుకున్న దుప్పటిలో దూరిపోయేవాడ్ని.

"కస్తూరి రంగ రంగ
మాయమ్మ కావేటి రంగ రంగ" అని పాడేది.

ఒకోసారి నా చేత ఆ పాటలుకూడ పాడించేది, అవిడ ఒడిలో వుండే "చూతము రారమ్మా-శ్రీ సీతారాముల కళ్యాణము చూతము రారమ్మా" ఆ మధురమైన గొంతుకనించే విని సీతమ్మ రాముల వారి కళ్యాణం కళ్ళయెదుట సాక్షాత్కరించినట్లే అనిపించటం వలన రామాయణం ఒక కథకాదనీ, నిజంగా జరిగిందే నన్న నమ్మకం నాలో యీనాటికీ నిల్చిపోయింది. కట్టుకథలైతే యిన్నాళ్ళు నిలిచిపోవు. నిజాలే నిల్చిపోతాయి.

ఈ ఆదెమ్మ అవ్వకి ఒక కూతురు - రంగమ్మ. ఆమెపొట్టిగా వుండేది. ఆ చేతులు కూడా పొట్టివే. ఎడమ చేతితో తినేది. ఒకరాయి విసిరితే యెడమ చేతితో విసరిన రాయే దూరంగా వెళ్ళేది. అయితే ఆ యెడమచేత్తో చేసిన వంటకాలేమో నలభీమ పాకమే నని అంటారు. ఆ వీధిలో యే శుభకార్యాలైనా వంటకాల్లో వుప్పుకారాలు వెయ్యటానికి అవిడ్నే పిల్చేవారు. ఈ రంగమ్మను పెళ్ళిచేసుకుని మొగుడు యెటో పరారయిపోయాడు. సాధువుల్లో కలిసిపోయాడంటారు. ఏ సాధు కనిపించినా తను తిండి మానేసి ఆ సాధువును పిల్చి తిండి పెట్టేది. వాళ్ళ యెదరగా కూర్చొని యేమడిగేదో యేమిటో ఆ మొగుడున్న వాని జాడ ఆవిడ గతించేకైనా తెలియలేదు.

ఈ సంగీతం మేష్టారు పెళ్ళి చేసుకోలేదు. సాధారణంగా కడుపు నొప్పి వస్తుండేది. కిరకిరలాడి పోయేవాడు. రోజుకు మూడు సార్లు 'సజ్జాకారం' వాడేవాడు. ఉపశాంతి కలిగినా రానురాను అదే పనిగా ఆ వాడుక వల్ల ప్రేగులు కోతపడ్డాయి. ఎందరికో నాటకాలు నేర్పేవాడు. గయోపాఖ్యానం, చింతామణి సత్యహరిశ్చంద్ర. ఎందరో శిష్యబృందం వుండేది. ఎవర్నీ యేదీ అడిగేవాడు కాదు. ఇస్తే పుచ్చుకునేవాడు. లేకపోతే లేదు. ఒకసారి వాడి పిన్ని సుందరమ్మ యిలాగైతే యెలా బతుకుతావంటే -

"నాకు ఒక గురువు పూరకనే యీ విద్యనిచ్చాడు. నేను ఒకరి దగ్గర కోరి పుచ్చుకుంటానా?" అన్నాడు.

ఈ పద్యాలు, కృతులూ రోజూ వినటం వలన నాకూ సంగీతం నేర్చుకోవాలని మోజు పుట్టింది. బహుశః అతని దగ్గరే.

"వరవీణా మృదుపాణీ వనరుహలోచనురాణీ
సురచిర బంభరవేణీ సురనుత కళ్యాణీ."

అని సరస్వతీదేవిని లయబద్ధంగా కొలవబట్టి, సంగీతం అబ్బక పోయినా ఆవిడ కటాక్షం యింకో విధంగా నాకు కలిగింది.

గురు కట్నంగా వన్ను పొలంనించి వరి యెన్నులు తెమ్మన్నాడు నేను ఒక మోపు మా తాతయ్యను అడిగితీసుకువచ్చాను. ఆ ధాన్య వాళ్ళు వండుకుంటే మూడు రోజులకు సరిపోతుంది. కానీ ఆ వ కంకులతో జటల్లా అల్లాడు. నాలుగు జెటలల్లి పళ్లూ కాయలూ ఆ స లేని జామిచెట్టు నాలుగు కొమ్మలకూ కట్టాడు. పిచ్చుకలు, మైనా వచ్చి తింటూ శబ్దాలు చేసేవి. తన్మయత్వం జెంది. హార్మనీ మీ అవేవో రాగాలను ఆలాపన చేసేవాడు.

నేను పట్నంలో చదువుకుంటున్నప్పుడు - ఒకసారి మావూ వెళ్లేటప్పటికి సంగీతం మాష్టారు చావుకు నిరీక్షిస్తున్నట్లు వాకిటప వున్నారు. నేను పక్కన కూర్చున్నాను. నన్ను పోల్చినట్లుంది. చిన్న నవ్వు పెదాలమీద వెలసింది. అయిపోయింది.

"నిధి సుఖమా దేవుని సన్నిధి సుఖమా" అన్న త్యాగరాజు కీర్తన పెదాలమీద ఆడిస్తూనే పోయాడు.

## 11

ఈ మనుష్యులు-యీ వాతావరణం పెంచిన బిడ్డనునేను.

ఇక్కడ కూర్చుంటేగానీ యీతలపులు ఆనాటి తలపులిచ్చే మనశ్శాంతి నివ్వవు. అందుకే మనసు చెలించినప్పుడల్లా మా గ్రామం వచ్చేసి యీ స్తంభానికి చారబడి గంటల తరబడి నా చిన్ననాటి రోజులను నెమరువేసుకుంటాను. నన్ను మనిషిగా మలచిన నా తొలి పద సంవత్సరాల జీవితంలాంటి జీవితాన్ని నాకొడుకు పట్నంలో పుట్ట అక్కడి నిత్యపోరాటం పచ్చిస్వార్థం, పీకలు కోసే పోటీలు పరి వాతావరణంలో అనుకరణ చర్వితచర్వణం. చౌకబారు అశ్లీలమైన సినిమాలు, సాహిత్యం మధ్య పెరిగి భవిష్యత్తులేక పోయాడు. భార దేశంలో వయస్సు పరిమాణం పెరిగినా రేపుమనది కానట్లు పరుగెత్తే ప్రజలమధ్య పెరుగుతూ వాళ్ళ అన్యాయ మార్గాలను ఆదర్శాలుగా తీసుకుంటున్నాడు. మన సాంప్రదాయాలూ విలువలనూ పల్లెల్లో బ్రిటిష్ పాలకులు కలుషితం చెయ్యలేదు. కాబట్టి గాంధీ మహాత్ముని వంటి నీతికీ నిజాయితీకి నిలబడ్డ నాయకులు ప్రజలను విలువలతో ప్రభావితులనుచేసి స్వాతంత్ర్య పోరాటం జరిపారు. స్వాతంత్ర్యంవచ్చేక మన యీ విలువలు పల్లెనించి పట్నానికి ప్రయాణం చేసేబదులు కలుషితమైన పట్నపు విలువలు పల్లెలకు ప్రాకిపోతున్నా యన్నందుకు నిదర్శనం అదిగో అటు తూరుపువేపు. ఇదివరకు యిక్కడ కూర్చొని చూస్తే—

మామామిడితోట పచ్చదనం కనపడేది. వర్షాకాలంలో యిలాంటి సాయంత్రపు ఎండతో ఒకోసారి ఆపచ్చదనం మీద రంగుల కిరీటంలా హరివిల్లు ప్రత్యక్షమయ్యేది. కొంగల గుంపులు పచ్చదని పొలా

మీద నించి యెగిరి చెట్లపై గుంపులుగా వ్రాలేవి పచ్చదనంలో మెరిసి పోతున్న యీ చెట్లపై పూల హారాల్లా పిట్టల గుంపులు కదిలేవి.

నాకు యీతోట మీద మమకారం పుట్టడానికి కారణంవుంది. మాతండ్రి తండ్రి రామమూర్తి. అతను అతోటలో యెవరినీ ఒకకొమ్మ కొట్టనిచ్చేవాడు కాదు. విరిగిన కొమ్మలనీ పడిపోయిన చెట్లనే వంట చెరకుగా తెచ్చేవాడు. "బ్రతికిన చెట్టుకు బ్రతికిన మనిషికీ భేదంలేదు. ఒకచెట్టు నరికితే ఒకమనిషిని ఖూనీచేసినట్లేలెఖ్ఖ" అనేవాడు.

అతని మాటలు గుర్తుండటం వలన యీ తోటను సర్కారు వారికి అప్పచెప్పడానికి నేను అనుమతించలేదు. కానీ యిది ప్రజోప యోగానికి అవసరం అన్న షరతుమీద వారంరోజుల్లో యెనభయ్యేళ్ళు పెరిగిన చెట్లన్నిటినీ ఖూనీచేసేసారు. అదిగో పొగ కనిపిస్తోందిగా! ఇది ఒక ఆర్థికంగా వెనుకబడ్డ ప్రాంతం. ఈ ప్రాంతపు రాజకీయ నాయకుని పలుకుబడి పెంచుకుని మంత్రిపదవి మరో పదికాలాలపాటు నిల్పుకోడానికి పరిశ్రమలతో తన నియోజక వర్గాన్ని పోషించికాపాడ్డానికి యిక్కడో కర్మాగారం యేర్పరచాడు.

ఈ నాయకుడు ఒకప్పుడు బస్సుక్లీనరుగా వుండేవాడట. క్లీనరునించి కండక్టరు. తరువాత బస్సులో వాటా. ఇలా పాతిక బస్సుల రాబడితో కొత్తవ్యాపారాలు చేసిపదిసంవత్సరాల్లో కోటీశ్వరుడయ్యాడు. కోటీశ్వరుడయ్యాడే గానీ వాటిని రకరకాల పన్నుల గాలులు తగిలి జబ్బు చెయ్యకుండా వుండాలని తనపరపతిని ఓట్లుగా మార్పించుకున్నాడు. తనను ప్రజలు కొలవడానికి మాటలతోపాటు పనిచేసి చూపించాలికదా. ఎన్నికల సంరంభంలో అరిచే మనుషులూ, తిరిగే జీపు, లెక్కకు దొరకని డబ్బు విరజల్లేస్తోమత వున్నవాడు కదా!

"ఇక్కడ యీ పరిశ్రమను యీ ప్రాంతంవాళ్ళ కోసం పోట్లాడి తెచ్చాననీ-దీనికి యెన్నో అవాంతరాలొచ్చి ఆలస్యమైందని-అందులో ముఖ్యంగా యీ జాగాతీసుకోడానికి యిబ్బందులు వగైరా" అంతా యేకరు పెట్టినవాడు ఆ ప్రాంతం యొక్క యెల్లలేవో చెప్పక పోవటం వలన యీ రాష్ట్రంలో యింకొక ప్రాంతంనించి వచ్చిన వాళ్ళనీ, యీ చుట్టుపట్ల వూళ్ళవాళ్ళనీ, ప్రక్కజిల్లావాళ్లనీ-యిలా మనుషులు వేరువేరుగా విడిపోయారు. మనసులూ విడిపోయాయి. వేర్వేరు సక్కచిక్కులు. ఒకయూనియన్ లీడరు ఒకటంటే యింకో వాడుదానికి వ్యతిరేకంగా అంటూ ప్రాంతాలతోపాటు జాతులుకూడా పోట్లాడుకుంటున్నాయి. ఆఖరికి నేను వెళ్లిన ఆరోజున ఆ క్రైముకి..,

అప్పుడే చీకటిపడింది. ప్రగతికి చిహ్నమైన ట్యూబ్‌లైటు మావీధిలో వెలిగింది. అలాచూస్తూండగానే ఫేక్టరీలో కోలాహలం వినిపిస్తోంది. వాళ్లోవాళ్లే కొట్టుకుంటున్నట్లు కేకలు చెప్తున్నాయి.

మావీధిలోనే అద్దెకున్ననలుగురు పరుగెత్తుకు వచ్చేశారు. వాళ్లను వెంట తరుముతూ వచ్చినవాళ్లచేతుల్లో కత్తులున్నయ్. తలుపులు వేసుకున్నా బాదేస్తున్నారు.

"బాబూవెళిపోండి" అన్నాను.

"ఎవడ్రానివ్వు" అని ఒకడు కళ్లెర్రజేసి నావేపు జూశాడు.

"ఈమట్టిలో ఒకప్పుడు సంగీతం మేష్టారు వుండేవారు. అతని శిష్యుడను. అలాంటి పవిత్రమైన జాగాలో ఖూనీలు జరపకండి బాబూ. అన్నాను.

ఇంతలో పోలీసులొస్తున్నారని కేకవినపడగానే నలుగురూ పరుగెత్తిపోయారు. తలుపుతట్టాను. "వాళ్ళువెళ్లిపోయారు. ఫరవాలేదు తియ్యండి బాబూ" అన్నాను.

మా అమ్మగొంతు విన్నాకగానీ వాళ్లు తలుపుతియ్యలేదు. ఒకడికి చెయ్యిమీద దెబ్బతగిలింది. రక్తంయింకా కారుతోంది. కట్టుకట్టా.

"ఏవూరు బాబూమీది" అన్నాను.

"విజయవాడ" అన్నాడు.

ఇంతలో పోలీసులు రావటం యీనలుగుర్నీ తీసుక వెళ్ళడం జరిగింది.

అలా చీకటిలో యెంతసేపు కూర్చున్నానో, అమ్మతినమన్నా తిండి సహించలేదు. నాచిన్న నాడుయెవరిజాగాలో వాళ్ళనిపెరగనిచ్చేవారు. ఇప్పుడో! ప్రతిపెద్దా ఒకవటవృక్షమైపోదామనే తాపత్రయం. ఆ వటవృక్షం క్రింద యింకేమీ పెరగడానికి వీల్లేదు. పెరగవు-పెరగనివ్వరుకూడాను. ఇలా పెరగటం స్వాభావికంగా జరిగినా బాగుండేది. ఈ రోజుపుట్టి రేపటికే మహావృక్షమై పోదామన్న కాంక్షలో కత్తిపట్టుకుని యెదురుపడ్డవాళ్లందరినీ జడిపించి తినేస్తున్నారు. పెద్దరాకాసికి కుంభం పొయ్యాలని చిన్నరాకాసులు ప్రజలమీద పడ్తున్నారు. ఇలారాకాసి రాజ్యం కాకుండా మనుషుల రాజ్యంగా నిలవాలంటే యేంచెయ్యాలి ?

అర్థరాత్రిదాటినా అంతాచీకటి. నాకేంతోచలేదు. ఇన్నాళ్ళూ పగిలి రెండుకాకుండా వుండాలన్న తాపత్రయంలో మనశ్శాంతి నిచ్చే ఒకజాగా యీ భూమ్మీద వుందనుకున్నానో ఆజాగాకూడా కలుషితమైపోయింది.

నాతలనించి పాదాలవరకూ పగిలి నేను రెండు చెక్కలై పోతున్నట్లు శరీరమంతా వణుకు పుట్టేసింది. వాకిట్లోకి పరుగెత్తి కాశీపతి తాతచెప్పిన ఆ సవరవాని అమాయక హృదయంతో ఆకాశం వేపు చేతులెత్తి "దేముడా ! నాదేశాన్ని రక్షించు....రక్షించు" అని గట్టిగా మొరపెట్టేశాను.

(అయిపోయింది)

# పాంచభౌతికం

## శ్రీ వఝ్ఝల కాళిదాసు

విశ్వం నిశ్వసించింది
దీర్ఘంగా_సుదీర్ఘంగా___
తాను భరిస్తున్న ప్రాణికోటి
అనశ్రవముకాలేదా ;
శాశ్వతమా తన ఉనికి ?
ప్రకృతి ప్రబంధానికి
ఆశ్వాసాంతాలా యుగాంతాలు ?
కాదా "సంపూర్ణం" ఏనాటికీ ?
ఆకాశం ఆవలించింది___
ఆవరిస్తున్న అంధకారానికి
ఆక్రమిస్తున్న ఆదిత్యకిరణాలకి
ఆద్యంతాలు లేవా ?
అవధుల్లేని
అనంత పరిభ్రమణమా యిది ?
అవనికీ ఆకాశానికీ మధ్య
అగాధమైన శూన్యం
అలముకుంటున్నదా ?
ఆడుకుంటున్నదా ?
అల్లకల్లోలంగా
ఛిన్నా భిన్నంగా
ఘూర్ణిస్తున్న
అర్ణవానికి
అవతలి ఒడ్డూ ఈవలి ఒడ్డూ
మధ్య ....మనం.... ఇదో విషవలయం ?
ఈ వలయానికి లయంలేదూ ?
అపారమైన ఆపస్సు
అంతరంగంలో బడబాగ్ని___
అలమటిస్తున్న
అనాథ మానవకోటి
అన్నకోశంలో
ఆరని జఠరాగ్ని !
స్వాహావధూ వల్లభుడు
'స్వాహా' చేస్తూ ఉంటాడు.
తన పరిధిలోకి వచ్చిన
దాన్ని దేన్నైనా సరే___
తేజస్సుకి ఆదిమూలం
ఓజస్సుకి ఆలవాలం
అనలానికి ఆజ్యం అనిలం !
అనలానిల బాంధవ్యం
అజరామరం
ఆచంద్రార్కము !
మందంగా
మలయ చందనంగా
పూరేకులు తాకినట్లు
పుప్పొడులు జల్లినట్లు
పూబోడి కౌగిలిలా
పులకలు మొలిపించే
లలిత పవన కిశోరం
వామనావతారంలా
విరాట్ స్వరూపంగా
విజృంభించి
వీర విహారం చేసి
విశ్వాన్ని
విలయం పాలు చేస్తూ ఉంది.

శ్రీ జాస్తి దుర్గాప్రసాద్

# విషమసిద్ధి పెద్దాపురప్పాడు తామ్రశాసనము-2*

మొదటి రేకు_రెండవప్రక్క

1. స్వస్తి (1) విజయవాడ స్కన్ధావారాత్ (1) శ్రీమతాం సకల జగద
2. భిష్టూయ[1] మానవ్యస గోత్రాణామ్ హారితీ పుత్రాణామ్ స్వామి
3. మహాసేన పాదానుధ్యాతానామ్ కౌశికీ వర ప్రసాదలబ్ధ రా
4. జ్యానామ్ భగవన్నారాయణ ప్రసాద సమాసాదిత వర వ
5. రాహ లాఞ్ఛనానామ్[2] అశ్వమేధావ భృథ స్నాన పవిత్రీకృత
6. వపుషామ్ చలుక్యానాం (1) కులజలధి సముదిదేన్దున్నయ వినయ
7. విక్రమాజిత[3] చారుకీర్తిః శ్రీ విష్ణు వర్ద్ధన మహారాజః (1)

రెండవరేకు_మొదటి ప్రక్క

8. తస్యాత్మజః శ్రీ జయసింహ వల్లభ మహారాజః (1) తత్ప్రి యానుజస్య
9. త్యాగోదార్య్య[4] గాంభీర్య్య కాన్త్యాది[5] గుణగణాలంకృత శరీరస్యస్వ
10. విక్రమా క్రాన్త మహీమణ్డల స్యేన్ద్ర సమాన విక్రమస్యేన్ద్రభ
11. ట్టారకస్య (1) ప్రియతనయః స్వాసిధారా నమిత రిపు నృపతి
12. మకుట తట ఘటితానేక మణికిరణ రాగ రఞ్జిత చరణ యు
13. గలః పరమబ్రహ్మణ్యో[6] మాతాపితృ పాదానుధ్యాతః కలి
14. తిమిర నిరసనోద్యోతిత[7] ప్రపయాదిత్యః[8] శ్రీ విష

రెండవ రేకు-రెండవ ప్రక్క

15. మసిద్ధి మహారాజః (1) వృక్షమూల యాపనీయ గణ తిలక
16. స్య భగవతః కనకనన్ద్యా చార్య్య స్య (1) ధర్మోపదేశనక
17. సుమిస్థితాయ జినాలయాయ (1) భగవతా మర్హతామ్(1) బ
18. లి వైశ్వదేవ నవకర్మ్మ సరణార్థమ్[9](1) స్వధర్మ్మ భివృద్ధ
19. పోతుప విషయే ఏలినద్యా ఉప్పాక్త జమన్నుతేవు గ్రామా
20. ద్దక్షిణే నడుపూరు గ్రామాత్ పశ్చిమే ఇన్దూరు గ్రామాత్
21. ఉత్తరే చపాన్[10] మధ్యే పత్తిపాక గ్రామత్" దత

మూడవ రేకు_మొదటి ప్రక్క

22. ధాకరణీయా (1) ఇతర్వర సఖ్యాత రాజ్యైః రాజభిర్పరిపా
23. లయ[13] తవ్యమ్ (1) అ త్రవ్యాస గీతాః (1) బహుభిర్వ్వ సుధాదత్తా
24. బహుభిశ్చాను పాలితా యస్యయస్యయదా భూమి(ః) తస్య
25. తస్య తదాఫలమ్ (॥) స్వపితా భర్త్త గోవిప్రబాల యే
26. షి త్రపస్వినామ్ [14] యాగతి స్వాహ్మర్మే ద్యూమిమ్ హరతశ్శా
27. సనాంకితమ్ (॥) అయం ధర్మ్మః ప్రథమ పరిపాలితః
28. ఆణతి స్వముఃఖమ్ [15] ఉభయ గణ రక్షితవ్యమ్_ౚ

**అనువాదము :**

1_7 శుభము - విజయవాడ శిబిరమునుండి - శ్రీమంతులు సకల1 జగత్తుచే పొగడబడుచున్న మానవ్యస గోత్రము కలవారు, హారతి పుత్రులు, స్వామికుమార స్వామి పాదములు ధ్యానించువారు (పాద సేవకులు), పార్వతి వరప్రసాదముచే పొందబడిన రాజ్యము కలవారు, భగవన్నారాయణుని అనుగ్రహముచే పొందబడిన ఉత్తమ వరాహ లాంఛనము కలవారు, అశ్వమేధ యాగానంతరము అవభృథ స్నానముచే పవిత్ర మొనర్పబడిన దేహము కలవారును - అయిన చాళుక్యుల యొక్క వంశమనెడి సముద్రములో పుట్టిన చంద్రునివంటి వాడు, నీతి-వినయము-విక్రమముచే (ఈగుణములచే) సంపాదింప బడిన మంచి గొప్ప కీర్తికలవాడు_శ్రీ విష్ణు వర్ధన మహారాజు.

8_15 అతని కుమారుడు శ్రీ జయసింహవల్లభ మహారాజు, అతని ప్రియ సోదరుడు, త్యాగము, ఔదార్యము, గాంభీర్యము, శాంతి

*" శ్రీ విషమసిద్ధి పెద్దాపురప్పాడు తామ్రశాసనము - 1 " - పై వ్యాసము 1983 అక్టోబరు సంచిక భారతిలో ప్రచురింపబడినది.

మున్నగు గుణముల సమూహముచే అలంకృతమైన (రాశింపజేయ బడిన) శరీరముకలవాడు, తన పరాక్రమముచే ఆక్రమింపబడిన భూమండలము కలవాడు. ఇంద్రునితో సమానమగు పరాక్రమము కల వాడు-నగు ఇంద్ర భట్టారకుని యొక్క ప్రియమైన పుత్రుడు, తన ఖడ్గధారచే వశపరచుకొన బడిన శత్రురాజుల యొక్క కిరీటములందు కూర్పబడిన పెక్కుమణుల యొక్క కిరణకాంతులచే అలంకరింప బడిన పాదద్వయము కలవాడు, పరమ బ్రాహ్మణ్యులగు తల్లి దండ్రుల పాదముల ధ్యానించువాడు, కలికాల మనెడు చీకటిని తొల గించుటకై వెలిగింపబడిన ప్రళయ కాలమందలి సూర్యుని వంటి వాడును అగు శ్రీ విషమసిద్ధి మహారాజు.

15_21 యాపదీయ గణము (జైనులలోని శ్వేతాంబర, దిగంబరులు కాక మరొక ప్రముఖశాఖ)లో శ్రేష్ఠుడు, పూజ్యుడునగు కనకనన్ది ఆచార్యుని ధర్మోపదేశమున కున్న జినాలయము కొఱకు, పూజ్యు లయిన అర్హతులయొక్క బలివైశ్వదేవ నవకర్మల రక్షణ కొఱకు, స్వధర్మాభివృద్ధికొఱకు -

పోతుప విషయములో ఏలి నదికి తూర్పున జమన్నుఱేవు గ్రామము నుండి ,దక్షిణమున నడుపూరు గ్రామమునుండి. ఉత్తర మున చపాన్, మధ్యలో పత్రిపాక గ్రామమునుండి -

22-28 ఇటుపైని సభ్యరాజ్యములు గల రాజులచే పరిపాలింప దగినది. ఈ విషయములో వ్యాసగీతములు (ప్రామాణికములు). అనేక మందిచేభూమి దానము చేయబడినది. అనేకమందిచే అనురక్షింపబడినది. ఎవరెవరికి ఎప్పుడు భూమి ఉండునో, వారివారికి అప్పుడు ఫలిత ముండును. తన తండ్రి, భర్త, గోవు, విప్రుడు, బాలుడు, స్త్రీ, తాపసి_వీరికి ధర్మముగా శాసనాంకితమైన భూమిని హరించువానికి ఏ గతి కల్గును?

ఈ ధర్మము మొదట పరిపాలింప బడినది, ఆజ్ఞాప్తమము ఉభయగణములచే రక్షింపదగినది.

శాసనస్వరూపము :

మూడు రేకులుగల యీ తామ్రశాసనము మరో రెండు శాసనములతో బాటుతూర్పు గోదావరి జిల్లా కాకినాడ - ద్రాక్షారామ మార్గములో ఆర్యవటము సరిహద్దులలో నున్న పెద్దాపురప్పాడు గ్రామ ఆది ఆంధ్రులనుండి సేకరింపబడినది.

శాసనములోని ఒక్కొక్క రేకు పొడవు 16 సెంమీ; వెడల్పు 7సెంమీ; మందము 0.2సెంమీ. అయితే రేకుల పొడవు, వెడల్పు లన్నీ ఒకే మందములో లేవు. ఒక్కొక్క రేకునకు ఎడమ్మపక్క అంచునకు 1.5 సెంమీ, దూరమున 1.2 సెంమీ. వ్యాసము గల రంధ్రము (రేకులను ఒక కడియములో దూర్చి భద్రపరచుటకు అనువుగ) గలదు.

బంగారమేమో యన్న భ్రమతో పంపకములో సమానభాగము నకై రెండవరేకు మధ్యలో తెగగొట్ట బడినది. అయితే శాసనపాఠమును చదువుటలో అంతగా యిబ్బంది చెదుర్కొన లేదు. రేకులను [illegible] రాజముద్రికలో నున్న ఒక సెంటిమీటరు మందము గల రాగి కడి యము తెగగొట్టబడి వంపులు తిరిగి యున్నది.

| | | |
|---|---|---|
| మొత్తము శాసనము తూకము | 995 | గ్రాములు |
| మొదటి రేకు తూకము | 184 | గ్రాములు |
| రెండవ రేకు తూకము | 167 | గ్రాములు |
| మూడవ రేకు తూకము | 193 | గ్రాములు |
| రాజముద్రికతో నున్న కడియము తూకము | 451 | గ్రాములు |

శాసనము మొదటి రేకు రెండవ ప్రక్క నుండి ప్రారంభింప బడినది. మూడవరేకు మొదటి ప్రక్కతో శాసనము పూర్తయినది. అనగా మొదటి రేకు మొదటి ప్రక్క, మూడవరేకు రెండవ ప్రక్కపై వ్రాతలేదు. పెద్దాపురప్పాడు తామ్రశాసనము-1 లిపి కంటే యీ శాస నపు రేకుల మీది యక్షరములను క్రమమైన వరుసలలో శిల్పి కడు జాగరూకతతో గుండ్రముగాను, అందముగాను చెక్కినాడు. అయితే శాసనపు రేకుల అంచులు తీర్చబడి యుండలేదు.

శాసనమున గల పంక్తుల మొత్తము సంఖ్య 28.

| | | |
|---|---|---|
| మొదటి రేకు రెండవ ప్రక్క | 7 | పంక్తులు |
| రెండవ రేకు మొదటి ప్రక్క | 7 | పంక్తులు |
| రెండవ రేకు రెండవ ప్రక్క | 7 | పంక్తులు |
| మూడవ రేకు మొదటి ప్రక్క | 7 | పంక్తులు |
| మొత్తము | 28 | పంక్తులు |



కడియమున గల రాజముద్రికపై తూర్పు వేంగీ చాళుక్య వంశ భూవరుల తామ్రశాసనముల రాజ ముద్రికపై సాంప్రదాయముగా కన్పించు రాజచిహ్నము వరాహ ప్రతిమ కనుపింపదు. ముద్రిక పైభాగమున చంద్రవంక. దానికి దిగువన 'శ్రీవిషమసిద్ధి'అని అక్ష రములును-వానికి దిగువన పద్మ మును ఉబ్బుగ పోతపోయబడి యున్నవి. రెండవవిజయాదిత్యుని 'వప్పొణంగు' తామ్రశాసనపు రాజముద్రికయు నింతియ.[16]

**భాష :**

ఈ శాసన భాష యంతయు సంస్కృతము వచనముతో నున్నది. శుభప్రతిపాదితమైన 'స్వస్తి' తో శాసనము ప్రారంభింప బడినది. దాన భూభాగము సరిహద్దులను దెలుపు గ్రామముల పేర్లు మాత్రము దేశభాష (తెలుగు) లో నున్నవి. భూమి దాన రక్షణ భక్షణల ఫలములు దెలుపు వ్యాస ప్రోక్త శ్లోకములు శాసనాంతమున న్నున్నవి.

**లిపి :**

క్రీ. శ. 7, 8 శతాబ్దములందు ఆంధ్ర ప్రాంతమున వాడుకలో నున్న తెలుగు – కన్నడ లిపిలోనే యీ శాసనము వ్రాయబడినది. ద్విత్వాక్షరములు, సంయుక్తాక్షరములు. వర్గానునాసికలు. పూర్ణానుస్వారములు తదితరములు సంస్కృత సాంప్రదాయాను సారముగానే వ్రాయబడినవి. రకార సంయుక్తమున 'ర' కారమునకు మారుగా కుడి వైపున 'ఱ' రకార పొల్లు నిల్పుచు ఆ వెనకటి యక్షరము ద్విత్వము గావింప బడినది. శకట రేఫము వ్రాయుటలో పెద్దాపురప్పాడు తామ్రశాసనము – 1 లిపికి, ప్రస్తుతశాసనపు లిపికి భేదము కన్పించు చున్నది. అదే విధముగా పూర్ణానుస్వారమునకు మారుగా 'మ' కారపు పొల్లు ఎక్కువ కన్పించుచున్నది. అటనట లేఖనాదోషములు ద్యోతక మగుచున్నవి.

పెద్దాపురప్పాడు తామ్రశాసనము 1 లో వలెనే ప్రస్తుత శాసనము లోను శాసన కావ్యకర్త, ఆజ్ఞప్తి, లేఖక నామధేయములు దాన కాలము లీయబడ లేదు.

**శాసన కాలము :**

శాసనము మొదటి పదునైదు పంక్తులలో నీయబడిన వంశ క్రమమును, రాజముద్రికపైనున్న 'శ్రీ విషమసిద్ధి' బిరుదమును ఆధారము చేసికొని యింక ప్రస్తుత శాసనమును కూడ పెద్దాపురప్పాడు తామ్రశాసనము – 1 ని ప్రకటించిన వేంగీచాళుక్య భూపతి రెండవ విష్ణువర్ధనుడే ప్రకటించినట్లు విదితమగుచున్నది. అనగా క్రీ.శ.673 మొదలు క్రీ. శ. 681 వరకు రాజ్యము చేసిన రెండవ విష్ణువర్ధన భూవరుడు[17] తన తొమ్మిది సంవత్సరముల పాలనా కాలములోనే ప్రస్తుత శాసనమునూ ప్రకటించి యుండునని భావింపవచ్చును.

**శాసన విషయము :**

విజయవాడ స్కంధావారము నుండి శాసనమొసంగినట్లు మొదటి పంక్తిలోనే పేర్కొనబడినది. పిదప చాళుక్యవంశ ప్రశస్తి గావింప బడినది. తదుపరి వేంగీ చాళుక్యవంశ క్రమములో శ్రీ (కుబ్జ) విష్ణువర్ధన మహారాజు, అతని కుమారుడగు జయసింహవల్లభుని తమ్ముడైన ఇంద్రభట్టారకుడు, ఇంద్రభట్టారకుని కుమారుడగు శ్రీ విషమసిద్ధి (రెండవ విష్ణువర్ధనుడు) మహారాజు వర్ణనలు గుణగణ విశేషములతో గలవు. పెద్దాపురప్పాడు తామ్రశాసనము 1 లో వంశక్రమములో కేవలము పాలకుల పేర్లు, వారి పరస్పర బాంధవ్యము మాత్రమే యుండగా యీ శాసనములో ఆ వివరములతోబాటు పాలకుల విశేష ప్రశంస యుండుట గమనార్హము.

పెద్దాపురప్పాడు తామ్రశాసనము 1 వలెనే యీ భూదాన శాసనమున్నూ జైన యాపనీయ గణశ్రేష్ఠుడు, పూజ్యుడునగు కనక నన్ది ఆచార్యుడు అధిష్ఠాతగా అతని ధర్మోపదేశమునకై యేర్పరచిన జినాలయము కొరకు, పూజ్యులగు అర్హతుల బలిచైత్యదేవ నవకర్మల రక్షణ కొరకు, స్వధర్మాభివృద్ధికి 'విషమసిద్ధి' బిరుదాంకితుడైన రెండవ విష్ణువర్ధన మహారాజు యిచ్చినట్లు విదితమగుచున్నది.

కనకనన్ది ఆచార్యుడు అధిష్ఠాతగా గల జినాలయ మెక్కడిదో తెలియుట లేదు. ఏవి నదికి నలువైపుల – తూర్పున జమున్నిజేవు, దక్షిణమున నడుపూరు, పడమర ఇన్దూరు, ఉత్తరమున చవాన్(?) మధ్యలో వర్తిపాక – గ్రామములు హద్దులుగా పేర్కొన బడినవి. అయితే దానమిచ్చిన దేమిటో స్పష్టమగుట లేదు. ఇటుపైని యీ శాసనమును రాజులు పాలించవలెనని మాత్రము కలదు.

శాసనాంతమున వ్యాసప్రోక్త శ్లోకములు పేర్కొనబడినవి.

**చారిత్రక విశేషములు :**

వేంగీ చాళుక్య భూవరుడు రెండవ విష్ణువర్ధనుడు వెలువరించిన యిప్పటివరకు వెలుగులోనికి వచ్చిన తామ్ర, శిలాశాసనములలో ప్రస్తుత యీ పెద్దాపురప్పాడు తామ్రశాసనము[13] ఎనిమిదవది, మరియు సరిక్రొత్తది[18]

"స్వాసిధారా నమిత రిపునృపతి మకుటతట ఘటితానేక మణి కిరణ రాగ రఞ్జిత చరణ యుగళః" నిగా. 'కవితిమిర నిరసనోద్యోతిత ప్రశయాదిత్య'నిగా ప్రస్తుత శాసనములోను, 'అనేక సమర సంఘట్ట ఫలబ్ధ యుద్ధ విజయ యశస్కు'నిగా కుమారుడు మంగి యువరాజు శాసనమొక దానిలోను[19] పేర్కొనబడిన రెండవ విష్ణు వర్ధన మహా రాజు యిప్పటి యీ 'పెద్దాపురప్పాడు తామ్రశాసనము – 2'ని విజయవాడ స్కంధావారము నుండి యిచ్చుటలో నాశ్చర్యము లేదు. అయితే ఎవరిపైన, ఎప్పుడు యీ సమర యాత్రయో ?

రెండవవిష్ణువర్ధనునిదే అయిన పెదచెఱుకూరు శిలా శాసనము 'విజయయాత్ర' నుండి ప్రత్యాగతుడగుచు, అతడు సామంత పరివే

ష్ఠితుడై చెఱుటూరు గ్రామమునకు విచ్చేసి త్రిషష్ఠికమస్వామిని సేవించి నసందర్భమున వేయబడినది.[20] అయితేయిది పెదతండ్రి జయసింహవల్లభునిపాలనా కాలము నాటిది. ఇంక కొణెకి తామ్ర శాసనము విష్ణువర్ధనుని 'స్వీయ ఆయుర్బల విజయ భోగైశ్వర్య వృద్ధ్యర్థ'కై నొసంగబడినది. ఇదియును పెద తండ్రి పాలనా కాలము నాటిదే. విష్ణువర్ధనుడే వెలుపరిచిన రేయూరు దాన శాసనము 'బల విజయ ఆరోగ్య నిమిత్తము' కర్మరాష్ట్రమందలి రేయూరు గ్రామమును బ్రాహ్మణ కుమార శర్మకు దానమిచ్చినట్లు దెలియజేయుచున్నది[22] ఇవి అన్నియును విష్ణువర్ధనుని సమరోత్సాహమును, విజయకాంక్షను పరోక్షముగా వ్యక్తపరచుచున్నది.

విజయవాడలో దండువిడియుట, ఆ స్కంధావారమునుండి రెండవ విష్ణువర్ధనుడు ప్రస్తుత యీ శాసనమును వెలువరించుట నిశితముగా పరికించిన శాసనము వెలువడిన సమయ, సందర్భములు కొంత గ్రహింపవీలగును. దక్షిణపల్లవులతో తలపడవలసి వచ్చిన సందర్భములు యుండవచ్చును. వాతాపి రెండవ పులకేశి పరిపాలనాకాలము నుండి చాళుక్యులకు పల్లవులతో నెడతెగని వైరము కల్గుట తెలిసిన విషయమే. పులకేసి మరణానంతరము చాళుక్య రాజ్యము అనాయకమై పదమూడేండ్ల కాలము అరాజకమునకు తావలమై యున్నది, గదా! పితృ పైతామహరాజ్యపునః ప్రతిష్ఠాపన బాధ్యతను స్వీకరించిన, రెండవ పులకేశివల్లభుని పుత్రులలో నొకడైన మొదటి విక్రమాదిత్యుడు తన యిరువది యారేండ్ల ప్రభాపరిపాలనా కాలములో (క్రీ.శ. 655 – క్రీ.శ. 681) పల్లవ రాజులతో అనేక మారులు తలపడవలసి వచ్చినది.[23] ఈతని కత్యంత సమీప బంధువులైన వేంగీ చాళుక్యులును ఆయా సందర్భములలో పల్లవులతో జరిగిన యుద్ధములలో పాల్గొని యుందురనునది నిర్వివాదాంశము. పులకేశి వల్లభుని కుమారుడు మొదటి విక్రమాదిత్యునికి, పులకేశి తమ్ముడు కుబ్జ విష్ణువర్ధనుని మనుమడయిన రెండవ విష్ణువర్ధనుడు సహకారిగా నుండుటలో నాశ్చర్యము లేదు గదా! వాతాపి చాళుక్యులతో నున్న బాంధవ్యము, పల్లవులతో వంశానుగతముగా నున్న వైరము, దక్షిణముగా వేంగీ రాజ్యములు విస్తరింపజేయవలెనను ఆకాంక్ష రెండవ విష్ణువర్ధనుని యుద్ధ రంగమునకు పురికొల్పినవి.[24]

అయితే యీ సమర కోలాహలము ఏ సంవత్సరములో నున్నది. కూడ కొంత యూహింపవచ్చునేమో ! అది యెట్లన రెండవ విష్ణువర్ధనుని రేయూరు తామ్రశాసనము తన ద్వితీయ ప్రవర్ధమాన విజయ రాజ్యసంవత్సరమున (క్రీ. శ. 674) '....విజయ....' నిమిత్తము రేయూరు గ్రామమును బ్రాహ్మణ కుమారశర్మకు దానమిచ్చినట్లు దెలియుచున్నది గదా![25] అదే సంవత్సరములో వాతాపి చాళుక్య పాలకుడు మొదటి విక్రమాదిత్యుడు పల్లవ రాజ్యముపై దండయాత్రలో



1. మొదటిరేకు రెండవప్రక్క, 3. రెండవరేకు రెండవప్రక్క
2 రెండవరేకు మొదటిప్రక్క, 4. మూడవరేకుమొదటిప్రక్క

నున్నట్లు చోళిక విషయమందలి ఉరగపురము (కావేరి దక్షిణ తీరమున నున్న ఉఱైయూర్)న విజయస్కంధావారమునుండి వెలువడిన ఆతని గద్వాల్ తామ్రశాసనము సూచించుచున్నది.[26] అన్నగా రెండవ విష్ణువర్ధనుడుయీ చాళుక్య-పల్లవసమర కోలాహలములో భాగముగానే తన ద్వితీయ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములో విజయవాడ స్కంధావారములో నున్నట్లు,ఆ క్రీ.శ. 674 లోనే అటనుండి ప్రస్తుత శాసనమును వెలువరించినట్లు గ్రహింప అవకాశ మేర్పడుచున్నది.

వేంగి చాళుక్య ప్రభువు రెండవ విష్ణువర్ధనుని రాజ్యాధికారము ఉత్తరముగా తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురము తాలూకా వరకు విస్తరించి నట్లు అతని పల్లివాడ దాన శాసనము[27] తెలియ జేయుచుండ, కాకినాడ తాలూ కావరకు నెలకొని యున్నదని అతని పెద్దాపురప్పాడు తామ్ర శాసనము-1 సూచించు చున్నది. [28] ఇప్పటి 'పెద్దాపురప్పాడు తామ్రశాసనము-2' విష్ణువర్ధనుని అధికార పరిధిని ఉత్తరముగా మరింత విస్తరింప జేయుచున్నది. ఇందు పేర్కొనబడిన పోతుప విషయము పొత్తపివాడుగా తోచుచున్నది. కారణము తద్విషయమున ఏలి నది, దానికి నలువైపుల సరిహద్దు గ్రామములు ఆ సందర్భమున నుటంకింపబడినవి ఏలి నదినే ఏలేఱుగా గ్రహింప వచ్చును. అయిన యా పొత్తపివాడు వీరచోడుని పిఠాపుర శాసనములో, చెప్పబడిన పొత్తపినాడుయే. [29] అనగా తూర్పుగోదావరి జిల్లా పిఠాపురము తాలుకా ప్రాంతము.[30]

సామర్లకోట శాసనములలోని శక సంవత్సరము 1129లో ప్రకటింపబడిన ఒక శాసనములో సంకరాజనునతడు పొత్తపినాటి నడుపూరు గ్రామమును కుమారారామ మండలి చాళుక్య భీమేశ్వరునికి యొసంగినట్లున్నది. [31] ఈ నడుపూరును, ప్రస్తుత శాసనములో ఏలి నదికి దక్షిణముగా నున్నట్లు పేర్కొనబడిన నడుపూరును ఒక్కటిగా భావింప వచ్చును అయితే ఏలి నదికి తూర్పున జమన్నుతేవు, దక్షిణమున నడుపూరు, పడమర ఇన్నూరు, ఉత్తరమున చపాన్ (?), మధ్యలో పత్రిపాక గ్రామములో శాసనమున పేర్కొనబడినది. నాటి యా గ్రామములు నేటి ఏలేఱు సమీప గ్రామముల పేర్లు వేటితోను గుర్తింప ననువుగాకున్నది. [32] పైగా శాసనమున యా గ్రామములు హద్దులుగా కన్పట్టుచున్నవి. విష్ణువర్ధనుడు వీటిని దానమిచ్చినాడో, లేక యా గ్రామ ప్రాంతముల భూములను దానమిచ్చెనో, లేక శిస్తులను రద్దుచేసినాడో - ఏమి చేసినాడో స్పష్టపడుటలేదు. క్రియాపద స్థానములో నున్న 'ద త ధాకరణియా'కు అర్థము, సమన్వయము కుదురుట లేదు.

పెద్దాపురప్పాడు తామ్రశాసనము-1 వలెనే యిప్పటి యీ శాసనమును వేంగి చాళుక్య వంశములో "పరమ మాహేశ్వరు"నిగా బిరుదమును వహించిన మొదటి మహారాజు అయిన రెండవ విష్ణువర్ధనుడు జైనము నాదరించి నట్లు స్పష్టము జేయుచున్నది. [33] అందులోను తమ ఉదార దృక్పథముతో దక్షిణ భారతదేశములో మిక్కిలి ప్రజాదరణ చూరగొనిశాఖోపశాఖలుగా విస్తరించిన జైన యాపనీయ గణము [34] క్రీ. శ. 7వ శతాబ్ది ద్వితీయార్ధములోనే ఉత్తరాంధ్రమున ప్రాచుర్యములో నున్నట్లు తెలియ జేయుచున్నది. విష్ణువర్ధనుడు యీ భూదాన మొసంగిన కారణములలో నొకటి యాపనీయ గణశ్రేష్ఠుడు కనకనద్ది ఆచార్యుడు అధిష్ఠాతగాగల జినాలయము కొఱకని పేర్కొనబడినది గదా ! ఈ కనకనద్ది ఆచార్యుడు యాపనీయ సంఘమునకు చెందిన కోటిమడువ గణములోని నంది గచ్ఛమను సాంప్రదాయమునకు సంబంధించిన వాడేనేమో ! [35] ఏది యేమైనను తాను 'పరమ మాహేశ్వరుడ' యినప్పటికిని విష్ణువర్ధనుడు యితర మతములను కూడ తనమతమును వలెనే సహనబుద్ధి కలిగి ఆదరించినాడనుట కీ శాసనము ప్రబల సాక్ష్యము. [36]

## సంకేత వివరణ పట్టిక :

1. అభిష్టాయ = అభిష్టూయమాన
2. లాఞ్ఛనానామ్ = లాఞ్ఛనానామ్
3. విక్రమాజిత = విక్రమార్జిత
4. త్యాగోదాయ్యా = త్యాగౌదార్యా
5. కాన్త్యాది = శాన్త్యాది
6. పరమ బ్రాహ్మణ్యై = పరమ బ్రాహ్మణ్యా
7. నిరసనొద్యోతిత = నిరసనోద్యోతిత
8. ప్రపయాదిత్యః = ప్రళయాదిత్యః
9. సరణాత్థమ్ = శరణాత్థమ్ = శరణార్థమ్
10. చపాన్ = ఏపాన్ (?)
11. గ్రామత్ = గ్రామాత్
12. రాజ్యే = రాజ్యై
13. పరిపాలయ = పరిపాలయి
14. యేషితపస్వినామ్ = యోషితపస్వినామ్
15. స్వముఖమ్ = శ్రీముఖమ్ (?)
16. ఎపిగ్రాఫియా ఆన్ధ్రికా, సంపుటి 3, పుటలు 5-7
17. ఎన్. వేంకట రమణయ్య, ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి. 1950, పుట 68; బి.వి. కృష్ణారావు, హిస్టరీ ఆఫ్‌ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి, పుట 108.
18. తక్కిన ఏడు శాసనముల వివరములకు చూడుడు, భారతి అక్టోబరు, 1983, పుటలు 53-54
19. ఇండియన్ యాంటిక్వెరి, సంపుటము 20, పుట 104.

20. భారతి, సెప్టెంబరు 1972, పుటలు 12-30
21. ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 31 భాగము పుటలు 74-80
22. ఇండియన్ యాంటిక్వెరి, సంపుటము 7, పుట 185.
23. జి. యాజ్దాని (ఎడి.) ది ఎర్లీ హిస్టరీ ఆఫ్ ది డెక్కన్, భాగములు 1-6, పుటలు 221-224.
24. బి. వి. కృష్ణారావు, హిస్టరీ ఆఫ్ ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి పుటలు 108-112
25. ఇండయన్ యాంటిక్వెరి, సంపుటము 7, పుట 185.
26. ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 10, పుట 100.
27. ఇండియన్ యాంటిక్వెరి, సంపుటము 7, పుట 185.
28. భారతి, అక్టోబరు, 1983, పుట 54.
29. ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము5, నెం-10,పుటలు70-100
30. కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము1 1963, పుట 231,
31. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, సంపుటము5, నెం. 55.
32. అయితే యిట మరొక యూహకు నాస్కారము లేకపోలేదు. అదేమన శాసనములో పేర్కొన బడిన ఏలినది అనగా కృత మైన ఏఱు అనునర్థము తీసిన తూర్పుగోదావరి జిల్లా అమలాపురము తాలుకాలో ప్రసిద్ధ జైన క్షేత్రము నేదునూరుకు సమీపమున కుమారనది యను పేరబరగు పంటకాల్వతో గుర్తించిన తద్దక్షిణమున నడిపూడి యను గ్రామమున్నది. ఈ నడిపూడి యే వసంతరాయుడు, 'పల్లవ త్రినేత్రుడు' కొండవీటి రెడ్డి భూపతి అనువేముడు శక సం. 1296లో దన సోదరి వేమసాని పేరుమీదుగా వేమాపురమని ఇరువది బ్రాహ్మణులకు దానమిచ్చిన నడుపూరు - ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటము 3,పుటలు 286-292 ఆ కుమారనదియే పెద్దాపురప్పాడు తామ్రశాసనములోని ఏలినదిగా, ఆ నడుపూరు యే యిప్పటి నడిపూడిగా గుర్తించిన నాటి జానుపల్లె యిప్పాటి జమన్నతే వని, ఇందూరు - ఇందుపల్లియని, పత్తిపాక-పాలగుమ్మియని ఊహసేయ వచ్చునా?
33. బి.వి. కృష్ణారావు, హిస్టరీఆఫ్ ది ఈస్టరన్ చాలుక్యాన్ ఆఫ్వేంగి పుట 109.
34. సి. జె. షా, జైనిజమ్ యిన్ నార్త్ ఇండియా, పుటలు 181-182; పి. బి. దేశాయ్, జైనిజమ్ యిన్ సౌత్ ఇండియా పుట 163; ఎం. రాజగోపాలరావు, జైనధర్మము, పుటలు 27-28; ఎస్. గోపాలకృష్ణమూర్తి, జైనవెస్టిజెస్ యిన్ ఆంధ్ర పుట 37.
35. విజ్ఞాన సర్వస్వము, సంపుటము 3, పుట 549.
36. ఈ వ్యాసరచనలో నాకు తోడ్పడిన నాజనకులు స్వామి శాంతానంద సరస్వతికి, గురుతుల్యులు శ్రీ ముసునూరి సాంబ శివరామమూర్తికి నా కృతజ్ఞతలు.

# రచయిత(త్రు)లకి మనవి

భారతిలో ప్రచురణకి స్వీకరించని కవిత్వం - రచనలని అన్నిటినీ ఇంతకాలం స్వంత ఖర్చు మీద తిప్పి పంపుతూ వచ్చాము !

రచనల సంఖ్య మరీ ఎక్కువగా ఉండటంచేత ఈ పద్ధతిని మార్చవలసివస్తోంది.

7-1-1985 తరువాత అందిన రచనలతో తగినన్ని తపాలా బిళ్లలు అతికించి స్వంత చిరునామా గల కవరులు జతపరచి ఉన్న, కవిత్వం - రచనలని మాత్రమే, వాటిని ప్రచురణకి స్వీకరించని పక్షంలో, తిప్పి పంపగలము ;

రచయిత(త్రు)లు సహృదయంతో మా ఇబ్బందులని గుర్తించి మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము!

తమ రచనలతో పోస్టు కార్డులని జతరిపచి పంపవద్దని రచయిత(త్రు)లకి మనవి!

తగినన్ని తపాలా బిళ్ళలు అతికించి, స్వంత చిరునామా గల కవరులు జతపరచబడని రచనలు, ప్రచురణకి స్వీకరించబడక పోయినట్లయితే, ఆ విషయం వాటిని రాసినవారికి తెలుపటానికి వీలుకాదు. అంటే, వారికి తమ రచనలు ప్రచురించటానికి వీలుకాదని తెలుపుతూ వేరే రాయటానికి వీలుకాదన్నమాట !

ఈ విషయములో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవని గమనించ గోరుతాము !

ప్రచురణకి స్వీకరించిన రచనలని పంపినవారికి మాత్రం ఆ విషయం తెలియజేస్తాము !

భారతి
సంపాదకుడు




వంసలితనంలో ఈకోరిక ఎందుకు పుట్టిందో తెలియదు. కోరికఏనాటికీ తీరేదికాదు. అయినా ఆకోరికను చంపు కోలేక పోతున్నాను.నామాటలు విని కొందరు నన్ను పిచ్చాడని కూడ అనుకొన్నారు. ఎవరూ బయటపడరు కాని అందరూ లోపల లోపల అలాగే అనుకొని ఉంటారు.

కాని కొందరికి మాత్రం ముఖ్యంగా సహృదయులకి నన్ను సిజాలివేసి ఉండవచ్చు.

ఇంతకీ నా కోరిక ....
తెరిపి వెన్నెల తాగాలని కాదు.
మృతపు కూడు తినాలనీ కాదు.
వరూధిని ఒడిలో పవళించాలని కాదు.
విశ్వాధినేత నై వినువీధి కెక్కాలనీ కాదు.

అసలు నాకేం తక్కువయిందని ....

పెద్ద డిగ్రీ ఉంది. కాని దాని మీద ఏమాత్రము అపేక్షలేదు. నిజానికి డిగ్రీ తరువాతే నేను బాగా చదివింది. అసలు విజ్ఞానానికి గిరి ఎక్కడ ఉంది?
పిచ్చివాదులకి తప్ప.

ఏది చదివినా ఎంత చదివినా మనసుపెట్టి చదివితే అంతి ఆస తీగానేఉంటుంది. చదువుతూ పోయేకొద్దీ తెలుస్తుంది.... మన మెంత అల్పుల మో!.

ఒకచోట ఏదో శిలావిగ్రహం దొరికితే దాన్ని గురించి పలువురు పలువిధాలుగా రాస్తారు. కొందరైతే శిలావిగ్రహం దొరికినమాట నిజమేనా? అన్నప్రశ్నతో మొదలు పెడతారు. మానవస్వభావం అంత వైవిధ్యంతో కూడి ఉంటుంది.

ఇంత చిన్నవిషయానికే తలలు కొట్టుకొనేవాళ్ళు దేవునిఉనికి, జన్మ,మరణం, తరువాత గమనం గురించి ఇక సిగపట్లు పట్టుకోకుండా ఉంటారా?

ఇదంతా తమాషాగాచూసేవాళ్ళుంటారు. మనకుమల్లే మనలో కలిసిపోయి ఏదో ఒకపని చేసుకుంటూనే ఉంటారు. అన్నీవింటారు, చర్చిస్తారు. కాని దేన్నీ నమ్మరు. ఇలాంటి వాళ్లని ఏమనాలో;

కొందరైతే మరీ విచిత్రం ఇలాంటివారినే అవధూతలని అంటారు కాబోలు!

అమీబా మానసిక ప్రవర్తనకు ఆదమ్ మానసిక ప్రవర్తనకు వీరిదృష్టిలో తేడా ఉండదు. అందమైన అమ్మాయిని ఎలా అయితే చూస్తారో వీరు కోతిపిల్లను కూడా అలాగే చూస్తారు. అయిదు చుక్కల పరువుల సుఖం పెంటకుప్పల ప్రక్కన వీరు అనుభవిస్తారు. అన్నింటికీ అతీతంగా ఉంటారు. అసలు లేశమాత్రమైనా అర్థం కారు!

చాలమంది ఏదో ఒక మార్గాన్ని ఎన్నుకొంటారు. లేదా నమ్ముకొంటారు. సంప్రదాయమనండి, ఇంకేమైనా అనండి దానికే అతుక్కుపోతారు. ఇలాంటివారే చాల ఎక్కువగా ఉంటారు.

ఇదంతా అనుకొంటూ ఉంటే అందరూ నటులేనన్న విషయం స్పష్టమవుతుంది, ఇతరులకు హానిచేయకుండా ఎంతనటిస్తే ఏం నష్టంలేదు. కాని కొందరు దొంగవెధవలు ఉంటారు. చెప్పేదొకటి... చేసేదొకటి! దీన్నే హిపోక్రసీ అనవచ్చు. నేడు చాలమంది ఇలాంటివారే!

కొందరెందుకిలా తయారవుతారు, కొందరెందుకు ఉత్తములై హారతులందుకొంటారని అనుకొంటే....

సంస్కారం గుర్తుకువస్తుంది. దానికికారణం జన్మాంతర పుణ్యఫలం !?

జన్మ.... అసలు ఉందా? లేకపోతే నేనెలావచ్చాను? మానాన్న గారు ఎక్కడికెళ్ళారు? ....

నాన్నగారిని తలుచుకొంటేనే పిచ్చఏడుపొస్తుంది. చనిపోయి పన్నెండుసంవత్సరాలు పైబడినా ఇంకా మరపురాని నాన్నరూపం!

అంతా అబద్ధం! కాలం గాయాన్ని మాన్పుతుందని చెప్పేదంతా అబద్ధం!

నాదుఃఖం పెరుగుతోందే కాని తగ్గించడం లేదే ?

చిన్నతనంలో నాకు నాన్నగారు రోజూ ముద్దిచ్చి చాకొలెట్ ఇచ్చేవారు. దానితీపి తలుచుకొంటే ఇప్పటికి నోరూరుతుంది !

గుర్రం తీసుకురాలేదని కోప్పడితే "నేనే నీగుర్రం కన్నా!" అంటూనాన్న నాగుర్రమైనప్పుడు.... ఆస్వారీ.... ఇంకా నాన్న మెడ పట్టుకొన్నట్లే ఉంది.

బాబూ! నేవెళ్లిపోతున్నానురా! బాధపడకు. ఇలాపోవడం,రావడం అంతా మామూలే: కాని చాల చిత్రమనిపిస్తుంది. అంతే! నేను ఎక్కడో ఒకచోట ఏదోఒక విధంగా నీకు కనిపిస్తాను. ప్రతిమనిషిలో నన్ను చూడటానికి నేర్చుకోనాన్నా!...."

నాన్నమాటలు వినలేకపోయాను. నేనేం అప్పుడు చంటిపిల్లవాణ్ణి కాను.మూడుపదులు నిండిన వాణ్ణి!

అయినా ఏడుపు ఆగలేదు.

పెద్దా చిన్నా ఏమిటి అనుబంధానికి?

"ఒంటరిగానే పోరాడాలి బాబూ! నేను ఒంటరిగానే వచ్చాను ఒంటరిగానే పోతున్నాను! ఒంటరితనం ఎన్నో విషయాలని నేర్పుతుంది. ఏకాంతంలో ఆసాంతం మునగ గలిగితే నీవెన్నో గ్రహించగలుగు తావు. ..."

నాన్న ఆయాసంగా అంటున్నారు.

కళ్లనిండా నీళ్లు నిండాయి నాకు!

గుండెను ఎవరో పట్టి నట్లుంది!

నాన్న నవ్వారు. నవ్వుతూనే

"కిషన్!అకేలాచలో ఛఛ।నాకోసంఏడవకునాన్నా! నేనెక్కడికి పోతాను. మళ్లీ నీ కడుపులోనే పుడతాను తండ్రీ! ..."

నాన్నేనా ఇలా మాట్లాడుతున్నది. ఆశ్చర్యం వేసింది. నాకు కర్మకాండలు చేయించవద్దని వీలులో కూడా రాసి పెట్టిన నాన్న - ఇలా మాట్లాడడం....

దేనిమీద నమ్మకం లేని నాన్నకు మళ్లీపుట్టడం మీద, అదీ నా కడుపులో...

తడి! ఆర్ద్రత: అర్థంకాని ఆరాటం! ఊహకందని ఉద్వేగం! నాన్న క్షణాలలోనే ప్రాణాలు విడిచిపెట్టారు.

ఆ ప్రాణాలే నా పంచ ప్రాణాలు! ఏవీ ?

ఇంకెక్కడ?

నాన్న! నాన్న! నాన్న! నాన్న!

అర్ధరాత్రి దాటినా నిద్రరాదు. ఆలోచనలు ఆయాసం తెస్తున్నాయి. ఎంతవయస్సొచ్చినా అణగారిపోని ఈ అనుభవం రాచ పుండులా ఒకవైపు బాధపెడుతూనే మరోవైపు అమ్మఒడిలో గుండెను ఓలలాడ్చినట్లు ఊచేది. అంతా అర్థంకాని విచిత్రధృతి !

అంతుబట్టని, భావ, ప్రకృతి!

సైకోకైనెటిక్స్ అని, సైకోట్రానిక్స్ అని ఏవేవో మాట్లాడు తారు. నాకు తెలిసీ అవంతా ఊరికే చర్చలకోసమే ! సైకాలజీలో మనస్సును పడతారా ? సైకోట్రానిక్స్‌లో ఆత్మను నిలుపుతారా ?

ఒక్కమాటలో నామటుకు అంతా ట్రాష్ !

లేకపోతే ఏమిటి....

ఈ యాభై ఏళ్ల వయస్సులో చనిపోయిన మా నాన్నగారిని చూడాలని ఉంది—అంటే—ఏవేవో మాట్లాడుతారు వీళ్లు.

ఏమీ తెలియకుండా ఏదో ఉన్నట్లు భావించి ఏవేవో పరిష్కా రాలు చూపిస్తారు.

నా డబ్బుకోసం వైద్యం చేసే వాళ్లు కొందరు.........నానుంచి ఏదో ఆశించి నేచెప్పేదానికంతా తలఊపే గంగిరెద్దులు కొందరు.

మనసులో ఏదో పెట్టుకొని ఎప్పుడు దెబ్బకొడతామా అని చిరునవ్వులు నవ్వేవాళ్లు కొందరు....

నా ఎదుటైనా పడకుండా నాకు మేలు కలగాలని కోరుకునే మంచివాళ్లు కొందరు.

ఇలా రకరకాల మనుష్యుల మధ్య బ్రతకడమే గొప్పవిషయం అంత గొప్పవాళ్లమని భావించుకొని ఒక చిన్న సెంటిమెంటుకు లోబడిపోవడం మరీ విచిత్రం !

నా బాబు నా భుజాలమీద ఎక్కినప్పుడు నాకు నాన్న గుర్తొ చ్చాడు. నేను బాబుకి చాకొలెట్ తినిపిస్తూ కథ చెబుతుంటే నాన్న నవ్వినట్లు అన్పించింది. బాబును చూసినప్పుడెల్లా నాన్నను చూడాలని పించేది. నాన్నను తలచుకొన్నప్పుడెల్లా బాబును చూడాలనిపించేది.

ఈవ్యవహారం నాపై బాగా ప్రభావాన్ని చూపింది. బాబు.... నాన్న. నాన్న....బాబు నాన్న....నాన్న నాన్న...నాన్న....

నాన్నను వెంటనే చూడాలని...మాట్లాడాలని... ఇంకా....! కాని ఎలా చూడడం ?

ఏమి కోరిక ? పిచ్చికాని పట్టలేదుకదా ?

చనిపోతే...నాన్నను చూడవచ్చేమో ! నిజమా ?

ఆత్మహత్యే ఈ సమస్యకు పరిష్కారమా ? అవునా ! అవును. ఆత్మహత్యే చేసుకోవాలి.

ఇంత చదువు, ఆస్తి, అందం, అధికారం, కీర్తి ప్రతిష్ఠ అంతా వదలిపెట్టి ఆత్మహత్య చేసుకోవడమా ?

అవును. నాన్నను చూచినప్పుడు కలిగే అరక్షణం పాటి ఆనందం ముందు ఇవంతా ఏపాటి ?

ఆక్షణం ...తరువాత క్షణం...ఆపై క్షణం నాన్నే ! నాన్న రూపమే ! అంతా నాన్న మయం ! బాబు గుర్తుకురాలేదు. అమ్మ గుర్తుకు రాలేదు. భార్య గుర్తుకు రాలేదు. కంపెనీ వర్కర్లు ఎవరూ అక్కర్లేదు. గుప్పెడు నిద్ర మాత్రలు...

గ్లాసెడు నీళ్లు !
గుటగుటమని శబ్దం...
గొంతులో బాధబిగిన అనుభూతి !
గుండెలపైన బెయ్యి.
కడుపులో హాలాహలం.
ఒళ్లంతా చెమటలు.
ఛాతీలో విపరీతమైన నెప్పి.
ఆయాసం ! దగ్గుకూడా రావడంలేదు.
నీరసం ! రగ్గుకూడా కప్పుకోవడానికి చేతకావడంలేదు.
నాన్నరూపం లీలగా ! దగ్గరగా వచ్చింది,
నన్ను తట్టి లేపింది. కళ్లనలుపు కొన్నాను.
బాబు ! నా బాబు !
"నాన్న' భయం వేస్తోంది. పాస్ కెళ్లాలి తోడురావా ?
ఆ ప్రశ్నతో కాని నాకు తెలివిరాలేదు !
ఇదంతా....ఆపైన ఆలోచించలేదు.
వెంటనే బాబును చూచి అచ్చు నాన్నగారిలా అన్నాను.
"నో ! ఐ డోన్టకమ్. యూగో అలోన్ !...........".

# కైత కన్నె

## శ్రీ చిలుకూరి మధుసూదన రావు

కైత కన్నెకేం తెలుసు
కొత్త పొత్తాల చిత్తాలు ?
అక్కరాల పూలు ముడిచి
చెక్కిలంత కెంజాయ
చిక్కని భావాలు మొలిచి
గుండె, అంచు తీరాల
చిందేస్తూ పరుగెత్తే
కైత కన్నెకేం తెలుసు
కొత్త పొత్తాల చిత్తాలు ?

పొత్తాల ఒత్తుగా పొదిగి
చదువరుల ఎదలో ఒదిగి
భావమై, తరగని రావమై
అన్ని భావాల ఉన్నిరంగు
వలువల వెల్లువ
రూపాన మదిని రాపాడే
కైత కన్నెకేం తెలుసు
కొత్త పొత్తాల చిత్తాలు ?



(గత సంచిక తరువాయి)

సరస్వతి ఇల్లు చేరుకునేసరికి రాత్రి ఎనిమిదిన్నర అయింది వస్తూనే మేడమీది గదిలోకివెళ్ళింది.

మంచంమీద సత్యమూర్తిపడుకున్నాడు. కాళ్ళకుతొడిగిన బూట్లు కూడా విప్పలేదు. డ్యూటీబట్టలు కూడా మార్చుకోలేదు. పరచిన తెల్లటి దుప్పటీ మరకలవుతుందని జోళ్ళున్నకాళ్ళను బయట పెట్టిపడుకున్నాడు. చాల గాఢమయిన నిద్రలోనున్నాడు. వచ్చి ఏ అరగంటపైగానో అయిఉంటుంది.

సరస్వతి అతనిని చూస్తూ అలా నిలుచుండిపోయింది.

చేతిలో నున్న వానిటీ బాగును షెల్ఫులో పెట్టింది.

మంచం చివరను కూర్చుంది. గాలిలో వ్రేలాడుతున్న అతని కాళ్ళను ఒడిలోకి తీసుకొంది. లేసులు విప్పి బూట్లు మెల్లిగా వదులుచేసి తీసింది. మేజోళ్ళుఆలాగే విడిచిపెట్టింది.

ఆమె ఎంత ఆపుకుందా మనుకున్నా దుఃఖం ఆగడంలేదు.

తనని పెళ్ళాడి బావ ఏమిసుఖపడ్డాడని? తనకు ఇప్పటికీ అర్థం అవడం లేదు. తనబాధలను అర్థం చేసుకున్నవాడు అతనొక్కడే. నరకంలోంచి, దిగజారుతున్న ఊబిలోంచి, పడబోతున్న కార్చిచ్చు లోంచి, సమయానికి వచ్చి రక్షించాడు. శిథిలమవుతున్న తన జీవితానికి ఆలంబనమయాడు. చాల శ్రమల కోర్చి, స్వసుఖాలకు, సరదాలకు తిలోద కాలిచ్చి, పైసపైసగ కూడబెట్టిన పదివేలరూపాయలు పెళ్లికి ఖర్చుపెట్టాడు. మంచి సంబంధంవస్తే, తల్లిదండ్రులకు అపఖ్యాతి కలుగుతుందన్నా, జంకకుండా, దానిని విడిచిపెట్టి తనను, తనషరతుల మీదే వివాహం చేసుకున్నాడు. అవన్నీ సరియైనవే-కాని తాను చేసిన పొరపాట్లు దయ్యాలవలె పెండ్లయిన మూడేళ్ళవరకు వెంటబడి, వైవాహికజీవితాన్నే సమూలంగా నాశనం చేయడానికి సిద్ధమవుతుంటే, కొంచెమైనా చలించకుండా తనకు అండగా నిలబడ్డాడు. తనకోసమై స్థిరమైన మంచి ఉద్యోగం, చక్కనిఇల్లు ప్రాణసమానంగా చూసే తల్లి దండ్రులు, అనురాగంతో ముంచెత్తే తమ్ముడు, చెల్లెలు అందరినీ అన్నిటినీ విడిచిపెట్టి, ఏ దూరదేశాలలోనో అందరికీ దూరమయి తనతో బాధలు పడడానికి సర్వసన్నద్ధంగా ఉన్నాడు.

ఇటువంటి నిస్వార్థమైన త్యాగానికి తాను ముట్టచెప్పిన ప్రతిఫలమేమిటి? ఈ ప్రశ్న ఇంతవరకు తన ఆత్మను అడుగలేదు తను. లోకానికంతటికీ ఇద్దరూ భార్యాభర్తలుగా నటిస్తున్నారు. ఎంతటి వంచనయిది. దాంపత్య జీవితంలోని మధురమైన అనుభూతులనన్నిటినీ తాను నిర్దాక్షిణ్యంగా త్రుంచివేసి, తొలిరాత్రినుండి దూరంగానే ఉంటూ, పైపెచ్చు తనను ముచ్చటకయినా బలవంతంకూడా చేయలేని మొద్దని అనుకొంది. తప్పంతా అతనిదే నన్నట్లు వాపోయింది.

తప్పులు చేసినవారు, పెళ్లికిముందుచేశారంటే, ఏదో విధంగా మనస్సును సమాధానం చేసుకోవచ్చు. కానీ, తను ఆ మాయాజాలం లోంచి, ఆ మనోహర్ సుందరరూపంచూచి మురియడంనుండి,ఆ రామాచారి వైపు మనసు మరలించు కోడం నుంచి, పెండ్లిఅయిన తరువాత కూడా తప్పించుకోలేదంటే, అది బావ చేసినతప్పా! అన్నీ బావతో చెప్పడంతో తన బాధ్యత ముగిసిపోయింది. తాళికట్టిన భార్యకు మంచి బుద్ధులొకటీలేవని ఆతను మనసులో బాధపడడా! ఇన్నిఅవమానాలన్నీ దిగమింగి, ఒక్కనాడు పరిహాసానికయినా తనను దూషించని మహాను భావుడికి తానుచేసిన ఉపకారమేమిటి !

సరస్వతి ఎంతప్రయత్నించినా దుఃఖ మాగలేదు.

కళ్ళంట వెచ్చటి కన్నీళ్ళు చెంపలమీదకారి, పైటతడిపేయడంతో ఊరుకోలేదు. అది సత్యమూర్తి పైబడి లేపాయి.

ఒక్కసారిగా సత్యమూర్తి లేచి, కాళ్లు సరస్వతి ఒడిలోంచి తీసుకున్నాడు.

మంచం మీదనే మఠం వేసుకొనికూర్చున్నాడు.

సరస్వతి కళ్లుతుడుచుకుంది, చీరచెరగుతో.

"సరస్వతీ ! ఏమిటి కథ ?"

"ఏమీలేదు. ప్రతీవాళ్లు దేశం మాకేమిచ్చిందని ప్రశ్న వేస్తారు. కాని వారుదేశానికిచ్చిన దేమి అన్న ప్రశ్న వేసుకోరు. నేనుకూడ వారి లోనే జమ. నీకే సౌఖ్యాలు కల్పించానని నన్ను ఆదరిస్తున్నావు ?"

సత్యమూర్తి ఆమె దగ్గరికి వచ్చిబాహువులలోకి ఆమెను తీసుకున్నాడు. ఆమె కన్నీటి చెంపలకు తన చెంపలు చేర్చాడు.

"సరస్వతీ ! నీ కన్నగుణవంతురాలైన భార్య నాకెక్కడ లభిస్తుంది ? నువ్వు నా దగ్గిర ఉంటే చాలు హృదయం చెప్పుకోలేని ఆనందంతో నిండిపోతుంది. ఎప్పుడూ నవ్వుతూ సరదాగా ఉంటావు కదా, ఎందుకు బేలవై పోయావు ?"

సరస్వతి విశాలమైన అతని వక్షస్థలంమీద ముఖముంచి రోదించింది.

సత్యమూర్తి ఆమెను పొదవిపట్టుకున్నాడు. కట్టలుతెంచుకొని వస్తున్నది ఏడుపు.

"సరస్వతీ ! ఒక సంగతిచెప్పడం మరచి పోయాను. ఇవాళ మన మేరేజిడే అన్న సంగతి మరచి పోయానా ?"

సరస్వతి అతని కౌగిలిలో ఒదిగి కూచుంది.

"నాకు పెళ్లిచేసుకున్న వరకే తొందర తరువాత ఇటువంటి వన్నీ మరచి పోయాను."

"మరేం పరవాలేదు. చూడు! టేబిలుమీద నున్న పార్సెలు ఇలా తీసుకొనిరా !"

సరస్వతి లేచి టేబులు దగ్గిరికివెళ్లింది. అక్కడరెండు పాకెట్లున్నవి. ఒకటి స్వీట్సు పాకెట్టు-రెండవది బట్టల పాకెట్టు రెండింటినీ తీసుకొని వచ్చి అతని పక్కనే కూర్చుంది,

"ఇప్పుడింకా తొమ్మిదేఅయినట్లుంది. ముందు ఈ చీర, బ్లౌసు చూడు ! నీకు నచ్చినవోలేవో ! నువ్వు నచ్చితే మా అమ్మకు, చెల్లికి చూపించు ఇప్పుడె ఉద్యోగం నుంచి వచ్చినట్లున్నావు. ఒళ్ళుకడుక్కొని, కొత్తచీరకట్టుకొనిరా ! నేనూ స్నానంచేసివస్తాను. ఇవాళ మన మేరేజిడే అని చెప్పి స్వీట్సు మనవాళ్ళకిద్దుగాని. తరువాత భోజనాలు చేద్దాం."

సరస్వతి చీర, స్వీట్సు తీసుకొని దిగువకువెళ్లింది. జానకమ్మ వంటింటిలో పనులుచేస్తున్నది.

'అత్తా ! ఇవాళ మా మేరేజిడే! నాకా విషయమే జ్ఞాపకం లేదు. బావ చీర కొని తెచ్చాడు. చూడు. నీకు చూపించమన్నాడు. బాగుందా ! మామకు, పిల్లలకు ఈ స్వీట్సు."

"సరస్వతీ ! మీ మామగారు, పిల్లలు అందరూ మేలుకొనే ఉన్నారు. వేగంగా ఒళ్లుకడుక్కొనిరా ! నీకు, వాడికి సరిపోయినన్ని వేడినీళ్ళు బాత్‌రూమ్‌లో ఉంచాను. కొత్త చీరకట్టుకొని, మీ మామగారికి దండంపెట్టి అప్పుడు నీచేతితోనే అందరికీ సీట్సు పంచు "

సరస్వతి ముందు ఒళ్లుకడుక్కొని వచ్చింది. కొత్తచీరకు అత్త పసుపుపెట్టి ఇచ్చింది. కొద్దిసేపటిలో సత్యమూర్తి కూడా స్నానం ముగించి వచ్చాడు. సరస్వతి కొత్తబట్టలతోవచ్చింది. నుదుట బొట్టు మాత్రమే పెట్టుకుంది. ముంగురులు వెనక్కు తోసుకుంది. జడకూడా తిరిగివేసుకోలేదు. ఎవరో సౌందర్యానికి అధిదేవతఅయిన గంధర్వ కాంత దివినుండిభువికి వచ్చినట్లు కనిపించింది,

"హాపీ మారేజిడే టు యూ !"

కాత్యాయని, శేఖర్ కూడ బలుక్కొని ఒక్కసారి వదిన పక్కను చేరి అన్నారు.

"బర్తుడే పాటలు పీళ్లు మార్చారు సరస్వతీ !" అన్నాడు సత్యమూర్తి.

సరస్వతి అత్తమామలకే కాకుండా, వాళ్లఎదురుగా మూర్తికి కూడ వంగి నమస్కారంచేసింది. పిల్లలకు,పెద్దలకు స్వీట్సుపంచింది.

భార్యాభర్తలు భోజనాలు ముగించి వేడ ఎక్కేసరికి పదకొండు గంటలయింది. పెట్టెలోని మడత దుప్పటితీసి మంచంమీద పరచింది. దానిమీద సత్యమూర్తి పడుక్కొని సరస్వతికి చోటు చూపించాడు. ఇవాళ తన చిన్న మంచం ముందుకు లాక్కో వలసిన అవసరం కలుగలేదు ఆమెకు.

ఇద్దరూ మంచం మీదపడుక్కున్నారు. ఆమె ఎడమచేతిమీద తలనుంచుకొని వ్రేళ్లతో ఆమె చెంపలమీద రాస్తున్నాడు మూర్తి.

"బావా! జీవితంలో ఈ మంచిరోజు రాదేమోనని భయపడ్డాను."

"సరస్వతీ ! ఇంతమంచిరోజు వచ్చినప్పుడు, నేనుకన్నకలలు ఫలించినప్పుడు...."సత్యమూర్తి ఆమె కళ్లల్లోకి చూస్తూ ఊరకున్నాడు.

"ఏంబావా ! ఆపేశావు. ఇంతమంచిరోజున ఏమయింది."

చాలప్రయాసతో, మహాదీక్షతో గాలివానలో ముందుకునడిచి నావ తీరం చేరిందనే తృప్తిమాత్రమే మిగిలిపోయింది. నేను పూర్తిగా అలసిపోయాను. నా హృదయం చాల బరువుగా తోస్తున్నది."

"నిజమేబావా ! నాకూ, ఎంతోసంతోషించవలసిన ఈ సమయంలో బాధమాత్రమే తోస్తున్నది. ఏదో చాల తప్పుచేసినట్లే మనసు మథనపడుతున్నది."

"అదేనన్ను బాధిస్తున్నది. మీది పెద్దసంస్థ. నాలుగయిదు వందల మంది దీని మీద ఆధారపడ్డారు నేను చాల శ్రమపడి సాధించిన విజయం చాలమంది కడుపులను కొడుతున్నది. నేనొక్కడను పక్కకు తొలగిపోతే వాళ్లు ఏంచేసేవారో-నేను అందుకు కారణమయ్యేవాడిని కాను."

సరస్వతి మెల్లిగా అతని పెదవులకు పెదవులు చేర్చింది. గోముగా అతని ఫాలం మీద ముంగురులు చక్కబెట్టింది.

"రావణాసురుని చంపిన రాముడికి కూడా ఇటువంటి నిర్వేదమే కలిగింది. కాని ఒక సంగతి. ఇది ధర్మబద్ధమైన పోరాటం. సామాన్యులెవరూ మా మానేజింగ్ డైరెక్టరు ముందు నిలువలేరు-నువ్వు ఎదురు తిరిగావు-ధర్మం నీయందు ఉందికాబట్టి విజయం సాధించావు.

"అవును సరస్వతీ ! ధర్మమే మనకు అండగా నిలిచింది.

సరస్వతి అతని ముంగురులు వ్రేళ్లతో కదుపుతూఉంది. కను రెప్పలు బరువెక్కి చంటిపిల్లడిలా ఆమె కౌగిలిలో అతను నిద్ర పోయాడు.

## 22

సరస్వతి నిద్రలేచే సరికి అప్పుడే ఏడున్నరకావస్తుంది. సత్యమూర్తి పావుగంట క్రిందే పనికి వెళ్ళిపోయాడని జానకమ్మ చెప్పింది.

సరస్వతి పళ్ళుతోముకుంటుంటే నిన్న సాయంకాలం రోజ్ చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. ఆమెవెళ్ళిపోతూ రిక్షాఆపిచెప్పిన సంగతులు చెవులలో రింగుమన్నాయి.

చిన్న ప్లాస్టిక్ పెట్టె- ఎలక్ట్రికల్ వైరు చుట్ట. అవి ఎవరిచ్చారు. సుబ్బారావుగారు స్వయంగా తనను భద్రంచేయమన్నారు. ఆపెట్టెలోని డిటనేటరు మామూలుగా రాతిని పగులగొట్టే తూటాకన్న పదిరెట్లుబలమయినది. ప్రత్యేకంగా వాటిని రెండింటిని తవ్వుతున్న నూతిపనికని కొన్నారు. దీనిని ఉపయోగించడం ఎవరికితెలుసు? వెంకునాయుడికి తెలుసు. అతనే దానిని భద్రంగా బీరువామీదఅరలో పెట్టాడు. దీనిని పేల్చడానికి రంజకంతాడు అక్కరలేదు.నూరుగజాలవరకూ పొడవున్న ఎలక్ట్రికలు వైరుతో ఇది ప్రేలుతుంది. దేని కవిపేరుగా ఉన్నవికదా ఎలా ప్రేలుతుంది. అవునవును-పన్నెండువోల్టులబాటరీ కావలసిఉందట దానిని అక్కడే ఉన్న ట్రాక్టరును ముందుకుతెచ్చి వాడుకోవచ్చునన్న మాట- తానుకూడా కాలేజిలో ఫిజిక్సుచదువుకుంది. వైరును బాటరీకి డిటనేటరుకు అనుసంధానం చేయగనే,ఎలక్ట్రిక్ స్పార్కువచ్చి-ఆ ప్రేలుడు వస్తువు మహాశక్తితో రాతిని తుత్తునియలుచేస్తుంది. అవునవును బావకూడామాటలలో చెప్పాడు. అక్కడనున్న నుయ్యిగురించి చెప్పాడు ప్రతిరోజు ఉదయం ఎనిమిదిగంటలకు విధిగా అతను లోపల దిగి గడిచిన దినం ఎంతవరకు తవ్వారో చూస్తాడు. కనీసం ఒకఅరగంట అయినా అక్కడఉంటాడు. అనూయితవ్విస్తున్న మేస్త్రీవెంకునాయుడు. అవును అందుకే అతనిని సుబ్బారావుగారు డిటనేటర్లు కొనేటప్పుడు బజారుకు తీసుకొని పోయారు. వెంకునాయుడికి వాటిని ఉపయోగించడం బాగానే తెలుసు అన్నాడట- రాత్రంతా పనిచేసి, ప్రొద్దున్నకు సిద్ధంగాఉంటాననితెలుసు. పెద్దబాసుతో వెంకునాయుడేదో అన్నట్లురోజ్ చెప్పింది. ఏమిటన్నాడు? తాను అంతగావాడి మాటలు పట్టించుకోవడం లేదు. కానివాడాడిన మాటలు సవ్యంగాలేవు. ఎప్పుడూ అటువంటివే అనేవాడి మాటలొక లెక్కఏమిటి- కాదు,కాదు. మనోహర్ ఎదుట అంత ధైర్యంగా అన్నాడంటే- దానికతను అంగీకారం నవ్వుతూతెలిపి.... ఏమిటామాటలు-ఆ అడ్డుతొలగిపోతే-ఏ అడ్డు?.... తానువాళ్ల కాళ్లమీద పడిపెళ్లాడమని.... ఛీ!.... ఛీ! తనకుమళ్లీ పెళ్లేమిటి? ఒక్కసారిగా ఆమె మనసులో ఒకమెరుపు మెరిసింది.

"ఓరి దుష్టుడా! ఎంతదుర్మార్గానికి వడికట్టావురా!"

ఈమాటలు అప్రయత్నంగా సరస్వతి నోటినుండి వెలువడ్డాయి. ఇల్లు తుడుస్తున్న జానకమ్మ ఆశ్చర్యంతో నిలిచిపోయింది.

"ఏమిటి సరస్వతీ అంటున్నావ్?"

తొందరగా ముఖంకడుక్కొని, పనికట్టుకొని దేవుడి గదిలోకి పోయిబొట్టు పెట్టుకొని వచ్చింది.

"బావ ప్రమాదంలోఉన్నాడత్తా! నేను వెంటనే వెళ్తున్నాను. వెంకటేశ్వరరావు గారిని తీసుకొని పోతున్నాను.

"మామగారురానీ, ఇప్పుడే బజారుకెళ్లారు!"

"వ్యవధిలేవత్తా!...."

సరస్వతి పరుగెత్తింది, చీరేనా మార్చుకోకుండా! వెంకటేశ్వరరావు పోర్టులో పనిచేస్తున్నారు. అతనికో కొత్తస్కూటరుంది.

"వెంకటేశ్వరరావుగారూ! మాబావ ప్రమాదంలో ఉన్నాడండీ! వెంటనే స్కూటరుమీద షిప్‌యార్డుకాలనీకి రావాలి."

"ఏమిటి?...."

"ప్రశ్నలకు జవాబులకు ఇది తరుణంకాదు మీరు వస్తేఅంతా తెలుస్తుంది." అతను వెంటనే బట్టలువేసుకొని స్కూటరు బయటకి తీశాడు.

సరస్వతి స్కూటరుమీద కూర్చున్నదే కాని మనసు మనసులో లేదు. అప్పుడే ఎనిమిదయింది. ఇంకా మరోపది నిమిషాలయినా కానిదే సైటుకి చేరడం కష్టం. ఈలోపలే అంతా ముగిసిపోతే....

బొందరీవాలుకి అరకిలోమీటరు దూరంలో కడుతున్న లాబర్ కాలనీ ఉంది. దానికి రెండువందల గజాలదూరంలో తవ్వుతున్న నూయిఉంది. గేటు దాటగానే కాలనీకనిపిస్తుంది. అక్కడనున్న రోడ్డుచాల మిట్టపల్లాలతో ఉంది.

స్కూటరు గేటుదాటగానే సరస్వతికి కలిగిన సంశయాలన్నీ విభిన్నమయాయి. అప్పుడే వెంకునాయుడు ట్రాక్టరును స్టార్టుచేస్తున్నట్లున్నాడు, సరస్వతికి గుండెలు ఆగినంత పనిఅయింది. ఇటువంటి ప్రమాదమైన పరిస్థితులలో కోల్పోరానిది ఆత్మస్థైర్యం.



"వెంకటేశ్వరరావు గారూ! అదిగో ఆ ట్రాక్టరువేపు వీలయినంత తొందరగా స్కూటరు నడిపించండి– రోడ్డుఏమీబాగాలేదు."

అతను నడిపిస్తున్నాడు. వెంకునాయుడు ట్రాక్టరు నూతివైపు నడక మొదలుపెట్టింది. ఆ ట్రాక్టరు నూతికి కొద్దిదూరంలో ఆగిపోయింది. ఆ చుట్టుపట్ల మనుషులెవరూ దగ్గరలో లేరు.

పైకి ఎంతధైర్యంగా కనిపించినా సరస్వతి గుండెలు చాలవేగంగా కొట్టుకుంటున్నవి. ఇంకా ఫర్లాంగు దూరం ఉంది. స్కూటరు చప్పుడు విని వెంకునాయుడు తలెత్తిచూశాడు. చూడడమేమిటి ట్రాక్టరు దిగిపోయాడు. నూతివేపు పరుగెత్తాడు. టార్పాలిన్ పక్కకు తొలిగించాడు. ఎల్క్ట్రికలు వైరుచుట్టును విప్పుకుంటూ ట్రాక్టరువేపు నడుస్తున్నాడు.

స్కూటరు ఆగిపోయింది. మరిముందుకు పోవడానికి దారిలేదు. సరుగుడురాటలు, వెదుళ్లుఅడ్డంగా ఉన్నవి. సరస్వతి దిగినవెంటనే ఆ కర్రలను దాటుకొని రెండవ పక్కచేరుకొంది. వైరుచుట్టచాలమిగిలిపోయింది. ట్రాక్టరు నూతికి అట్టే దూరంలో లేదు. రమారమి ఏభై గజాలవరకు ఉండవచ్చు వెంకునాయుడు బాటరీకి తగిలించవలసిన చివరల కోసం వెదుకుతున్నాడు. చుట్టవిప్పుతుంటే అవి చిక్కుబడిపోయాయి. సరస్వతి ముందుకుపోబోయింది. చివరలు దొరికి నట్లున్నాయి. మరివ్యవధిలేదు. బాటరీ టెర్మినల్సుకి వాటిని తగిలిస్తే అంతాముగిసిపోతుంది.

సరస్వతికి ఆలోచించడానికి కూడా వ్యవధిలేదు.

క్రిందపడి ఉన్నసరుగుడు రాటనొక దానిని తీసుకొని పరుగెత్తింది.

వెంకునాయుడు బాటరీకి వైరుచేర్చే సమయానికి పదిగజాల దూరంలో ఉంది. పెద్దకేకపెట్టి ఆ సరుగుడు రాటను వాడి మీదికి విసిరివేసింది.

ఆరాట నాయుడి తలకు తగలకపోయినా కాళ్లకు తగిలి అతను తూలిపోయాడు. చేతిలోని వైరు వణుకుతున్న అతని చేతులలోంచి జారి క్రిందపడింది. మళ్లీ అతను వంగాడు దానిని తీయడానికని.

అప్పుడు సరస్వతి కెదురుగా డిటనేటరుకు తగిలించిన వైరు కనిపించింది. ఒక్కసారి దుమికి దానిని పట్టుకొని బలమంతా ఉపయోగించి లాగింది, ఆవైరు తెగిపోయింది.

వెంకునాయుడు వైరుచివరలను బాటరీటెర్మినల్సుకి తగిలించాడు. కాని ఏమీ జరగలేదు.

"నాయుడూ! వైరు తెగిపోయింది. పది బాటరీలకు తగిలించినా మరి ప్రేలుడు సంభవించదు,"

వెంకునాయుడు పిచ్చివాడిలా ఆమెవేపు చూశాడు. మరో సరుగుడు కర్రపట్టుకొని సరస్వతి అతని వెంట పరుగెత్తింది.

వెంకునాయుడు పారి పోతున్నాడు.

'పట్టుకోండి వెంకటేశ్వరరావుగారూ! ఆమర్దర ర్నిపట్టుకోండి.

సరస్వతి కేకలువిని దూరంగా ఉన్నవాళ్లు రావడం మొదలెట్టారు. పరుగెత్తుతున్న వెంకునాయుడు కెదురుగా స్కూటరాపి వెంకటేశ్వరరావు నిలబడ్డాడు.

"వెంకునాయుడిని పట్టుకోండి. ఓయి వీరాస్వామీ, సత్తెమ్మా-ముత్యాలు, పట్టుకోండి. ఈ దుర్మార్గుడు మా బావను పేల్చివంపేయ్య డానికి ఎత్తువేశాడు-పట్టుకోండర్రా."

అందరూ వెంకునాయుడు మీదపడి చేతులు విరిచికట్టి తీసుకొచ్చారు.

"మీరందరూ సాక్ష్యం. నూతిలోంచి ముందు ఇంజనీరు దొర గారిని పైకితీసుకొనిరండి.

ఇద్దరు మనుషులు నూతిలోకి దిగి అయిదునిముషాలలో సత్యమూర్తిని పిలుచుకొనివచ్చారు.

సత్యమూర్తి కేమీ అర్థంకాలేదు. వెంకటేశ్వరరావు, సరస్వతి, పనివాళ్లు, వాళ్ల చేతులువిరిచి పట్టుకున్న వెంకునాయుడు-వీరినందరిని చూచి అతను ఆశ్చర్యపోయాడు.

"మీరందరూ సాక్ష్యం ! మీ అందరి ఎదురుగా ఈ వెంకునాయుడు చేసే ఘోరమైన పనిని మీకుప్రత్యక్షంగా చూపిస్తాను. మీరందరూ చాల దూరంగా వెళ్లండి, రాళ్లువిరిగిపడగలవు. ఇంజనీరు గారిని కూడా మీతో దూరంగా తీసుకొనిపొండి."

వాళ్లందరూ వెనక్కునడిచారు. సరస్వతి ముందు ట్రాక్టరు బాటరీకి తగిలించిన చివరలను తీసింది. చాల సేపు ఆలోచించిన తరువాత ఆ పనిచేసింది. తరువాత చివరలను బాటరీకి తగిలించిందో లేదో బ్రహ్మాండమయిన శబ్దం నూతినుండి వచ్చింది. భయంతో గెంతి ట్రాక్టరు క్రింద దూరింది సరస్వతి.

రాళ్లముక్కలు ఆకాశంలో చాల ఎత్తుఎగిరి, నూరుగజాల మేరలో వర్షం కురిశాయి. ట్రాక్టరు క్రిందకూర్చుంది కాబట్టి సరస్వతి బ్రతికి బయటపడింది. ఆ రాళ్లవర్షం ఆగిన తరువాత అందరూ ట్రాక్టరు వేపువచ్చారు. నూతికి సమీపంలో ఉన్నది ట్రాక్టరు. ప్రేలుడు నూతిలో సంభవించింది. కాబట్టి ఆమె బ్రతికింది. లేకపోతే దాని అదుటికే ప్రాణాలుపోయేవి.

అందరూ చూస్తూంటే ట్రాక్టరు క్రిందనుంచి సరస్వతి బయటికి వచ్చింది.

తనవేపేనడిచివస్తున్న సత్యమూర్తి వేపుపరుగెత్తి చాచిన అతని చేతులలో పడిపోయింది.

"బావా ! ఎంతఘోరం జరిగిపోయేదో ?"

సరస్వతి ఏడుస్తున్నది సత్యమూర్తిని కౌగలించుకొని.

పనివాళ్లు వెంకునాయుడిని తంతున్నారు.

"వీరాస్వామి ! ఇదిమనం చేయవలసినపనికాదు. పోలీసులు చేయవలసినది. వెంకటేశ్వరరావుగారూ ! గేటుకు దగ్గరలో పెట్రోలు బంకుంది. అక్కడనుండి పోలీసుస్టేషనుకు ఫోనుచేసి చెప్పండి.

కొద్దిసేపటిలో పోలీసువాను, టాక్సీలో రామభద్రయ్య జానకమ్మ, పిల్లలిద్దరూ, కారులో ఛీఫ్ ఇంజనీరుగారు అక్కడికి వచ్చారు. వెంకటేశ్వరరావు ఎక్స్ఛేంజిలో నంబరు కనుక్కొని అతనికి కూడా ఫోను చేశాడు.

వెంకునాయుడు ముఖంలో కత్తివాటుకి కూడా నెత్తురు చుక్కలేదు.

పోలీసులు, ఛీఫ్ ఇంజనీరు ప్రేలుడు జరిగిన చోటు చూచారు. పై అంచుకి నాలుగు గజాల లోతుకి అమర్చిన డిటనేటరు పేలి, రాళ్లతో తవ్విన నూతిని కప్పివేసింది.

## 23

పీఠివరంటాలో కూర్చొని చిట్టిబ్బాయి క్లారినెట్ వాయిస్తున్నాడు. కదనకుతూహలం రాగంలో రఘువంశ సుధాంబుధి వాయిస్తున్నాడు. చిట్టి స్వరం బ్రహ్మాండంగా ఉంది.

"ఆపండయ్యా, ఆపండి"

లోపలినుంచి పురోహితుని మాటలు వినిపించాయి. ఆగిపోయిందిపాట.

"అయ్యా ! శాస్త్రులు గారూ! కొంచెం పాట అయిన తరువాత అవమానలేక పోయారా!" అన్నాడు బాలసార పెళ్లికొడుకు, సత్యమూర్తి.

"మీ కొడుకు తరంలో అలాగే చేయవచ్చు! ప్రస్తుతానికి సమయం మించిపోతున్నది. ఏమమ్మా జానకమ్మా! మనుమడికి ఏమి పేరు పెడుతున్నారు?" శాస్త్రులుగారు అడిగారు.

"మా అయన్ను అడగండి!" అంది జానకమ్మ.

"ఏమయ్యా రామచంద్రయ్యా! మనుమడిపేరేమిటి?"

"అయ్యా! నాపేరో, మా బావ ఆనందరావు పేరో పెట్టమని మావాళ్ల అభిప్రాయం. కాని ఆ భారం మాకోడలిమీదే విడిచిపెట్టాను. మాపేర్లకన్న మోడరన్‌గా ఉండేవి ఎంచుకుంటే బాగుంటుంది."

"నాన్నా! నాదోసలహను. వాడిపేరు ప్రేమకుమార్- ఏం వదినా! ఎలావుంది" అన్నాడు శేఖర్.

అన్నీ వింటూ ఊరక ఉన్నవాడు సత్యమూర్తి మాత్రమే.

"శాస్త్రులుగారూ! ఇన్ని అలోచనలు దేనికి- వీడిపేరు రామచంద్రరావని పెట్టండి. ఇది సాంప్రదాయం- దీనిని పాటించవలసిన అవసరం మాకు లేదా?"

"వదిన ప్రపోజలుకు నేను సెకెండ్ చేస్తున్నాను" అంది కామేశ్వరి.

బాలసార అయిపోయింది. భోజనాలకు ఏర్పాటు చేస్తుంటే వియ్యంకులిద్దరూ వీధివరండాలో కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"బావగారూ! మీ బావమరిది సత్యనారాయణేడీ? ఈ మధ్యకని పించటంలేదే!" అన్నాడు రామచంద్రయ్య.

ఆనందరావు ఇటూఅటూ చూచాడు. శకుంతల ఆ ప్రాంతాలలో లేదు. మెల్లిగా రామచంద్రయ్యతో అన్నాడు:

"అయ్యా! వాడిబాధపడలేక చచ్చిపోతున్నాను. కాళ్లావేళ్లాపడి రామాచారిగారితో చెప్పి కంపెనీలో ఉద్యోగం వేయించాను. ఆ ఉద్యోగం నిలబెట్టుకున్నాడా? ఎవరో రుక్మిణట- టైపిస్టు- ఆమె వెంటపడ్డాడు. ఎంతకాలం ఓరుస్తుందాపిల్ల- ఒక సాయంకాలం పార్కులోకి రమ్మని చెప్పి కాళ్లు విరగ్గొట్టించింది, దానితో మనవాడు నెల్లాళ్ల వరకు మంచం దిగలేదంటే నమ్మండి- ఈలోగా ఆకంపెనీయే కూలిపోయింది- పాపం ఆ రామాచారిగారు మద్రాసు వెళ్లి పోయారు.- వాళ్ల మామగారు ఏదో పెద్ద పని ఇప్పించారట- కంపెనీ యజమాని దేశమే విడిచి వెళ్లి పోయాడు. అమెరికాలో సెటిలయాడుట కుటుంబంతో – ఇంకా మరి మీకు తెలిసిన విషయమే కదా, ఆ వెంకు నాయుడు కఠిన నరకంలో ఉన్నాడట ఏడేళ్ల వాడికి శిక్ష! ఇంతకీ చెప్ప వచ్చిందేమంటే మా సత్యనారాయణను ఈమధ్య ఖూనీ చేస్తామన్నారట. వాడెవడో లాయరట- వాడి చెల్లెలిని అల్లరి పెట్టాడు- ఈవూళ్లోవుంటే చావు తప్పదని మావాడిని తిరిగి విజయనగరం కో ఆపరేటివ్ స్టోరుకు పంపించాను. మీచెల్లెలు నెత్తీ నోరు కొట్టుకుంటుంది. నిజానికి నాప్రాణం మాత్రం హాయిగా ఉంది."

ఆనందరావు మళ్లా వెనక్కు చూచాడు. మెటికలు విరుస్తున్న శకుంతలను చూచి నీరు విడిచి పోయాడు.

ఇంతలో భోజనాలకు పిలుపు వచ్చింది.

లోపలినుంచి చంటి పిల్లడి ఏడుపు విన వచ్చింది.
విస్తరి దగ్గిర కూర్చున్న సత్యమూర్తి లేచాడు.

"బావా !ప్లీజ్ !" సరస్వతి అతనిని అర్థిస్తున్నది.

మంచం మీద పడుకున్న చంటి పిల్లడిని ఎత్తుకున్నాడు. చేతులలో వాడిని ఉంచుకొని ముఖంలోకి చూచాడు.సరస్వతి పోలికలే-ఆ విశాలమైన కళ్లు, పెద్దనుదురూ, దొండపండు వంటి పెదాలు-

పిల్లడు ఏడుపుమాని తండ్రి ముఖంలోకి చూస్తున్నాడు."

"అవునురా తండ్రీ ! మీ అమ్మ సరస్వతిదే గెలుపురా !

వెనకనుండి సరస్వతి వచ్చింది. నవ్వుతూ పిల్లవాడిని తీసుకొంది.

"బావా ! నీ జీవితమిప్పుడు వడ్డించిన విస్తరి."

సత్యమూర్తి భోజనాల గదిలోకి నడిచాడు, నవ్వుకుంటూ.

( అ యి పో యి ం ది )

# క ల గూ ర గం ప

## "నాదేశం నా ప్రజలు" ప్రతీకాత్మకత

"లోకం చూచి చూచి మనుష్ల్ని చదివి చదివి
లోకం వట్టి సంకేతాల సముదాయం అని తెలుసుకున్నా....
ఈ మనుషులందరూ గుర్తులు మాత్రమే. ఏ అర్థాలకో శబ్దాలు
ఎక్కడికి వెళ్ళినా మనుషులు మారతారేగాని అర్థాలు మారవు"[1]

అన్వేషణ శీలియైన మానవుడు అనుభవాలనుండి జీవితానికి అన్వయసూత్రాన్ని సాధిస్తాడు. రసానందసాధకుడైన కళాకారుడు అనుభవం నుండి అనుభూతిని. పిండుకుంటాడు. ఆత్మస్థానీయమైన అనుభూతికి అభివ్యక్తి ఆకృతి నిస్తుంది. అనుభూతి అభివ్యక్తి అనే రెండు తీరాల నొరుసుకుంటూ పారే స్వచ్ఛకవితా తరంగిణి మాత్రమే సర్వజన హృదయ సాగరాలను చేరగలుగుతుంది.

అనుభూతి ఉత్కటత్వాన్ని, దానిలోని త్రికరణ శుద్ధిని అనుసరించి కవిత్వం సమస్త జాతికి అన్వయించి ఆనందమగ్నులను చేయడం ఆదికవి నుండి ఆధునిక కవి వరకు అనుభవ వేద్యమే.

అనుభూతికి అనువైన అభివ్యక్తినివ్వడానికి 'సమాధి' కవి సాధించ వలసిన స్థితి, "మనస(ః) ఏకాగ్రతా సమాధిః సమాహితం చిత్తమర్థాన్ పశ్యతి"- కావ్యరచనలో కవికి సమాధి పరమావశ్యకమని మనస్సు యొక్క ఏకాగ్రతయే సమాధి అని సమాహితమైన చిత్తమే అంత రార్థాలను దర్శించగలదని రాజశేఖరుడన్నాడు.[2] జాగ్రుత్ స్థితికంటె ఈస్థితి ఉన్నతమైంది కావడంవలన జాగృత్‌స్థితిలోని 'పరిధుల'కు అతీతమైన కవి అంతరాంతరాలసంస్కారాలతో. వాసనలతో సమ్మిళితమైన అభివ్యక్తిని అందుకునే స్థితి గనుక దీనిని 'అచేతన' (అన్‌కాన్‌షియస్) దశగాకూడ విమర్శకులు పేర్కొన్నారు.

దీనినే శేషేంద్ర 'ఆత్మకళ' అన్నారు[3] 'సచేతనంగా సబుద్ధికంగా సంకల్ప సహితంగా జీవితాన్ని ఆ చమనం చెయ్యడం ఆత్మకళ' అని అది అభ్యాసం చేత సాధించవలసిన స్థితి అని చెప్పారు. ఫావెల్ అనేకవి తనకావ్యమైన కొలంబస్‌లో.

"అండ్ ఐ బిలీవ్‌డ్ దట్ పోయెట్స్ : ఇట్ ఈజ్ దె హు అట్టర్ విస్‌డమ్ ఫ్రమ్‌ది సెంట్రల్ డీప్ అండ్ లిజనింగ్ టు ఇన్నర్ ఫ్లో ఆఫ్ థింగ్స్ స్పీక్ టు ది ఏజ్ అవుట్ ఎటెర్నిటే"[4] అన్నాడు.

దీనిలోని 'సెంట్రల్ డీప్' మనస్సుయొక్క అంతరాంతరా వాచక మవుతున్నది .జస్టస్ బక్‌లర్[5] దీనినే 'ఇన్నర్ వరల్డ్' 'సబ్‌జెక్టివ్ యూనివర్స్' అని పేర్కొన్నాడు.

"నా చూపుల కావల గర్జించే శూన్యంతో, నా సముద్ర కావల గుసగుసలాడే నీలిమతో, నా నక్షత్రాల కావల ప్రజ్వలి ఉదాత్తంతో నా చేతుల కందని లోతులతో నామూర్ఖ సమకాలికుల అపరిచితమైన పదార్థాలతో పద్యాలల్లుతున్నా" నన్న శేషేంద్ర కవి వాక్యాలలో 'నాచేతుల కందని లోతులతో' అనే మాట గమనిం దగింది. 'అమోఘము, అచింత్యము, అమేయము, క్షణికమై దివ్యానుభవ దశ కవిత్వవతరణకు మూలస్థానం 'చిరదీక్షా శి తపస్సు' వలన నిశ్చలసమాధిగా నిలుపు కోవలసినదశ అది. ఆ దశ చేతుల కందని లోతులుగా చెప్పాడు శేషేంద్ర.

బహిరుపాధితో నామమాత్రమైన సంబంధం కలిగిన ఈ అ మానస దశలో వస్తువుల యొక్క, తదనుభవాల యొక్క బాహ్య రూపాలు అప్రధానమై వాటి తాత్త్విక రూపాలు శేషిస్తాయి. అప్పుడ ప్రకృతి సర్వం ప్రతీకల సమూహంగా దర్శనమిస్తుంది. ఈ అ మానస దశను ఎఫ్. సి. ప్రిస్కాట్ ఈ విధంగా చెప్పాడు.

"ది డీపర్ మైండ్ ఈజ్ సైలెంట్, అండ్ ఫర్ దిస్ రీజ
ఎకార్డింగ్ టు కార్లైల్ 'సైలెన్స్ ఈజ్ గోల్డెన్'!
ఆర్ ఇఫ్ ఇట్ మస్ట్ ఎక్స్‌ప్రెస్ ఇట్‌సెల్ఫ్, ఇట్ కెన్
సో ఓన్‌లీ ఇన్ సింబల్స్-ఇన్ సిగ్‌నిఫికెంట్ పిక్చర్స్"[6]

అభ్యాసదూరులై ఈ అతిమానస దశను చేరుకోలేక కవిత్వాన్ని బౌద్ధిక ప్రక్రియగా భావిస్తూ మనస్సుయొక్క ఉపరితలాలలోనే విహ రిస్తూ కించిత్ శబ్దార్థ చమత్కారాలనే కవితా పరమార్థంగా భావి స్తున్న కవి వరేణ్యులతో నిండిన సమకాలీన సాహిత్యస్థితిని నిర సించాడు శేషేంద్ర." చెప్పవలసిన అవసరం వచ్చినప్పుడే, ఏదొ స్ఫురించినప్పుడె, ఏదో మెరిసినప్పుడే, ఏదో ఘనస్సులో ఒక జల పాతం ఘోషించినప్పుడే గొంతెత్తాల"[7]న్నది ఆయన కవిత్వ నియమం

ఆత్మ కళాభ్యాసము అనుభూతి శిఖరాలకు చేరిస్తే, పురా సంస్కారప్రభావం. అభివ్యక్తికి అర్థగౌరవాన్ని కలిగించింది. ఆధుని సామాజిక చైతన్యం ఆయన తాత్త్విక దృక్పధాన్ని తీర్చిదిద్దింది.

జగత్ స్థితి కారకుడు, శ్రమకు మరోరూపం అయిన కర్షకుడు. 'నాదేశం నా ప్రజలు' లో నాయకుడు. ప్రకృతి అతని రంగస్థలం.

కార్మికునిగా, శిల్పిగా, నావికుడుగా, సైనికుడుగా కవిగా పలు రూపాలలోనున్న ప్రపంచ శ్రామికునికి. శ్రమశక్తికి ప్రాతినిధ్యం వహిస్తాడు దీనిలోని కర్షకుడు. కర్షకుని నిష్పుశ్రమను నేపథ్యంగా స్వీకరించి ఆదిమానవుని నుండి ఆధునాతన మానవునివరకు పొందిన వికాస పరిణామాలను, ప్రపంచ మానవుని సంక్లిష్ట జీవనాన్ని ప్రతీకాత్మకంగా చిత్రించాడు కవి.

బౌద్ధిక ప్రక్రియతో నియమించిన యాంత్రిక సంకేతాలుగా కాక, హార్దిక ప్రకృతితో అనుభూతి పరాకాష్టలో దర్శించి ప్రయోగించిన శేషేంద్ర ప్రతీకలు అలంకారస్థాయి నధిగమించి సార్థకతను సంతరించు కున్నాయి.

ప్రాచీన వైదిక లౌకిక సాహిత్య భావధార అంతస్స్రోతస్వినిగా అమరిన ప్రతీకలు విప్లవ భావాభివ్యక్తికి వైరుధ్యాన్ని ప్రదర్శించక సమగ్ర అన్వయాన్ని సాధించుకున్నాయి.

భావ కవిత్వంలో వైయక్తికమైన అనుభవాలు, మనోభావాలు, భావనలతో కూడిన ఆత్మాశ్రయమైన ఇతివృత్త స్వీకారం జరిగింది. దీన్వారా భావకవులు 'నేను' ను వ్యక్తిగత అహమికకు ప్రతీకగా ప్రయోగించారు. పీడిత తాడిత జనులతో మమైక్యం చెందిన అభ్యుదయ, విప్లవ కవుల కవిత్వంలో 'నేను' సామాజిక అహమికకు (సోషల్ ఇగో) ప్రతీకగా ప్రయోగించబడినది.

'నేను పడుతున్న బాధలే నాదేశమంతా పడుతోంది నా మానవ జాతి అంతా పడుతోంది. కనుకనే నాజ్వాలిక నాదేశపు వాలిక' అని చెప్పిన శేషేంద్ర ఈదేశం ఈ ప్రజల విషయంలో తనకున్న ఆత్మీయతను కావ్యనామకరణంలోనే వ్యక్తపరిచాడు. తాను వ్యక్తిగా జాతిలో లీనమైపోతూనే జాతికి జ్ఞాననేత్రమైనకవికి ప్రతినిధిగా ప్రత్యేకతను ప్రకటించుకున్నారు. కనుక ఈ ఇతిహాసంలో ఆద్యంతమూ కనిపించే ప్రథమ పురుషైకవచనమైన 'నేను' శేషేంద్ర ఆత్మప్రత్యయానికి చిహ్నంకాదు.

"........సత్త్వగుణ సాధన చేతనే ఒకసమగ్ర కవి అనే చిన్న మూసలోకి సమస్త జగత్తు అనేవిశాలవస్తువు ద్రవించి ప్రవహిస్తుంది........ మనిషి స్థాయిభావములై రసములై పరిపరి విధములుగా ప్రవహిస్తున్న తరుణంలోనే కవి అవుతాడు. .... అలాకవి అయిన దశలోనే బహిర్జగత్తు అతణ్ణి ఆవహిస్తుంది. ఉపాసకుణ్ణి ఉపాస్యదైవతము ఆవహించినట్లు. ఆ దశలోజగత్తు అంతా వ్యక్తిని ఆవహించిన వైశ్విక చైతన్యానికి 'నేను' అని పేరు. జగత్తు వ్యక్తి పరస్పరాంతర్లీనమై సిద్ధించిన అద్వైత స్థితికి 'నేను' అనిపేరు"[8]

భూమిని బుజ్జగించి లలితంగా లాలించి వెన్నలాంటి మన్నుతో గోరుముద్దలు చేసి పైర్లపసినోళ్ళకు అందించే సైనికుడుగా, తన ప్రాణాలనే దేశపు సరిహద్దు కుడ్యాలుగా నిలిపే సైనికుడుగా, ఖండాంతరాలలో దేశపు జెండాలెగరేస్తూ నావలుచేసే వాడుగా, నాగరికతకు మనుగడనిచ్చే వస్త్రదాతగా, సమున్నతమైన సంస్కృతిని చాటిచెప్పే కళాకారుడుగా శ్రామికునికి ఎన్నో రూపాలు. మానవ జీవిత పొలాలన్ని దున్ని బంగారు పంటను పండించే ప్రపంచశ్రామికునికి ప్రతీక కర్షకుడు. శ్రమ వైవిధ్యాన్ననుసరించి కర్షకునికి, కార్మికునికి, పురుషుని సర్వ సృజనాత్మక కార్యకలాపాలకు ప్రేరణగానిలిచే స్త్రీకి ప్రేమికునికి, జాతికి బౌద్ధిక జీవితాన్నిచ్చి వైజ్ఞానిక నాయకత్వాన్ని నిర్వహించే కవికి 'నేను' ప్రతీకగా స్వీకరించబడింది.

"నేను దేశాన్ని దున్నేవాణ్ణి, ధాన్యానికి కాళ్ళురావాలని ఆ కాళ్ళతో పేదల ముంగిళ్ళకు నడుద్దామనే కలలు రావాలనీ ఊహల వ్యూహాలు పన్నేవాణ్ణి, దున్నినదంతా చూస్తూ దూరంగా కూర్చుంటాను. గాలికి నానిట్టూర్పులు మేతవేస్తూ...." అని కర్షకుడు తన జీవన ఘోష వినిపించాడు. "నీవు నాకు ఉంటే అడుగడుగునా వెయ్యి వీర మరణాలకు నన్ను విసిరేస్తాను. అవలీలగా నా జాతి అభ్యుదయం కోసం అలంకరించిన బలివేదిక చేరడానికి" అని ప్రేమికుడుగా బాసచేశాడు. నాదేశాన్ని రాజకీయాల బారికి అప్పగించనని కవిగా తానే నాయకత్వాన్ని స్వీకరించాలనుకున్నాడు.

ప్రాచీన సాహిత్యంలో ప్రకృతిని యథాతథంగా వర్ణించినవారే ఎక్కువ. కొందరు స్వభావోక్తులతో ప్రకృతి సొగసులను తీర్చిదిద్దగా కొందరు ఉత్ప్రేక్షలతో ఉక్తిచమత్కృతిని వెలార్చారు. భావకవులు ప్రధానంగా ప్రకృత్యుపాసనాపరులు ప్రకృతిలో మాతృమూర్తిని, ప్రణయమూర్తిని, దేవీమూర్తిని, ఆయా కవులు సందర్శించారు. అభ్యుదయకవులు ప్రకృతిలో పీడక వర్గపు క్రౌర్య కౌటిల్యా తమస్సులను, ఆ తమస్సులను హరించే పీడితవర్గపు చైతన్య సూర్యోదయాలను దర్శించారు.

ఈ ఇతిహాసంలో సూర్యుడు సృజన శక్తికి ప్రతీక. ప్రాణులకు జీవనశక్తిని ప్రసాదిస్తాడు సూర్యుడు: వాన చినుకు ఊయలలో ఊపుతాడు సూర్యుడు. బహిరంతరాల తమస్సు హరించే జగచ్చక్షువు సూర్యుడు.

"చెట్లల్లో సూర్యుడు
మేఘాల్లో సూర్యుడు
జలాల్లో సూర్యుడు

ఆకాశంలో సూర్యుడు
లోపల సూర్యుడు
వెలుపల సూర్యుడు"[9]

"లేస్తోంది ఉషఃకాంతుల్లోంచి ఒకహస్తం; ఆ హస్తం కాలమనే నిరంతర శ్రామికుని హస్తం" అనే ఇతిహాస ప్రారంభవాక్యాలు వస్తు నిర్దేశంతోపాటు కర్షకుని లోకబాంధవ్యాన్ని నిరూపిస్తున్నాయి. దినం పూర్తిగా కొల్లగొట్టి తరిమివేస్తే పడమటి పొలాలమీదుగా నిష్క్రమించే పీడితుడుగా వర్ణింపబడ్డాడు సూర్యుడు. ఉత్పత్తి కారకాలైన సుత్తెలు, కొడవళ్ళులాంటి కిరణాలను ప్రసాదించి కార్యోన్ముఖులను చేసే తేజోమూర్తి సూర్యుడు. శ్రామికలోకపు బాధా నిశిరాత్రికి స్వస్తిచెప్పి ప్రభాతాన్ని ప్రకటించడానికి తూర్పు గుడిసెమీద గొంతెత్తిన కోడిపుంజు సూర్యుడు.

మట్టిపొరలను చీల్చుకొనివచ్చి కాలపు కర్కశ పరశువుకు ఎదురొడ్డి నిలచే వృక్షము సృష్టిలో ప్రాణి తన అస్తిత్వం కోసం చేసే పోరాటానికి సజీవ సంకేతం.

"సగం పురుగు | సగం పిట్ట
ధరను చొచ్చి | దివిని విచ్చి
విరులు తాల్చు తరువు"[10]

పురుగులా వేళ్ళు మట్టిలోకి ప్రాకుతాయి. ఆకులు పిట్టలా దివిలో విచ్చుకుంటాయి. వేళ్ళతో ధరను పట్టుకొని కొమ్మలద్వారా దివిని అందుకో ప్రయత్నించే వృక్షము మానవజాతికే ఆదర్శప్రాయమైంది.

"కొమ్మలు గొడ్డళ్ళుగా
రెమ్మలు కొడవళ్ళుగా
ఆకులు బాకులుగా
పూలు ఖడ్గాలుగా
నరకబడ్డ చెట్టే ఒక
నవవిప్లవ విరాట్టుగా
విజృంభించింది
విక్రమించింది
అసుర శక్తిని ఆక్రమించింది.
....... .... .... .... .... ....
చెట్టు చైతన్యానికి చిహ్నం
ఆచెట్టుమ ప్రసవించిన అవనీస్థలిధన్యం"[11]

చెట్టు క్రమవికాసానికి, సహనానికి, ఆశ్రయత్వానికి ప్రతీక; నిలువుగా ఎదిగిన సమగ్రమూర్తి. "అనుభవతిహిమూర్ధ్నా పాదపస్తీవ్రముష్ణం, శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానాం" అన్నట్లు తానెంత పరితాపాన్ని అనుభవిస్తున్నా ఆశ్రితులను శీతలఛాయతో ఉపశమనము కలిగించే వృక్షము వంటివాడు కర్షకుడు. వినూత్నధోరణిలో వృక్షాన్ని కర్షకునికి ప్రతీకగా స్వీకరించి ఆసాంతం నిర్వహించడం ఈకవి చూపిన విశిష్టత.

మండే భూమిలోంచి ఉదయించినా చెట్లు మనిషికి మనః పూర్వకంగా నీడలిస్తున్నాయి. అయినా పొగరుబోతు ఎండ తన కండను చెట్టు చెక్కిటిమీద రుద్దుతుంది చెట్లు అంతశ్శక్తిమీద బ్రతికే మునీశ్వరులని తెలుసుకోలేక వాటి అవయవాలను నరకేయాలని చూస్తాడు క్రూరుడు. ఎన్ని బాధలు భరించినా శ్రమశక్తి ఆధారంగా బ్రతికే కర్షకుడు ఎక్కడికి వెళ్ళలేడు. తుఫానులు చుట్టుముట్టినా వేళ్ళతో ధరిత్రిని పట్టుకొని ఉండే వృక్షములా ఆ నేలకే అంకితమై మట్టిలో కలిసిపోయి నిరీక్షిస్తుంటాడు. గింజ దిగగానే చినుకుపడగానే వారు ప్రేమించిన గింజల గర్భంలో ప్రవేశిస్తారు. చెట్లవుతారు పైర్లవుతారు పళ్ళయి పంటలయి మనుమల్లో ప్రవేశిస్తారు. మనుషుల జన్మలకు మళ్ళీ బీజాలవుతారు. కనుకనే చెట్లు ఈ దేశంలో తమపిల్లలు ఎందుకు సూక్ళ్ళకుపోతున్నారని కన్నీళ్ళు కారుస్తాయి. పైర్లు రోదిస్తాయి. (ఇవన్నీ శేషేంద్ర కవితా వాక్యాలు పూర్వాపరసమన్వయం కోసం కొద్దిపాటి మార్పులు చేశాను-వ్యాస కర్త)

చెట్లు తలుపులుగా దూలాలుగా కుర్చీలుగా బల్లలుగా మానవ జీవితోపకరణాలుగా మారినట్లే శ్రమశక్తి అన్నిరంగాలలో నిర్బంధానికి గురైంది. ఉపరితల నిర్మాణంలోని వ్యవస్థల ఉక్కు కౌగిళ్ళలో బిగుసుకుపోయి ఉపకరణాలుగా మార్చబడ్డాడు శ్రామికుడు.

"చెట్లు గనక పర్వతాగ్రా లెక్కి కేకవేస్తే చెట్లు గుంపులు గుంపులుగా వస్తాయి....అన్నిదిక్కుల్నుంచి, తిరస్కార సూచకంగా తలుపులు దూలాలు ద్వారబంధాలు కుర్చీలు బల్లలు అన్నీ చెట్లుగా మారి బయటికి వస్తాయి. అరణ్యాల్లోకి పోతాయి. బానిసల్ని చేసే కర్మాగారాలన్ని కూలిపోతాయి. కర్మ ఆరిపోతుంది, కర్తపారిపోతాడు."

ఈ విధంగా చెట్టుకు శ్రామికునికి ఉన్న అవినాభావ సంబంధాన్ని అత్యంత రమణీయంగా నిబంధించుట వలన ఈ ప్రతీక సార్థకమైన సమన్వయాన్ని పొందింది.

పుష్పఫల భరితమై సస్యశ్యామలత్వానికి చిహ్నమైన వసంతం సుఖజీవన వ్యవస్థకు సంకేతం. భారతదేశంలో వాడవాడలా విప్లవ విద్యుత్తు వ్యాపించక పోవడాన్ని సూచిస్తూ 'నిరుడు వసంతం ఎక్కడికి పారిపోయిందో ఒక నదిలా అలా అలా వెళ్ళి ఏ తోపుల్లో నిదురపోయిందో నాకు తెలీదు' అన్నాడు. నిత్యం భోగాల్లో మునిగితేలే వర్గానికి సుఖాలేతప్ప కష్టాలు తెలియవు. ప్రకృతి బీభత్సానికి సహమానవుల క్రౌర్యానికి బలిఅయ్యే శ్రామికుడికి శ్రమలోని సౌందర్యం తెలుసు. సుఖజీవన మాధుర్యం తెలుసు 'వసంతం అంటే అందరికీ తెలీదు.

కోకిలల్ని కోల్పోయిన కొమ్మలకే తెలుసు. పాటల్ని కోల్పోయిన పక్షులకే తెలుసు. వసంత మంటే సంవత్సరం కన్న మొదటికల- ఈ కలలోనేను నాదేశపుశరీరం మీద నడుస్తున్నా ప్రభాత పూర్వ స్వప్నంలా. ప్రభాతపూర్వస్వప్నంలా' అనడం వలన తనస్వప్నం నిజమవుతుందని, తానాశించే సమాజం ఋజువవుతుందని ఆశాభావం వ్యక్తపరిచాడు.

పక్షి వసంతానికి నాందీగీతాలు పాడుతుంది. చెట్ల కొమ్మల లోనే గూడుకట్టుకొని కర్మఫలాలను ఆహారంగా స్వీకరించి విపుల విహాయసంలో విహరించే రెక్కల గాయకుడు పక్షి.

> "గాలిలో విమానంతో పోటీ పడుతున్న అపక్షి వట్టిపక్షి అను కోకు; అది ఎత్తులమీద కూర్చుని లేస్తూపడుతూ నడిచే మానవ నాగరకతల్ని పరికిస్తున్న ప్రాచీన పక్షి-ఏనాగరికతల్ని మనిషి తన గొప్పతనానికి ప్రతీకలుగా పతాకలుగా ఎగుర వేస్తున్నాడో చరిత్రపేజీలో ఆనాగరికతల్ని పరిశీలిస్తున్నపక్షి"

పక్షి తన చూపులతో దూరాలను కొలుస్తుంది; సమస్త ప్రపంచాన్ని సమీక్షిస్తుంది. అనుభవజ్ఞాన నేత్ర ద్వంద్వంతో మానవుని వర్తమానాన్ని అనుశీలించిగతాన్ని విశ్లేషించి కవితాశాఖ నధిరోహించి క్రాంతిగీతాల నాలపించే కోకిల స్వామికవి. పక్షిని కవికి ప్రతీకగా ప్రయోగించి అర్థమైన భావనకు సమగ్ర వ్యంజన శక్తి కల్పించాడు కవి.

అనుభూతికి ఆధారమైన వస్తు సందర్భాల వైవిధ్యాన్నను సరించి అర్థవైవిధ్యాన్ని కలిగి ఉండే ప్రతీకలు కూడా ప్రయోగింపబడ్డాయి. ఇట్టి ప్రతీకలు అస్పష్టతను కలిగించే అవకాశం లేక పోలేదు. 'కొండల నిశ్శబ్దాన్ని బొట్టుబొట్టుగా చప్పరించి', 'వాటి హృదయాలలో నిదురిస్తున్న ఏకాంతాన్ని' అనుభవించాడు కవి. అందుకే 'రూపాల కోసం నిరీక్షిస్తున్న నాదేశపు పర్వతాల్ని సింహాలుగా, ఏనుగులుగా, ఒంటెలుగా. శ్రామికులుగా వాటి మకుటాల్లాంటి ఇతిహాసాలుగా మలచదలచుకున్నా" నన్నాడు. పర్వతం చైతన్యం లేని వ్యక్తికి ప్రతీకగా చెప్పవచ్చు.

> "పర్వత శ్రేణులు ప్రభాతాన్ని ఆపగలవా ! సూర్యుడు వేయి ఖడ్గాలతో భేదించుకుంటూ దూసుతాడు. అన్ని కొండల మీదా ఎర్రకాంతుల జెండాలు నాటుతాడు."

పర్వతము స్థావరం; నిశ్చలనమైంది; ఉన్నతమైంది; విశాలమైంది. 'పర్వతము' ఒకచోట సామాన్య ప్రజలలోని నిస్తబ్ధతకు ప్రతీకగా, మరోచోట ప్రగతి విరోధుల వ్యాపకత్వానికి, సామాజికంగా వారి ఔన్నత్యానికి ప్రతీకలుగా ప్రయోగింపబడింది. ఒకే ప్రతీక తన్మూల తత్త్వానికి వైరుధ్యం కలగకుండా అర్థవైవిధ్యం స్ఫురింప జేయటం ఈ కవి నైపుణ్యం.

చలన శీలమైన గ్రహాల వలన విశ్వంలో ఏర్పడే పరిణామాల దృష్ట్యా ఈ విశ్వం యొక్క ఆయువును తెలిపే ప్రమాణం కాలం. నియతగతి గ్రహాలకు సహజ లక్షణం. వాటి గతిలో విషమత్వం విపరీత పరిణామాలను సృష్టిస్తుంది. గ్రహగతులు ప్రకృతిని ప్రభావితం చేసినట్లే మానవ జీవితాన్ని కూడా ప్రభావితం చేస్తాయని శాస్త్రీజ్ఞు నిరూపిస్తున్నారు. కనుక దీనినే 'విధి' అని, అది అనుల్లంఘనీయమైందని భావిస్తారు. ఇట్టి కాలానికి ప్రభుత్వ వ్యవస్థకు సామ్యముంది. గ్రహగతిలో విషమత్వం వినాశకారి అయినట్లే ప్రభుత్వంలోని అవ్యవస్థ అరాచకానికి దారి తీస్తుంది. కాలం యొక్క శాసకత్వ లక్షణాన్ని బట్టి 'విధి' గా అని మతగతి వలన ఏర్పడే అవ్యవస్థ దృష్ట్యా అధికార దౌర్జన్యానికి ప్రతీకలుగా గ్రహించ బడింది.

'కాలాన్ని కాగితం చేసుకొని లోకానికి స్వప్నాన్ని రాసిస్తా' నన్నాడు, 'మనిషి నగరంలో వందలాది మనుషు లెందరున్నా కాలా నిదేపైచేయి' —'కోటాను కోట్ల గడియారాల్లో దాని ఉగ్ర హస్తాల వేళ్ళు ప్రదర్శిస్తుంది, క్రూరంగా నొక్కి వేస్తుంది'— అన్ని వ్యవస్థలలోను అనుస్యూతంగా వ్యాపించి ఉండే ప్రభుత్వాధికారం మనిషిని నిర్బంధానికి గురి చేస్తుంది. అందుకోసం ఆ కాలాన్ని కొండల్లోకి ఈడ్చుకొని వచ్చి సంహరించాలన్నాడు.

'అధ్యాయాలు అధ్యాయాలుగా వీచేగాలి' ప్రవాహ శీలమైన చరిత్రకు, 'రాళ్ళు' మార్గదర్శకుడైన నాయకుడు లేని ప్రజా సమూహాలకు, 'పండ్లు' శ్రమఫలాలకు, 'దినం' సంక్షిప్తమైన వ్యక్తి జీవితానికి, 'క్షణాలు' అట్టడుగు ప్రజలకు, 'ఎండ' పీడక వర్గం యొక్క అరాచకత్వానికి, 'స్వప్నం' కవి ఆశించే ఆదర్శ సమాజానికి ప్రతీకలుగా రూపు దిద్దుకున్నాయి.

కాల ప్రభావానికి పరిణామాలు పొందే ప్రకృతిలో కర్షక జీవితాన్ని, మానవ ప్రకృతిని దర్శించి ప్రదర్శించాడు కవి. ప్రతీకలుగా దర్శనమిచ్చి అలంకార స్థాయిలో ఆగిపోయిన ప్రయోగాలు కవి ఉక్తి చమత్కృతి ఉదాహరణలుగా నిలుస్తాయి. స్థావరాలు చైతన్యారోపణ వలన అమూర్తాలు మూర్త్యారోపణ వలన మానవీకరించబడి చమత్కార కారులయ్యాయి.

> "పోయెట్రీ కెన్ నెవర్ బి ఫుల్లీ-ఎక్స్‌ప్లెయిన్‌డ్. ఇట్ కెన్ బి ఫెల్ట్, అండ్ ఇట్ కెన్ బి టాక్‌డ్ ఎబవుట్ విత్ ప్రాఫిట్ బట్ దేర్ ఈజ్ నో యూస్ వాట్ ఎవర్ ఇన్ టాకింగ్ ఎబవుట్ ఇట్ ఇఫ్ యు డోంట్ ఫీల్ ఇట్" 12

అలంకారాలను వివరించినట్లు ప్రతీకలను వివరించడం సాధ్యం కాదు. పాఠకుడు స్వయంగా ఆ ప్రతీకలను తన అనుభూతిలోకి తెచ్చుకొన్నప్పుడే వాటిలోని సౌందర్యం సాక్షాత్కరిస్తుంది. "నిజము నకు ప్రతీక వాదమునకు చెందిన కవితల సౌందర్య మంతయు నాప్రతీకల యందే నిక్షిప్తమై యుండును. వానిని విడదీసి పరిశీలించినచో తత్కావ్య గత సౌందర్యము కుంఠిత మగును" అన్నారు కె. వి. ఆర్. నరసింహంగారు. 18

"ప్రతీక, కావ్యంలో వస్తు సమన్వయానికి తోడ్పడవచ్చు. కావ్య రసా స్వాదన సౌలభ్యానికి తోడ్పవవచ్చు. వాస్తవం నుండి తప్పు కోవటానికి మార్గం కావచ్చు; అలంకారంగా శోభించవచ్చు." కథా రహితమైన ఈకావ్యంలో ప్రతీకాత్మకత భావ విశ్వాసానికి తోడ్పడింది. సంకీర్ణతకు దూరమై వస్తు సమన్వయానికి వన్నె తెచ్చాయి. అనంతమైన వ్యంజనా శక్తిని గర్భీకరించు కొని పాఠకునిలో అనుభూతిని ఆలోచనను రేపి కావ్యాన్ని ఆస్వాద యోగ్యం చేశాయి ప్రతీకలు. కవియొక్క ఆర్ష సంస్కారం అంతర్వాహినిగా గలిగిన ఈప్రతీకలు ఆధునిక ఇతిహాసంగా ఈగ్రంధాన్ని సార్ధకం చేశాయి. కవి దర్శనోద్భవ మైన ప్రతి ప్రతీక విశ్వమంత విశాల చిత్రంగా పరచుకొని పాఠకుని దృష్టిప్రసాదాన్ననుసరించి తన గాంభీర్యాన్ని వైశాల్యాన్ని శబల వర్ణ సంయోజనను ప్రదర్శిస్తుంది.

## అ ధో జ్ఞా పి క లు

1. శేషేంద్ర; సముద్రం నాపేరు, పుట. 12
2. కావ్య మీమాంస. 4-28, 29.
3. శేషేంద్ర; కవిసేన మేనిఫెస్టో, పుట 55,56.
4. ఎఫ్.సి. ప్రిస్కాట్; ది పోయెటిక్ మైండ్ పుట. 91నుండి గ్రహించాను.
5. "....ఎయిదర్ కన్‌సెప్షన్ హ్యాజ్ ఇట్స్ కరోలరీ ఇన్ ది వ్యూ దట్ సైన్స్ అండ్ పొయెట్రీ కెన్ నాట్ బోత్ బి కన్‌సెర్నెడ్ విత్ ది సేమ్ వర్ల్డ్. హెన్స్ ఎరైజెస్ ది వ్యూ దట్ పోయెట్రీ ఈజ్ కన్‌సెర్నెడ్ విత్ ది "ఇన్నర్ వర్ల్డ్." అండ్ దిన్ ఈజ్ ఎ కన్‌క్లుజన్ దట్‌గోస్ డౌన్ వెల్ విత్ ది హార్డ్-హెడెడ్ గార్డియన్స్ ఆఫ్ గుడ్ సెన్సెస్ నొ లెస్‌దాన్ విత్ లిటరరీ థీరిస్టిస్.
   సమ్‌టైమ్స్ ది ఇన్నర్ వర్ల్డ్ ఈజ్ డిస్క్రైబ్‌డ్ యాజ్‌ది "సబ్‌జెక్టివ్ యూనివర్స్" అర్ యూస్‌ది వర్ల్డ్ ఇన్ విచ్‌ది "ఔటర్" వర్ల్డ్ ఈజ్ మిర్రర్‌డ్."
   ది మెయిన్ ఆఫ్‌లైట్ (ఆన్ ది కాన్‌సెప్ట్ ఆఫ్ పొయెట్రి) పుట. 28.
6. ది పోయెటిక్ మైండ్, పుట 99
7. శేషేంద్ర; రక్తరేఖ (నా డైరీ), పుట. 78
8. శేషేంద్రతో నేను చేసిన ఇంటర్వ్యూలో ఒక ప్రశ్నకు ఇచ్చి జవాబులోని కొంత భాగం - ఆ ప్రశ్న జవాబు ఈ క్రిందివి
   నేను : 'నా దేశం నా ప్రజలు' లో నేను దేనికి ప్రతీకగా భావించవచ్చు ?
   శేషేంద్ర ; నాదేశం నా ప్రజలు' లో నేను అనే ప్రయోగం కవ్యవస్థిత వ్యక్తిగత అహంకారార్థ ప్రతిపాదకం కాదు. ఈ సంగతి కావ్య తత్త్వ కోవిదులైనవారికి గోచరిస్తుంది. 'నేను' నా సర్వమానవ బాధాబోధకమైన ఒక బృహత్ చైతన్య చిహ్నము. ఒక వైశ్విక ప్రతీక.
   తనమీద బహిర్జగత్తు యొక్క అనుభూతిని ఆరోపించుకొన గలుగుశక్తిని సత్త్వమని మనదేశపు కావ్యవేత్తలు పేర్కొన్నారు. ఈ సత్త్వగుణ సాధన చేతనే ఒక సమగ్ర కవి అనే చిన్న మూసలోకి సమస్త జగత్తు అనే విశాల వస్తువు ద్రవించి ప్రవహిస్తుంది. జగత్తు ద్రవించి ప్రవహించడం కవిలోకే గానీ తత్పూర్వావస్థలో కేవల రక్తమాంసాకృతి ఉన్న మనిషిలోకి గాదు. వాల్మీకి చెప్పిన "కరుణవేదిత్వాత్" మనిషి స్థాయి భావ ములై రసములై పరిపరి విధముల ప్రవహిస్తున్న తరుణంలోనే కవి అవుతాడు; వ్యావహారికస్థితిలో మనిషిగా ఉంటాడు. అలా అయిన దశలోనే బహిర్జగత్తు అతడ్ని ఆవహిస్తుంది. ఉపాసకుడ్ని ఉపాసదైవతము ఆవహించినట్లు. ఆ దశలో జగత్తు అంతా వ్యక్తిని ఆవహించిన వైశ్విక చైతన్యానికి నేను అని పేరు.
   దాన్నే శారదా తనయుడు తన 'భావప్రకాశం'లో "పరస్య సుఖదుఃఖాదేః అనుభవేన చేతసః తద్భావ భావనం యేన భవేత్తదను కూలతఃత త్త్వత్వః" అన్నాడు మరోచోట "అహంకారస్య వృత్తిః మాసోఽభిమానా ప్రకీర్తితః, సోఽభిమానాత్మికా వృత్తిః తత్తదింద్రియగోచరా బాహ్యార్థాలంబవతీ శృంగారాది రసాత్మతాం యాతి" అని వివరించాడు, తద్భావ భావన సాధక మైన సత్త్వమే అహంకారవృత్తి. అదే అభిమానము. నేను అని స్పృహలేని వాళ్ళయిన కోటాదికోట్ల మానవులు సామాన్య జీవనశృంఖలాబద్ధులై నిష్క్రియులుగా నిష్క్రమిస్తారు. లోకం నుంచి. కాని నేను అన్న ఆత్మచైతన్య మున్న కతిపయ మానవులు ఎక్కడా వెనుకంజవేయక ముందుకుపోయి అన్ని వస్తువుల్లో అన్ని విషయాల్లో అన్ని సమస్యల్లో ఇరుక్కొని తదంతర్నిమగ్నులై పోతారు. తమని తాము కోల్పోతారు.
   అర్థాత్ - నేను అనే శబ్దముచేత సంకేతింపబడుతున్నది 'కరుణ వేదిత్వము' లక్షణంగా గల సత్త్వగుణార్థ ప్రతిపాదకమైన

చైతన్యము-సాధనచేత కవి తనకూ జగత్తుకూ మధ్య సాధించిన అభిన్నతకు నేను ఒకశబ్దమాత్ర సంకేతము. కవి తపస్సిద్ధిగా పొందిన తాదాత్మ్య చైతన్యమే 'నేను'.

'నాదేశం నాప్రజలు' లో 'నేను కళ్ళు తెరిచి ఆవులిస్తూ లేస్తా' అన్న పంక్తినుంచి 'రగిలే ఎర్రకోరిక ఒకజెండాగా' అనే అంతిమ పంక్తిదాకా మొదటి రచనాఖండికలో 'నేను' అనే తాదాత్మ్య చైతన్య ప్రతీకకు అంకురారోపణ జరిగింది. తర్వాత వచ్చే అన్ని సర్గల్లో విస్తరించుకుంటూపోయిన దాని పరిణామ క్రియా స్వరూపమే నాదేశం నాప్రజలు అనే కావ్యాకృతి.

9. శేషేన్ద్ర: మండేసూర్యుడు (ఇండియన్ లాంగ్వేజెస్‌ఫోరమ్ ప్రచురణ) పుట. 54.
10. ఇస్మాయిల్: చెట్టు నాఆదర్శం, పుట. 6.
11. సి. నారాయణరెడ్డి: మంటలూ మానవుడూ, పుట. 12
12. జేమ్స్‌రీవ్స్: అండర్ స్టాండింగ్ పోయెట్రి, పుట. 12
13. ఆధునికాంధ్ర కవితాసమీక్ష, పుట. 690.
14. జి.వి. సుబ్రహ్మణ్యం (వ్యాసరచయిత- సంపా);అంతర్వ్యాక్తి- అభివ్యక్తి (వ్యా) చైతన్యశిఖరం, పుట. 38.

"పెన్నాశిరాక్స్"

# "అండజయాన"

అల్లసానిపెద్దనామాత్యుని స్వారోచిషమను సంభవము (మనుచరిత్ర)ను గురించి వినని తెలుగుచదువరులుండరు. సంపూర్ణ గ్రంథము కాకున్నను ప్రవరవరూధినుల (నాయికా మాత్రనిష్ఠము) కావుటచే రసాభాసాంతమయిన ప్రణయ వృత్తాంతముగల మొదటిరెండా శ్వాసములు చదివినవారు చాలమంది యుందురు. అస్మదాదులును పఠన పాఠనమార్గమున కొంత పరిశీలనముతో చదివినవారే. ఈనడుమనే ఇచట (ఉత్తర అమెరికాలోని చికాగోనగరమందలి) ఆంధ్రమిత్రులు మనుచరిత్రను గురించి ముచ్చటింపుడని అడుగుగా, ఎవరియొద్దనోగల తంజావూరి తేవప్పెరుమాళ్లయ్యగారి వ్యాఖ్యానముతోనున్న ప్రతిని తెచ్చి, పునఃగ్రంథావలోకనము చేయగలిగితిని.

గత ఏబది సంవత్సరములలో పదిపదేనుమార్లయినను ఈరెండా శ్వాసములు చదివియుందును. కాని మొన్నటి పునరాలోచనమున తట్టిన కొన్నివిషయములను పాఠకుల దృష్టికి తేవలయునని ఇది వ్రాయుట. ఇచటి సభలో ముచ్చటించినది భారతదేశమందలి ఆంధ్ర సోదరులకును తెలుపుట బాగుండునను అభిలాష మిత్రులు ప్రకటించగా తెలుపుదును.

1. 'కరేణు'— 'అటచనికాంచె——' అను ద్వితీయాశ్వాసమునందలి హిమవత్‌పర్వతవర్ణనమగు పద్యముఎందరికోకంఠస్థము అందలి కడపటి పాదమునగల 'కటకచరత్ కరేణుకర కంపితసాలము. అను ముక్క—నుగమనింతము. ఇందొక ధ్వని సంగతభావము స్ఫురించు చున్నది 'కరేణు' వనగా ఆడుఏనుగు ప్రవరుడు శ్రోత్రియ బ్రాహ్మణుడు. సాలవృక్షమువలె పాతుకొనిపోయిన కర్మనిష్ఠకలవాడు. వరూధిని అతనిని కదిపిచూచినది. అతని శ్రోత్రియత పెల్లగింప బడలేదు కంపించినది ప్రకృతమయిన వృక్షముమాత్రమే, వరూధిని యనిధ్వనించు 'కరేణు' శబ్దప్రయోగము నందొక ప్రత్యేక తాత్పర్యము పెద్దనకుండి యుండును. లేనిచో 'కరీంద్ర', 'మదేభ' వంటి మరొకటి ప్రయోగించి యుండవచ్చునుగదా!

2. 'జనాన్వితము'— 'మగువ పొలుపు తెలుపు నొక్క—మారుతమెలసెన్' ఇవి కవిమాటలు. ప్రవరున కది స్త్రీగాలియని తెలిసినచో అటుపోవుటకు సందియ పడెడువాడేమో! 'జనాన్వితమిచ్చో' టనియే సాగినాడు, అతని ఘ్రాణేంద్రియమునకట్లు తోచకయే ఇచట కవ్యుక్తికిని, కవికల్పిత పాత్రోక్తికిని (ఆనందవర్ధనుడు వివరించిన రీతిని) గల భేదము గ్రహింపనగును.

3. "భీతహరిణేక్షణ"— దీని ముందటి పద్యములో చెప్పినట్లు 'విభ్రాంతుడై' 'ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ' అని ప్రవరుడు ప్రశ్నించును. కవిదృష్టిలో ఆ భీతహరిణేక్షణత్వము వరూధినీ సౌందర్య వర్ణనము కావచ్చు. కాని ప్రవరుని దృష్టిలో ఒంటరిగా ఘనభూమిని భయములేకుండ తిరుగుచుంటివాయె, క్రొత్తవానిని నన్నుచూచి బెదరు చెందకుమా అన్న ధ్వనిభావము ఈ సంబోధనమున గ్రహింపనగును.

4. "అండజయాన" అని సంబోధించుచు, నీ కుటీరము నకు వచ్చిన నొకటియు, రాకున్న నొకటియుకాదు అని ప్రవరుడనును. 'హంసవంటి నడకకలదానా, అని ఆమెను పొగడునా ఈశ్రోత్రియుడు. మణివితర్దిక మీదినుండి లేచి ఎదురు వచ్చినదేగాని వెన్నుచూపలేదుగదా, ఆమె పృష్ఠతః తనయందము నాతనికి కనబరచుట కయినను. ఋష్యశృంగునివంటి అతనికా దృష్టియే ఉండదుగదా! మరిపెద్దన ఈ 'అండజయాన' అను సంబోధనము ప్రవరునినోట ఎందుకనిపించినట్లు? పైకి మంచిమాటలు పలికి, తన ఊరికి దారితెలిసికోవలెనని అతనికి ఉండబట్టియా ?

ఇంత మాత్రమేకాదు. 'అండజము' అను పదమునకు 'పాము' అనికూడా అర్థము. పామువంటి వక్రగతి కలదానవు, నన్ను వక్ర మార్గమున త్రిప్పజూడకు మనిధ్వని. ఈ శ్లేషమూలకమయిన ధ్వని కవి హృదయమయినట్లు తోచెడిని.

5. ఇతరసంబోధనలు:— అసలీ ఘట్టమంతటిలోను, వరూధినిని ప్రవరుడు సంబోధించిన పదములివి; 'భీతహరిణేక్షణ', 'అండజయాన', 'తల్లి', 'వనజేక్షణ', 'జలజాక్షి', 'తరుణీ' అని, 'తల్లి' అనుటలో 'కన్నుదోయికి నన్యకాంతలడ్డం బైన మాతృభావనసేసి మరలువాడు' అను ప్రహ్లాదప్రవృత్తి కూడ ద్యోతితము. ప్రవరుని దృష్టి ఆమెముఖమునందే కలదు, తన ఊరికిదారి ఆమె ముఖతః పలుకవలయును గనుక. అందు చేతనే 'వనజేక్షణ', 'జలజాక్షి' అని కవి అనిపించుట. ఇక'తరుణీ' అన్నపట్టున, నీవుచిన్నదానవు, అగ్నికార్యములు, తన్మహిమములు నీకు తెలియనివి అనిచెప్పు తరువాతి వాక్యమునకు ప్రోద్బలకము.

6. ఆశ్వాసాంతపద్యము (ల)లో కూడ ధ్వని కలదని నా ఊహ. సుమారు 35 సం॥ల క్రితము 'మనుచరిత్ర—ఆశ్వాసాంత పద్యములు' అను శీర్షికతో 'భారతి' లో ఒక వ్యాసము వ్రాసితిని. అందు, పూర్వాపరా శ్వాసములందలి కథాంశములను కలుపుకొనుచు కూడ కృతికర్త కృతి పతియగు శ్రీకృష్ణ దేవరాయల స్తుతి పరక మగు పద్యములు రచించి యుండునని తెల్పినారు. వెంటనే ఆ కాల ములో మద్రాసులో పని చేయుచున్న నన్ను తత్రత్యులగు [కీ॥ శే॥లు] శ్రీ గిడుగు సీతాపతి గారును, శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ గారును, ఇది పెద్దన ఇట్లు కావలెనని వ్రాసినాడా, కాక ఇది కల్పనయా అని అడిగినారు. అప్పుడు వారికి నా సమాధాన మేమనగా. ఏ కవియును ఇది యీ పద్యభాగములందలి ధ్వని అని చెప్పుకొనడు, ఒక్కొక్క పుడు అనూహితమైన భావములు ధ్వని మార్గమున, రచయితకును, పఠితలకును తోచును, ఇందులకు ప్రాక్ ప్రతీచీ సాహిత్యముల నుండి ఉదాహరణములు లభించును అని.

ఈ సందర్భమున ద్వితీయా శ్వాసాంతమున గల యీ పద్య మును చూడుడు

"బిసరుహనయనానవవిధ,
కుసుమాయుధ, అవధి కుధరకూటాంచలభూ,
విస్మమర తేజశ్చంపక,
భసల దనత్ కీర్తి మలిన పరిపంధి నృపా॥"

తామరల వంటి కన్నులు గల స్త్రీలకు నవమన్మధుని వంటి ఓరాజా, దిగంతములకు వ్యాపించిన నీ తేజస్సు అనెడి సంపంగి వాసనకు, నీ శత్రురాజుల అపకీర్తి యనెడు (నల్లని) తుమ్మెదల గుంపు నిలువలేదు అని తాత్పర్యము, ఇందు వరూధిని కంటికి మన్మధాకారుడయిన ప్రవ రుడును, అతని శ్రోత్రియత ముందు వీగి పోయిన వరూధిని ప్రణయా చేష్టితము లును, ధ్వనించుచున్నవని నా నమ్మకము ఇప్పటికిని. ఇది కవి సమయమూలకమయినదే అయినను'నానా సూనవితానవాసనల' అన్న రామరాజ భూషణుని సుప్రసిద్ధ పద్యమునకు ప్రేరక మనిపిం చును.

ఇట్లే తరచి చూచిన మనుచరిత్రాది గ్రంధములలో ఇతః పూర్వము గోచరింపని ధ్వనులు తోచునని అనిపించును. పైవివరణ లకు చదువరులే ప్రమాణము.

శ్రీ కోట సుందరరామశర్మ

# నెల్లూరు జిల్లా గ్రామనామములు ఒక పరిశీలన-

డిసెంబరు - జనవరి.(85) నెలలో వెలువడిన భారతిసంచికలో పైశీర్షికతో- డా. ఎ. విజయదత్తాత్రేయశర్మగారు నెల్లూరుజిల్లా గ్రామ నామములను గూర్చిచాలా పరిశోధనచేసి వ్యాసంవ్రాశారు అనుటలో సందియంలేదు. కాని11వ పొరటలో- 'రెడ్డి'అనుశీర్షికింద 'రెడ్డిరాజ్య స్థాపకుడైన......అని ప్రారంభముచేసి. శ్రీగిరిరెడ్డి రెండవకుమారుడు శివలింగ(గా)రెడ్డి-లింగసముద్రం(రా) లింగంపాడుగ్రామ నామకారకుకు కావచ్చును, అనివ్రాశారు. ఇదిపొరపాటు. అసలు "లింగసముద్రము" నేడు ప్రకాశంజిల్లాలోకలదు. పదిసంవత్సరములకు పూర్వం నెల్లూరు జిల్లాదే. కాని వ్యాసరచయిత ఇప్పుడు కర్నూలులోయున్నారు. కాన, సవరించికోగలరని మనవి.

ఇక'లింగసముద్రం' శివలింగారెడ్డి పేరుతోకట్టినదికాదు. దీని పుట్టుపూర్వోత్తరములిట్లు తెలియుచున్నవి. కావలితాలూకాలో ఒక కుగ్రామమున జంగమకులస్తురాలైన లింగమాంబయను యువతి యుండెను. ఆనాటిపాలకుడైన జమీన్‌దారుగారు తన పర్యటనలోనీ గ్రామము వెళ్ళుటతటస్థించినది. ఆమెను చూచినరాజుగారు ఆమెపాణి గ్రహణము చేయతలచిరి. అదిసాధ్యపడలేదు. అంత ఆమె గుట్టుమట్టు తెలిసికొనిరమ్మని చారులను పంపగ వారువెళ్ళి వివరాలు తెలిసికొనిరాగా. రాజు ఆమెను తీసుకురమ్మని ఏవిధముగనైనను చెప్పిపంప వారు రాత్రి నిదురించు సమయమున రహస్యముగ మంచముతోకూడా మోసికొని వచ్చుచుండిరి. కొంతవడికి మెలకువరాగా. ఇదేమోమోసమని భావించి మధ్యమార్గముననున్న చింతకొమ్మ పట్టుకొని, ఆచెట్టుపైఆరాత్రి వేగించి, అక్కడనున్న గ్రామమును మరునాడు చేరినది. వట్టిమంచమును మోసుకొనిపోయిచుండి'కి చేరిరి ఆమెలేదు. ఆచూకీ తీయగా ఆ కుగ్రామమున నున్నట్లు తెలిసి రాజావారే స్వయముగ వచ్చి నన్ను వివాహమాడ వలసినదని- బలాత్కరించినారు. అందులకామె యుక్తిగ నాకు సంవత్సరకాలము ఆవ్రతముపూర్తికాగానే అనిచెప్ప రాజుసమ్మతించెను. ఆవ్రతము ఈ గ్రామమున నా పేర నొక్కచెరువు నిర్మింపవలయును ధనము పంపుమనపంపినారు. ఆద్రవ్యమంతయు వెచ్చించి-'లింగమాంబ చెరువు' అను పేరత్రవ్వించిరి.సంవత్సరము పూర్తికావచ్చినది.అన్నమాట ప్రకారం రాజావారు వత్తురని భయపడి- ఆమహాసాధ్వి. ప్రజాక్షేమము

కోరి- ముసలమ్మవలె- పుట్టినిల్లు మెట్టినిల్లు యశశ్చంద్రికలనింపిన- నారాయణమ్మ పేరంటాలువలె. ఆ చెరువుతూముపై కూర్చుండి. మట్టి పోయించికొని- సజీవ సమాధియైనది. కట్ట పూర్తియైనది. అప్పటినుండి ఆ చెరువుకు 'లింగమాంబ చెరువను శాశ్వతనామ మేర్పడినది.

ఇప్పటికిని ఆ లింగసముద్రములో ఆమె దేవాలయము కలదు. ప్రతిసంవత్సరమును- పర్వదినములలో నుత్సవము చేయుచున్నారు. సాధ్వులచెర పట్టతలంచు ఈ నరరూప రావణాసురుల బారినుండి తప్పించుకొనుటకు- వారిపతివ్రతాగ్నియే సాధనము. ఇట్టిపతివ్రతా మణులకు- భరతఖండము పెట్టినదిపేరు——.

ఇది లింగసముద్రగాథ——.

ఇట్లే- ఈతాలూకా చాలాగ్రామాలకు వింతగాథలు కలవు- కొండమరసుపాళెం,ఇది రాయసం కొండ మరుసయ్యగారి పేరవెలసినది. నేడు- కొండముచ్చుపాళెం అని జనవ్యవహారము. ఆ పుణ్యపురుషుని పేరు చాటైనది. "కొండికంరుకూరు" ఒక జమీందారి ఉంపుడుకత్తె పేరవెలసిన దీనామము. ఇలవరము ఇల్వలవాతాపులుండు ప్రదేశమని చెప్పుచున్నారు. ఇదిక్రమము ఇలవరమైనది.

ఇట్లా నేడు చాలాగ్రామముల పేర్లమారిపోయి అసలుపేరు కను మరుగగుచున్నది. ఇక పరిశీలన చేయువారైనను-ఎక్కడోకూర్చొని పరిశోధనచేయక దయయుంచి ఆ ప్రాంతమునకు వచ్చి పరిశీలించి పెద్దలపిన్నల మాటలను స్వీకరించి తమ పరిశోధనలను ప్రారంభము చేయుమని మనవి.

నేను పదిసంవత్సరములుగ 'కందుకూరు సీమచరిత్ర'యను పేరప్రతిగ్రామమును గూర్చి శాసనాధారములతో వ్రాయుచున్నాను.

విద్వాన్- కొమాండూరి రామానుజాచార్యులు
కందుకూరు

# లేఖలు

## వాస్తవం

1984-85 సం॥ డిసెంబర్ జనవరి, భారతి- లేఖలు శీర్షికలో- 1984సం॥ అక్టోబర్ భారతిలో ప్రచురింపబడిన నా వ్యాసంలోని 'పెరవలి'ని పురస్కరించుకొని శ్రీ'తి' గారు ఇలావ్రాసారు."గుంటూరు లోని "పెరవలి"ని పై ప్రపంచంతో సంబంధంలేని ఏ ముసలవ్వలో తప్ప ఇప్పుడా గ్రామమును 'పెరవలి' అని ఎవ్వరూ అనరు.'పేర్వాలి' నామం స్థిరపడిపోయిందన్నారు శర్మగారు."

నా వ్యాసంలో శ్రీ'తి'గారు వ్యాఖ్యానించుకొనదలచిన భాగాన్నేనా కొంచెం తీరుబడిగా పరికించి వుంటే వారు పై విధంగా వ్రాసి ఉండరనుకుంటాను. కాస్తనిదానంగా చూసి వుంటే పై వాక్యాలు 'కొటేషన్' మార్కుల మధ్య కుదురుకొని వున్నట్లు గమనించి వుండే వారు. ఆ పైన, తరువాయి సంచికలో వ్యాసం పూర్తి అయిన పిదప గల అధోజ్ఞాపికలను సంప్రదించివుంటే ఆ వాక్యాలకర్తను నేను కాదని అవి, స్వర్గీయ పాలగుమ్మి పద్మరాజుగారి రెండవఅశోకుని మూణ్నాళ్ళ పాలన (ఎమెస్కో, సికింద్రాబాద్, 1969పు 5,6లో సదరు రచయిత ఒకానొక పాత్ర స్వభావాన్ని (ని)రూపించడానికి వ్రాసినవని గ్రహించి వుండేవారు.

కర్నూలు, అనంతపురంజిల్లాలలోనే కాక పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలోనూ ఓ[1] 'పెరవలి' ఉంది నిజానికి పద్మ రాజుగారు తమ నవల్లో ప్రస్తావించింది ఆ పెరవలిని గురించే... నేను సందర్భావాసరానుసారం ఆ వ్యాకాల్ని గుంటూరుజిల్లాకు సంబంధించిన వ్యాసంలో వాడుకున్నాను. పోతే, 'పెరవలి'ని గూర్చిన పురాణ కథ కర్నూలు జిల్లాలోగల 'పెరవలి'కి కూడా అన్వయించబడింది. ఈ విషయం ఇటీవలె కర్నూలులో జరిగిన ఆంధ్రప్రదేశ్ చరిత్ర సదస్సులో నేను సమర్పించిన 'కర్నూలు జిల్లా గ్రామనామముల పరి శీలన వ్యాసంలో సూచించి వున్నాను. కాలగతిని ఆ వ్యాసం అచ్చు కెక్కవచ్చు.

ఇక, నాకు తెలిసినంతవరకు అనంతపురం జిల్లా స్థలనామ శాస్త్ర పరిశోధనకు గురి కాలేదు అనటం వాస్తవం కాదు. నాగార్జున విశ్వ విద్యాలయం, తెలుగు శాఖలో రీడర్‌గా వున్న డా॥ యార్లగడ్డ బాలగంగాధర రావుగారు(ఉపాధ్యక్షులు, భారతీయ స్థలనామ పరిశోధనా సంస్థ) ఆ విషయమై సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి పరమోన్నత పట్టభద్రులయ్యారు.

డా. ఎ. విజయ దత్తాత్రేయ శర్మ
విజయనగరం

## 'పొరబడి' యతియా ?

ఏప్రెల్ 'భారతి'లో శ్రీబులుసు వెంకటేశ్వర్లు రచించిన క్రోధ నాష్టకమును చదివి వ్రాస్తున్నాను.

ఈనాడు ఏపాఠకులూ,ఏ సంపాదకులూ ఛందోబద్ధసాహిత్యాన్ని అందించమని బలవంతం చేయడంలేదు. కేవలం ఛందస్సు మీదగౌరవం ఉన్న కవులు, దానిపై అభిమానం అభిలాష కలవారు మాత్రమే ఆ విధమైన కవిత్వాలు రచించుటకు ఉద్యమిస్తున్నారు. ఛందోనియము మీద గౌరవం లేనివారు వ్రాయాల్సిన అగత్యమేమీ లేదు. కాని నియమాల నుల్లంఘించి మేమూ ఛందస్సుతో వ్రాస్తున్నాం అనిసంతృప్తి పడడంతో సారస్యమేలేదు.

అందులోనూ మహాపండితులు, పండితులకే ఆదర్శప్రాయులు నైన శ్రీబులుసుగారు ఛందస్సునిలా అలుసుగా చూడటం మరింత బాధా కరమైన విషయము. అందులోనూ అటువంటి పొరపాటును గమనించ కుండా 'విశుద్ధ సాహిత్య విభూషిత'యని పేరుగాంచిన 'భారతి'లో ప్రచురించుట ఆశ్చర్యదాయకమైన విషయము.

క్రోధనాష్టకములో ఏడవ పద్యమైన ఉత్పలమాలలో, చివరి పాదములో "క్రోధన భారతావనిని నింపుము, సర్వధన ప్రపూర్ణతన్ అనివ్రాశారు. అందులో 'క్రో' కును 'నిం' కును యతిమైత్రి ఏవిధంగా ఘటిల్లుతుందో దేవునికెరుక! హల్లుమైత్రి నటుంచి, స్వరమైత్రియే చెల్లనంటోంది.

ఇది పొరపాటుపడి వ్రాసినదా? లేక నిర్లక్ష్యంతో వ్రాసినదా ? లేక ఇదేదైనా "పొరబడి" యనబడుకొత్త (వడి)యతియా? పాటిస్తే అన్ని నియమాలు పాటించి పరిపూర్ణంగా వ్రాయాలి- లేకుంటే- వది లేయాలి. ఇలా ఉభయభ్రష్టత్వం చేయరాదు.

గాదిరాజు మధుసూదన రాజు
కర్నూలు

# గ్రంథ విమర్శలు

## శ్రీగుణరత్న కోశము

[తెలుగు వ్యాఖ్యాత : శ్రీ కె. వి. ఆర్. నరసింహాచార్యులు ప్రతులకు : శ్రీమతి కె. పద్మావతి 4-4-18 యడవల్లివారి వీధి అగ్రహారం-ఏలూరు మూల్యము : రు : 25-00]

శ్రీపరాశరభట్టర్ సంస్కృత శ్లోకాలు అరవై ఒకటి వాటికి సంస్కృత వ్యాఖ్య శ్రీ వీరరాఘవాచార్యకృత 'వసురాశి'

ప్రతి పదార్థ తాత్పర్య విశేషవివరాలు శ్రీ నరసింహాచార్యుల వారివి.

దీనియందు 'శ్రీసూక్తం' విష్ణు పురాణమునందలి ఇంద్రకృత శ్రీస్తుతి ఆదినే ఉన్నాయి.

తెలుగు వ్యాఖ్య పేరు రత్నదీపిక.

శ్రీపరాశరభట్టరు పితృపాదులు 'కూరత్తాళ్వారు' పరాశరభట్టార కులు శ్రీ రంగనాధుని పురోహితులుగా ఉండేవారట. ఆయన హయాం లోనే ఆ ఆలయం అభివృద్ధిలోనికి వచ్చిందని ప్రసిద్ధి.

శ్రీదేవి యొక్క గుణాలనే రత్నాలకు భాండాగారం అని గ్రంథనామమునకు అర్థం. లక్ష్మీదేవిని భజించే పద్ధతిలో వేదాంత దేశికుల శ్రీస్తుతి వేంకటాధ్వరి లక్ష్మీసహస్రం ప్రసిద్ధములు. అలాగే అద్వైత మత స్థాపకుడైన శంకరభగవత్పాదుల' కనకధారా స్తవం చాలా ప్రసిద్ధం.

ఈ కావ్యానికి సంస్కృతములోనూ తమిళంలోనూ వ్యాఖ్య లున్నాయి. వాటిలో యిందు చేర్చిన 'వసురాశి : అన్నివిధాలా పటిష్ఠ మైనదిగా భావించి తెలుగు వ్యాఖ్యాత కృతార్థులైనారు.

ఆచార్యులవారి తెలుగు సున్నితంగా ఉంది. విశేష వివరణ ఆయన విద్వత్తుకి మణిదర్పణముగా ఉందని నా అభిప్రాయం.

లక్ష్మీనారాయణుల దాంపత్యం సర్వలోక సంస్తుత్యం. కాబట్టి ఆమెను స్తుతిస్తే ఆయనను కూడా స్తుతించినట్టే అవుతుంది.

'ఆస్యేశానా జగత ఇతితే' - ఇత్యాదిగా గల 18వ శ్లోకానికి సంబంధించి నరసింహాచార్యుల వారిచ్చిన విషయ వివరం, సంస్కృత వ్యాఖ్య యీ గ్రంథముయొక్క మహిమనూ హృదయాన్నీ చక్కగ చూపుతూంది. కట్టె, కొట్టె- అనే పొడిమాటలతో చెప్పడం భావ్యం కాదనీ యీ మహనీయ కృతిని శ్రద్ధాభక్తులతో పఠించి శ్రీ కృపా పాత్రులు కావాలనీ కోరుతున్నాను.

ముఖపత్ర చిత్రం ఎంత మనోజ్ఞంగా ఉందో వెనుకటి అట్టపై ఆచార్యులవారుదాహరించిన శ్లోకమూ ఆయన తాత్పర్యమూ అంత మృదు మధురంగా ఉన్నాయి.

శ్రీ మాన్ కిడాంబి వెంకటాచార్య స్వామివారి 'ఆముఖం' మూల కృతికి రత్న కిరీట ద్యుతులు సంతరిస్తూంది.

ఈ మహనీయకృతి ముద్రణకు ఆర్థికంగా చేయూత ఇచ్చిన తిరుమల తిరుపతి దేవస్థాన కార్య నిర్వాహకులూ ధర్మ కర్తృత్వ యాజమాన్యమూ మహోపకృతి చేశారని అభినందిస్తున్నాను.

## శ్రీ దేవలమహర్షి చరిత్ర

( వచన దేవాంగపురాణం )

[రచన: శ్రీ కడెము వేంకటసుబ్బారావు, ప్రతులకు: శ్రీ గుత్తి నాగేశ్వరరావు వేటపాలెం- 523 187 చీరాల తాలూకా: ప్రకాశంజిల్లా లేదా రచయితపేర, పందిళ్లపల్లి- చీరాలతాలూకా ప్రకాశంజిల్లా. వెల:రూ:15/-

వ్యాస ప్రోక్తమైన బ్రహ్మాండ పురాణము నందలి బ్రహ్మ నారద సంవాదాత్మకమైన 29 అధ్యాయాల గ్రంథం దేవాంగ పురాణం. దేవాంగ జాతికి మూల పురుషుడు దేవలుడు. దేవ మానవాది జాతుల మాన రక్షణకు, అవయవాచ్ఛాదనకు వస్త్రాలను సృష్టించి బ్రాహ్మణ్య ప్రాప్తికై గాయత్రి సూత్రాలను కూడా సృష్టించి దేవలుడు బ్రహ్మ అయ్యాడు.

రాక్షసుల బారినుంచి దేవలుణ్ణి రక్షించడానికి ఆది పరాశక్తి సూర్య ప్రభాభాసమానమైన దివ్యచూడము (కిరీటము)తో అవతరించి రాక్షసులను చంపి దేవలుణ్ణి రక్షించింది. అప్పుడు బ్రహ్మాది దేవతలు వచ్చి అమ్మవారికి చూడాంబ,చౌడేశ్వరి, చాముండేశ్వరి అని కీర్తించారు. ఆ దేవి శిరస్సుపైన నున్న దివ్య కిరీటాన్ని బట్టి 'చౌడేశ్వరి' అనేపేరు సార్థకమైంది. దేవాంగులకు ఆమె కులదేవత.

సువర్ణలత, సువర్ణలక్ష్మి, లక్ష్మీనారాయణ-అనే తన పిల్లలకు గ్రంథకర్త యీ గ్రంథ విషయాన్ని చెప్పి నట్టుగా వ్రాసిన వింత పుంత చమత్కృతికీ సరసాకృతికీ పునాదిగా ఉంది.

చిత్ర విచిత్రములైన సంఘటనలతో బిగువైన శైలితో మెతుపుల్లాంటి తెలుగు పలుకులతో ఉత్సాహాన్ని కలిగించే భాగవతులతో రచన ఇంకొకమారు చదవాలనిపిస్తుంది.

దీనియందు చివరి భాగం దేవలుని సప్తావతారాలకి సంబంధించినది. చదివితే ఆనందమూ దానినిమించి ఆశ్చర్యమూ కలుగుతుంది.

యజ్ఞోపవీత ప్రదాత దేవలుడు, కాబట్టి దేవాంగులు యజ్ఞోపవీత ధారులై ఉంటారు., ఉండాలి.

సర్వే సర్వత్ర చదవవలసే ఆర్ష పౌరాణిక గ్రంథం.

## శ్రీ గురు చరిత్రము (జ్ఞాన కాండము)

[ఆంధ్రానువాదము: శ్రీ మేడవరం మల్లికార్జునశర్మ; ప్రతులకు: ఎం. ఆర్. మణి; 1-45-రాజవీధి; లేపాక్షి-515 331; అనంతపురం జిల్లా మూల్యము: రు. 9-00

దత్తాత్రేయుని లీలావతారాలనూ వాటి మహిమనూ చెప్పే గ్రంథం ఇది. జ్ఞానకాండము, కర్మకాండము, భక్తికాండము - అని మూడు భాగాలు. వాటిలో ప్రథమమైన జ్ఞానకాండం ఇది.

దీనిని ప్రప్రథమంగా మహారాష్ట్ర భాషలో శ్రీ గంగాధర సరస్వతి రచించగా సంస్కృతీకరించిన మహానుభావుడు శ్రీ వాసుదేవానంద సరస్వతీ స్వామి. దానికి ప్రామాణికమైన తెలుగుసేత ఇది.

'సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం
నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః'-

'ముక్తిఅనగా చావుకాదు. బ్రతికిఉండగానే అనుభవించెడి శాశ్వతసంపూర్ణ పరమానందస్థితి. దానికే జీవన్ముక్తి అనిపేరు-'

సద్గ్రంథమనగా సత్‌నుగురించి చెప్పెడి గ్రంథము. సత్తు,చిత్తు, ఆనందము అను మూడింటియొక్క కలయికయే త్రిమూర్తిస్వరూపమైన దత్తాత్రేయ మహస్సు. ఆ దత్తాత్రేయా విర్భూతియే శ్రీపాద శ్రీవల్లభ స్వామి, శ్రీ నరసింహ సరస్వతీస్వామి. ఈరెండవతారముల లీలా విభూతియే' శ్రీ గురుచరిత్ర.

దీనిని శ్రద్ధాభక్తులతో చదివినా విన్నా పారాయణచేసినా సత్సాంగత్యం, సత్సాంగత్యఫలం కలుగుతాయి. ఇష్టకామ్యార్థసిద్ధి అవుతుంది. ఆరోగ్యం, బుద్ధి వికాసం కలుగుతాయి.

ఈ పవిత్రగ్రంథ ముద్రణకు శ్రీ కాంచీపుర కామకోటి పీఠాధిపతుల ప్రోత్సాహం లభించగా

శ్రీ తిరుమల తిరుపతిదేవస్థానం కార్యనిర్వాహక, ధర్మకర్తృత్వ యాజమాన్యం సమర్పించిన ఆర్థికసహాయం మరింత సాఫల్యం కలిగించింది.

తెలుగువారు తప్పక చదవవలసినదిది అని నా అభిప్రాయం. కారణం? దత్తాత్రేయుని లీలావతారములలో ఒకటైన శ్రీపాదుని జన్మ ఆంధ్రదేశము నందలి పిఠాపురములో జరిగింది. ఆవిధంగా దత్తాత్రేయుడు ఆంధ్రుల ఆరాధ్యదైవం అయ్యాడు. కాబట్టి చదివి సత్ఫలం సమగ్రంగా పొందవచ్చు. శర్మగారి తెలుగుసేత ముచ్చటగాఉంది.

## భర్తృహరి త్రిశతి

ఆంగ్లానువాదం : శ్రీ ఇంగువ రాఘవరావు; ప్రతులకు:అనువాదకునిపేర గొడుగుపేట-మచిలీ పట్టణం-521 001; వెల:రూ:16-00

సంస్కృత వాఙ్మయానికి సంబంధించి వ్యాస వాల్మీకి కాళిదాసాదుల తరువాత విశ్వ జనీనమైన పేరు పొందిన కావ్యం.

సుభాషిత త్రిశతి. కర్త భర్తృహరి. ఈయన విక్రమార్కుని సోదరుడనీ, ఏదో మామిడిపండు కథలో విరక్తుడై ఇల్లూ వాకిలీ విడిచి యీ 'త్రిశతి' వ్రాశాడనీ జనప్రవాదం. ఏదిఏమైనా యిలాంటి గ్రంథం ఇంకొకటి లేదని అనడానికి నాతో త్రిశతి పాఠకులు ఏకీభవిస్తారని నా విశ్వాసం. ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులూ విమర్శకులూ ప్రశంసించిన యీ త్రిశతికి అనువాదాలూ అలాగే వచ్చాయి.

తెలుగులో ఏనుగు లక్ష్మణకవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన వ్రాశారు. తిమ్మన తెలుగుసేత "నీతి శతకం" మాత్రం పరిచితమై ఉంది. శృంగార వైరాగ్య శతకాలు లభించలేదు. సుమారు నలభై యేళ్ళక్రితం తిమ్మన పేరుతో శృంగార శతకం నేను తెలుగు చెయ్యగా విజయనగరం నుంచి వెలువడిన 'అడ్వర్టైజర్ అనే వారపత్రిక ప్రకటించింది, మొత్తంమీద లక్ష్మణకవి రచన తెలుగు వారికి పరిచితమైన స్థాయికి మిగిలిన రెండూ చేరలేదు.

ప్రస్తుతం యీ ఆంగ్లానువాదం బహు రమ్యంగా ఉంది. ఉపాధ్యాయులుగా జీవితం గడపిన రాఘవరావుగారు దీనిని ఆంగ్లీకరించడములో కృతార్థులయారు.

అనువాదం అశ్వమేధం లాంటిది. అందుకే సంస్కృతాన్ని ఆంగ్లములోనికి మార్చి వ్రాయడమనేది మాటలతో పనికాదు. అయితే రాఘవరావుగారి యీ అనువాదం సామాన్య స్థాయివారికి కూడా

భర్తృహరి భాషను అవసరమైనచోట వివరించి సమన్వయానికి సముచిత రీతిని పదాలు ప్రయోగించి నిండురూపు సంతరించుకున్నదని నేను అర్థం చేసుకొన్నాను. ఒక్కొక్కచోట ఎక్కువ పదాలు వెయ్యవలసి వచ్చింది. వెయ్యేకతప్పదు. వేసినవి ఒప్పుగా ఉన్నాయి.

తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయం సార్థకముయింది.

ముఖపత్ర చిత్రం ఏమిటో నీరసంగా కనిపిస్తూంది.

## క్షత్రబంధూపాఖ్యానము

[కవి: శ్రీ ఆసూరి మఱింగంటి వేంకటనరసింహాచార్యులు, ప్రతులకు : శ్రీమరింగంటివెన్నయాచార్యులు, C/O శ్రీమతి వకుళాదేవి, దంతాలవారివీధి, సూర్యారావుపేట- నల్లగొండజిల్లా, వెల: 12-00]

ఈ గ్రంథాన్ని పరిష్కరించిన శ్రీరంగాచార్య పొగడ్తలకూ తెగడ్తలకూ వెళ్లక ఉన్నది ఉన్నట్టు చెప్పే మనీషిగ యీ గ్రంథం గురించి యిచ్చిన 'వివేచన'- చెబుతుంది.

భవిష్య పురాణంలోంచి యీ కథను తీసుకున్నట్టు గ్రంథకర్త చెప్పారుగాని దానిలో ఇది కనిపించలేదన్నారు.అలాగే పదప్రయోగాలలో ఉన్నలోపాలు ఎత్తిచూపారు. ఈలాంటివాటిని సమర్థించడానికి ప్రయత్నించడం సాహసిక్యం....

ఇందలికథ పేరుకి తగినదే. రాజుకొడుకు పరమదుర్మార్గుడుగా ప్రవర్తించి తనపేరు సార్థకం చేసుకొని చివరకు నానాగడ్డీతిని ఒకముని అనుగ్రహం వల్ల దారికివస్తాడు.కథఎలాఉన్నా కావ్యమందలి పాత్రలనూ వాటిస్వరూప స్వభావాలను అక్షరరూపములో చూపించడమందు గ్రంథకర్తకుగల భావనాశక్తి అద్వితీయమూ నిసర్గరమణీయమూ అని కావ్య లక్షణాలు తెలిసినవారు అంగీకరిస్తారు. చురుకైనధార స్వతంత్రమైనగతి. నిరంకుశమైన పాండిత్యానికి యీకృతి అక్షరాకృతి.

వర్ణనలుమాత్రం కాస్త 'అతి'గా ఉన్నాయని అనవలసిందే. 'ఆచార్యభజన' 'గురుపాదసేవ'- రచయిత విశిష్టాద్వైత మతపరాకాష్ఠకు ప్రాణమంత్ర పాఠంగా ఉంది. సర్వులూ మన్నించవలసే కృతి.

తిరుపతి దేవస్థానంవారి ఆర్థికసహాయం ధన్యమైంది.గ్రంథకర్తతో పాటు పరిష్కర్తను కూడా నిష్పాక్షికంగా అభినందిస్తున్నాను.

## వేమనయోగము

[రచయిత: శ్రీమేడపాటి వెంకటరెడ్డి, ప్రతులకు: శ్రీమేడపాటి రామకృష్ణారెడ్డి, అర్తమూరు: తూ॥గో॥ జిల్లా 533 351, లేదా, వేమనయోగ పరిశోధనాలయం, మార్కెట్టువీధి - సికింద్రాబాదు-3 వెల: మేలుప్రతి రూ-44/-, సాదాప్రతి రూ-36/-]

'విశ్వదాభిరామ! వినురవేమ:- సామాన్యంగా తెలుగువారికి రామనామజపం యీ పదసంపుటి. ఈ పదసంపుటిని గ్రంథరూపంగ తెలుగుజాతికి అందించిన ధర్మాత్ముడు మిష్టర్ బ్రౌన్-అని అంటారు.

ఆటవెలదికి అంత చక్కని ప్రచారంఇచ్చిన మహానుభావుడు వేమన. యోగిఅనగానే స్ఫురించేది వేమనపేరు. వేమనవ్యక్తిత్వం ఏలాటిది? నాస్తికుడా? శివయోగియా? కాలజ్ఞానియా? ఎవరీవేమన? ఎప్పటివాడు? ఎక్కడివాడు? యోగిత్వం ఎలావచ్చింది? సంస్కర్తగా చెప్పాలా? అది ఏలాటిసంస్కరణ?యోగం అంటేఏమిటి? తీరుతెన్నులు ఏలాటివి? బాహ్యశరీరానికి అంతశ్శరీరానికి యోగం ఏవిధంగా ఉపయోగిస్తుంది? ఆసనపద్ధతి ఏమిటి? యోగానికి ఆసనాలకూ గలసంబంధం ఏలాటిది? ఈప్రశ్నలకు సముచితములూ స్వప్రమాణములూ అయిన సమాధానాలు యీ గ్రంథములో దొరుకుతాయి.

బాలబాలికలూ స్త్రీలూకూడా ఆసనయోగశిక్షణతో దృఢమైన నీరోగమైన శరీరసౌభాగ్యం పొందవచ్చునని సచిత్రంగా విచిత్రంగా వెంకటరెడ్డిగారు యీ గ్రంథాన్ని రూపొందించారు.

రాళ్లపల్లివారూ, శ్రీగోపి మొదలైన పరిశోధకులూ పరిష్కర్తలు సాహితీమర్మజ్ఞులూ, వేమనను గురించి తెలిపినదానికన్నా ఈగ్రంథం ఎంతో ఆకాంక్ష్యమైన విషయమును తెలుపుతుంది.

ఇందలి 'ప్రాణాయామ ప్రకరణం' అవశ్యం పఠనీయము' ఆషామాషీగా చెప్పినదేదీ కాదు. వైదిక విజ్ఞానం ఆధారంగా వెంకటరెడ్డిగారు యీగ్రంథాన్ని సంతరించారు. అందరూ అవశ్యం పఠించి ఆచరణలో కృతార్థులు కావచ్చు.

యామిజాల పద్మనాభస్వామి

## విశ్వం

[రచన : శ్రీ రెంటాల నాగేశ్వరరావు. ప్రతులకు యుగస్పష్టి పబ్లికేషన్స్, అమరావతి రోడ్డు, గుంటూరు. పుస్తకం వెల : 12 రూ/- పేజీలు : 112]

పెరుగుతున్న ఆధునిక విజ్ఞానానికి అనువుగా అందరిలోను శాస్త్రీయధోరణి అభివృద్ధిచెందేందుకు శాస్త్రీయవిషయాలపై అవగాహన ఏర్పడేందుకు సచిత్రమైన గ్రంథాల అవసరం ఎంతైనా ఉంది. ఆ

విధంగా రచయిత ప్రచురణకర్తలు ఎంతో శ్రద్ధ వహించి విశ్వం పుస్తకం తయారుచేశారు.

వీలైనన్ని ఎక్కువ విషయాలు పాఠకులకు అందివ్వాలని వ్రాసినట్లుంది. కొన్ని సందర్భాలలో రచయిత వివరించిన తీరు సందేహాత్మకంగా కన్పిస్తుంది. ఉదాహరణకు 66వ పేజీలో ఫోటాన్‌ల ద్వారా శక్తిని తీసుకుని ఎలక్ట్రాన్‌లు ఐనీకరణం చెందేంత వరకూ పైకిపోవడంకాని, ఐనీకరణస్థితినుండి ఫోటాన్‌లద్వారా శక్తినిపోగొట్టుకుంటూ మామూలుస్థితికి రావడం గాని జరిగేటప్పుడు నియమితశక్తి తరగతులలో, నియమిత తరంగ దైర్ఘ్యాలలో వస్తాయి. అన్నివాళారు.

ఎలక్ట్రాన్‌లు అయనీకరణం చెందవు. పరమాణువు అయనీకరణం చెందుతుంది. హైడ్రోజన్ పరమాణువు సాధారణ స్థితినుండి ఆవేశస్థితికి ఫోటాన్‌లను గ్రహించి ఉత్తేజితం చెందుతుంది. ఆవేశస్థితి నుండి సాధారణస్థితికి పరమాణువు మారునపుడు శక్తిభేదము వర్ణపటంలో వర్ణపటరేఖగా వెలువడుతుంది.

గెలాక్సీలో నక్షత్రాల సంఖ్య అంచనాను అంకెలు వేసి చూపారు. అట్లాకాకుండా అంకెలు వ్రాసి చెప్పిఉంటే పాఠకులకు బాగా అర్థమవుతుంది.

మొత్తం మీద పుస్తకం చాలాబాగుంది. చిత్రాలు విషయ అవగాహనకు ఎంతో తోడ్పడతాయి. రచయిత మొత్తం విశ్వాన్ని కేవలం 112 పేజీల్లో చూపించాలనే ఆశపడ్డారు. అందుకే విషయాలు ఎక్కువలోతుగా వ్రాయడానికి అవకాశం లేక పోయింది.

శనిగ్రహానికి మొత్తం 23 చందమామలు తిరుగుతున్నట్లుగా వాయేజర్ పరిశీలనల వలన తెలుస్తోంది. అయితే 17 చందమామ లున్నట్లుగా మాత్రమే వ్రాశారు.

పుస్తకం వ్రాయడంలో నిస్సందేహంగా రచయిత కృషి మెచ్చుకోతగ్గది. అంతేగాకుండా చిత్రాలసేకరణ పుస్తకానికి మంచి నిండు తనాన్ని తెచ్చిపెట్టింది.

కొన్ని ఆంగ్లపదాలకు ఉపయోగించిన తెలుగుపదాలు ఆమోదింపబడిన పదాలు వాడి ఉండవలసింది. ఉదాహరణకు గతిశక్తి అనే పదానికి 'చలనశక్తి', 'స్థితిశక్తి' అనేపదానికి 'స్థానశక్తి' అని ఉపయోగించారు. ఒక బాణీ పదాలకు అలవాటు పడ్డ పాఠకులకు ఇది కొత్తగా అన్పించవచ్చు.

రేడియేటివ్ ఎనర్జీ అంటే వికిరణశక్తి అనడం సరిపోతుందని అనిపిస్తుంది. విశ్వంతో కొంచెం పరిచయమున్న పాఠకులను ఈ పుస్తకం ఎంతో సరదాగా చదివించుకోగల్గుతుంది. సంపాదకీయంలో వ్రాసినట్లు విశ్వం గురించిన ప్రాథమిక విజ్ఞానాన్ని సమగ్రంగా అందించడానికే ప్రయత్నించారు.

ఈ పుస్తకం తప్పనిసరిగా ప్రతి పాఠశాలలోను, లైబ్రరీలోను ఉంటే మంచిది.

సి. వి. సర్వేశ్వర శర్మ

## భీమ్‌ప్రసాద్ మిశ్రా

[హీరాలాల్ మోరియా (ఉర్దూమూలం) అనువాదం:- కొలిపాక మధుసూదనరావు వెల :- రు. 6-00లు, ప్రతులకు:- కీ.శే జమలాపురం కేశవరావు మెమోరియల్ కమిటీ. మోహన్‌రోడ్ ఖమ్మం.]

భారతదేశంలో సాగిన స్వాతంత్ర్యోద్యమం పైనా, తెలంగాణా పోరాటంపైనా ఇప్పటికి చాలా పుస్తకాలొచ్చాయి. ఏ ఉద్యమ చరిత్రలోనైనా నాయకత్వం వహించిన ప్రముఖుల చరిత్రే ఉంటుంది. కార్యకర్తలను గురించి అట్టే సమాచారం మనకు లభించదు. భీమ్ ప్రసాద్ మిశ్రా అటు స్వాతంత్రోద్యమంలోను ఇటు తెలంగాణా విముక్తి పోరాటంలోనూ ఒక మంచి కార్యకర్తగా సాగించిన జీవిత విశేషాలూ, ఆయనలోని పాండిత్య వైభవం, కవితాశక్తి, త్యాగనిరతి, సంఘసేవా తత్పరత, మొదలైన లక్షణాలను మోరియాగారు చక్కగా వివరించారు. అనువాదం మధుసూదనరావుగారు సరళంగా చాలా బాగాచేశారు. ఇటువంటి మంచి పుస్తకాలను అందిస్తున్న కమిటీ వారు సర్వదా అభినందనీయులు.

## రండి స్వాతంత్ర్యదినోత్సవం జరుపుకుందాం

[హీరాలాల్ మోరియా (ఉర్దూమూలం) అనువాదం :- కవిరాజమూర్తి వెల :- రు 10-00 ప్రతులకు :హీరాలాల్ మోరియా మోహన్‌రోడ్ ; ఖమ్మం-507008.]

స్వాతంత్ర్యానంతర భారతదేశాన్ని చిత్రపటంగా గీసిన కావ్యం ఇది. స్వాతంత్ర్య పోరాటం పరిశుద్ధమైన లక్ష్యంతో జరిగింది. కాని స్వాతంత్ర్యం వచ్చిం తరువాత దేశం-లక్ష్య శూన్యం, త్యాగశూన్యమై స్వార్థం పరమార్థంగా. పదవే ప్రాణలక్షణంగా, పదవే చరమలక్ష్యంగా మారింది. మారిన ఈ పరిస్థితులను మోరియా గారు అత్యంత వేదనతో కావ్యమయం చేశారు.

"ధవళ వస్త్రధారులైన ఈ నాయకులే
హంతకులవుతున్నారు
మానభంగాలు చేయించిన ఈ మహానుభావులే
మానవత్వాన్ని గురించి
మహోజ్వల ఉపన్యాసాలిస్తున్నారు.
నా తమ్ముణ్ణి నడివీధిలో చంపించిన వీడు
నా చెల్లెల్ని నిలువునా దోచుకున్న వీడు
వేదికపై వేదాంతాలను చెబుతున్నాడు నేడు

నిజం తమ్ముడూ-నిజం
నీవే చెప్పు
స్వాతంత్ర్యదినోత్సవ వేడుకలోకి
నే నెట్లా వచ్చేది.
ఈ స్వాతంత్ర్యం నాదని ఎట్లాచెప్పేది"

అని ప్రతిసామాన్యుని వేదనను తనదిగా చేసుకొని మోరియాగారు కవిత్వం రాశారు. వారి ఉర్దూమూలాన్ని కవిరాజు మూర్తిగారు ఎట్లా తెనిగించింది చెప్పటానికి పై పాదాలే ఉదాహరణ.

# గోడలకు నోళ్ళున్నాయ్

[ఛాయా భాస్కర్ వెల :- రు 10-00లు ప్రతులకు :- విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్; అన్ని బ్రాంచీలు]

చేకూరి రామారావుగారు ముందు మాటలో చెప్పినట్లు వచన గేయ కవితాసంకలనాలు లెక్కకుమించి వస్తున్నాయి. కవితా పాఠకుల హృదయాల్లో కొన్ని మాత్రమే మిగులుతున్నాయి. అధిక సంఖ్యలో సంకలనాలు వచ్చినవి వచ్చినట్లే పోతున్నాయి. గోడలకు నోళ్ళున్నాయ్ అనే ఈ వచన కవితా సంకలనం దీని మొదటి ప్రయత్నం. అయితే ఈ గేయాలన్నీ అప్పుడప్పుడు వివిధ పత్రికల్లో అచ్చుఅయినవే. రచనలో ప్రాథమిక లక్షణం ఏమీ కొట్టవచ్చినట్లు కనబడదు. చెప్పే పద్ధతిలో ఒక విలక్షణత ఉంది; ఒక కొత్త దనం ఉంది. తనదైన తనం ఒకటి స్పష్టా స్పష్టంగా కనబడుతుంది. భవిష్యత్తులో ఈ లక్షణం ఇంకా స్పష్టంగా బహిర్గతం కావచ్చు- పాతశబ్దాలను, పాతపంక్తులను, సామెతలను కొత్త విధంగా ట్విస్టు చెయ్యటం ఈ కవి లక్షణమని చే. రా. గారు సోదాహరణంగా వివరించారు. ఉదాహరణకు గాంధీగారు మూడు కోతుల కథఉంది. దానిని ఈ జాతి జడత్వానికి ప్రతీకగా ఈ కవి ట్విస్టు చేసిన పద్ధతి చాలా బాగుంది.

"ఇదో రకపు జాతి
గాంధి కోతి జాతి
న్యాయం అన్యాయం గూర్చి మాట్లాడదు
నోరు మూసుకొని భరిస్తుంది మూగజాతి
మంచి చెడులను గురించి వినదు
వినబడదు బధిర జాతి
పాపల కళ్ళిడుమ గాక
పాపం పుణ్యం కనబడదు
చూడలేదు అంధ జాతి"

ఇట్లా సెమినార్లమీద. ఐ. ఎమ్. ఎఫ్ మీద ఇంకా అనేక విషయాల మీద ఈ కవి ప్రదర్శించిన శాబ్దిక ట్విస్టు కొత్త అర్థాలను సృష్టించి కొత్త ఆలోచనలను రేకెత్తిస్తుంది.

సాంఘిక వ్యవస్థలోని అనేక లోపాలమీద ఈ కవి కలం తిరగబడింది. అయితే-" ఈ ఖండికలన్నీ భాస్కర్ సుమారు రెండే శ్ళకాలంలో రాశాడు. రెండేళ్ళల్లోనే ఇంత కవితా శక్తి చూపించిన కవి ఇంకా ఎదుగుతాడనేనమ్మకం. ఎదక్కపోతే ఇప్పుడు అభ్యుదయ కవు లనుకుంటున్న కొందరి స్థాయిలో ఉండిపోతాడు. దిగజారితే పాలక వర్గాల అభ్యుదయకవి కావచ్చు. ఈ హెచ్చరికను గమనించి కవిగా ఉదయించిన భాస్కర్ తీక్షతను సమకూర్చుకొని ప్రచండ తేజస్సుతో వెలుగొందాలని ఆకాంక్షిస్తున్నాము." అని చేరాగారు అనిన మాటల్లో యదార్థం ఉంది. ఆ యథార్థాన్ని గ్రహించి భాస్కర్‌గారు ముందు ముందు స్వకీయ ముద్రతో ఇంత కంటే బలంగా కవిత్వం రాస్తారని ఆకాంక్ష.

# రెండు పదులు పైన (గేయాలు)

[చేకూరి రామారావు, వెల: రు. 10/-, ప్రతులకు:- శ్రీదేవీ పబ్లికేషన్స్; 2-1-527/7 నల్లకుంట; హైదరాబాద్-500 044]

చేకూరి రామారావుగారు భాషా శాస్త్రవేత్త; సాహిత్య విమర్శకుడు రామారావుగార్ని గురించి ఇటీవల కవిత్వం రాస్తున్న తరానికి ఈ విషయం మాత్రమే తెలుసు. ఒకానొకప్పుడు ఆయన కవిత్వం కూడా రాశారనటానికి సాక్ష్యంగా 'ఈ రెండు పదులుపైన' అనే సంకలనాన్ని అచ్చువేశారు. ఈ కావ్యం ద్వారా కవిగా పేరు స్థిర పరచుకొందామనే దురూహ కాని, దుర్భ్రమకాని ఆయనకు లేదు. "కారణం ఏదన్నా కానీ కవిత్వపు మత్తులోనుంచి త్వరగానే బయట పడ్డాను. కవిత్వం రాయటం కంటిన్యూ చేస్తే ఎట్లా ఉంటుందనే ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం. ఒక మైనర్ కవిగా కాసిని పుస్తకాలు అచ్చువేసే వాళ్లేమో. ప్రజాకవిని కాలేకపోయినా నా సమ కాలికులు కొందరి లాగా ప్రభుత్వ కవిని అయ్యేవాణ్ణి కాదనుకుంటా. కవిత్వం రాయటం కన్నా మంచి పనులు చేస్తున్నానన్న సంతృప్తి ఉంది ఇప్పుడు....నేను కవిత్వం రాశానని చెప్పుకోవాలనే ఉబలాటం ఏ మూలన్నా కాస్త ఉంటే ఉందేమో! కాదనలేను గొప్ప కవిత్వం రాశానన్న ధీమా మాత్రం లేదు." ఈ మాటలుచాలు రామారావుగారి వ్యక్తిత్వాన్ని, సాహిత్య తత్వాన్ని అంచనా కట్టడానికి. సాహిత్యం లోనూ, జీవితంలోనూ కూడా నిరాడంబరుడే ఆయన. ఈ నాటి సాహిత్య ప్రపంచంలో రామారావుగారి లాంటి వార్ని చాలా తక్కువ మందిని చూస్తాం.

ఇందులోని కవితలుకొన్ని 'స్వతంత్ర'లో అచ్చు అయినవే. 1955 నుంచి 1958వరకూ రాసిన కొన్ని కవితలు, 1979లో రాసిన కవిత ఒకటి ఇందులో ఉన్నాయి. చివరిఖండిక 'రేపటికోసం' లోనిది. భావకవిత్వం తెరమరుగై అభ్యుదయ కవిత్వం ఆగిపోయిన కాలంలో తెలుగు కవితారంగంలో ఒకశూన్యత ఏర్పడింది. ఆ కాలంలో రామారావు గారు విద్యార్థి. ఆ దశలో రాసిన పద్యాలివి. ఆనాటికే ఆయన నాయని వారిని ఆ తరం కవులను శ్రీశ్రీ, కృష్ణశాస్త్రిని,తెలుగు కవితాపరిణామ దశల్ని అధ్యయనంచేస్తూ, చారిత్రకంగా వస్తున్న మార్పులమగమనిస్తూ సాహిత్య వ్యక్తిత్వాన్ని రూపొందించుకొనే ప్రయత్నంలో విజయాన్ని సాధించారు. ఈనాడు ఆయన విమర్శకుడైనా, భాషాశాస్త్రవేత్త అయి ఆ శాస్త్రానికి సంబంధించిన అనేక వ్యాసాలు పుస్తకాలురాసిన ఆయన హృదయం కవితాత్మక మైనది. కనుకనే కవితానుశీలనంలో ఆయన కలం అంత సంయమనంతోనూ, సమ్యక్ దృష్టితోనూ ఉంటుంది. చే. రా. గార్నిగురించి మనకుతెలియని విషయాలు నాయని కోటీశ్వరి గారు పీఠికలో చక్కగా వివరించారు. పీఠికల్లో కవిత్వాన్ని గురించి కంటె తమకు బాగా పరిచయమున్న కవినిగురించి చెబితే చదువరి కవిత్వాన్ని బాగా అర్థం చేసుకొంటాడు. రామారావుగారి కవిత్వాన్ని ఫాలో అవటానికి కోటీశ్వరిగారి పీఠిక కరదీపిక.

ఈ సంకలనంలో ఆయన సొంతపద్యాలు కొన్ని నాజెమ్ హిక్మత్. హరీంద్ర ఛటోపాధ్యాయ, ఠాగూర్, బ్రెచ్టొకవితల అనువాదాలు కొన్నిఉన్నాయి. ఈ ఖండికలన్నీ ఎక్కువభాగం స్వతంత్ర లోను, మిగిలినది, స్రవంతి, తెలుగుదేశం, అభ్యుదయ మొదలైన పత్రికల్లోనూ అచ్చుఅయినవి.

చే.రా.గారు ఎంతమంది కవులనైనా చదివి ఉండవచ్చు.ఆయన రాసిన కవిత్వంలో ఆ ఇమిటేషన్‌లేదు. ప్రధానంగా సాహిత్య విమర్శకుడు, భాషాశాస్త్రవేత్త ఆయిన వ్యక్తియొక్క కవితా హృదయం ఎట్లాఉంటుందో తెలుసుకొనడానికి ఈ పద్యాలు ఉపకరిస్తాయి.

## జులై 30

# రావి శాస్త్రిగారి పుట్టినరోజు కానుక

[గౌరవ సంపాదకుడు: కాళీపట్నం రామారావు; సంపాదకుడు అత్తలూరి నరసింహారావు; వెల: రు. 25-00లు; ప్రతులకు : అరుణా పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ-520 002.]

1982 జులై 30 రావి శాస్త్రిగారి అరవై ఒకటో పుట్టినరోజు. ఆ సందర్భంగా ఆయనమిత్రులు. సాహిత్యాభిమానులు శాస్త్రిగారి రచనలమీద, వ్యక్తిత్వంమీద ఒక సంకలనం తేవాలనుకున్నారు. ఆ ఆశయ ఫలితమే ఈపుస్తకం. సంపాదకీయం కాక 64గురు రాసిన వ్యాసాల సంకలనం ఈగ్రంథం.

కవుల్లో శ్రీశ్రీకున్నపేరు రచయితల్లో రావిశాస్త్రి గారికున్నది. రచనల్లో తనదైన ఒకగాఢమైన ముద్రను పాఠకుల హృదయాలపై ఎన్నటికీ చెరక్కుండా ముద్రించిన రచయిత రావి శాస్త్రిగారు. రచయితగానే కాక వ్యక్తిగాకూడా రావి శాస్త్రిగారు ఉన్నతులని తాతాశ్రీరామమూర్తిగారి,ఆకెళ్ళకృష్ణమూర్తిగారి,చలసాని ప్రసాద్‌గారి వ్యాసాల్లు ఇంకా ఇతరుల వ్యాసాలు ఋజువుచేస్తున్నాయి. రచయితగా రావిశాస్త్రిగారిబలాన్ని, బలహీనతను కూడా చాలావ్యాసాలు విపులంగా చర్చించాయి. వాటిలో-సర్వశ్రీ మధురాంతకం రాజారాం, కె. వి. రమణారెడ్డి, రాచమల్లు రామచంద్రారెడ్డి, ఆకెళ్ళ కృష్ణమూర్తి, పాలగుమ్మి పద్మరాజు, అద్దేపల్లి రామమోహనరావు, నల్లంపాటి వెంకట సుబ్బయ్య, భద్రిరాజు కృష్ణమూర్తి, పురాణం సుబ్రహ్మణ్యశర్మ ప్రభృతుల వ్యాసాలు ఆలోచనాత్మకమైనవి. (తక్కిన వ్యాసాలు పనికి రావని నా తాత్పర్యం కాదు.)

రావిశాస్త్రిగారి రచనా ప్రపంచంలో లంపెన్ ప్రోలిటేరియట్ కనిపిస్తారేగాని నిజమైన ప్రొలిటేరియట్ కాదని పలువురు అంగీకరించారు. కొడవటిగంటి కుటుంబరావుగారి పాత్రలు చాలావరకూ మధ్యతరగతికి చెందినవే. ఆయనను అభ్యుదయ, విప్లవరచయితగా అంగీకరించిన అందరకూ ఈవిషయం తెలిసిందే. చాలామంది వ్యాసకర్తలు వర్ణనాబాహుళ్యంవల్ల రచన దెబ్బతింటున్నదనే సంగతిని అంగీకరించారు. కొంతమంది పాత్రల్లోనూ, సంభాషణల్లోనూ రచయితే కనబడతాడన్నారు. రచన ఒకటే అయినా అభిప్రాయాలు అనేకం ఉంటాయి. అభిరుచిని బట్టేకదా అభిప్రాయాలు ఏర్పడేది.

నవలలో అల్పజీవి సంపూర్ణమైన నవల తక్కినవి అసంపూర్ణాలే కథలు, వ్యాసాలు అనేకం రాశారు రావిశాస్త్రిగారు. నిజం నాటకం ఎంత ప్రసిద్ధమైనదో వేరేచెప్ప నక్కరలేదు.

ఒక కాలంనాటి సంఘాన్ని ప్రభావితం చేసే ప్రతి వ్యక్తిలోనూ లోపాల కొన్ని ఉండవచ్చు. కాని వాటిని మింగేసిన మహాప్రతిభా వ్యక్తిత్వం ఒకటి అతన్ని నడుపుతుంది. ఆ ప్రతిభా వ్యక్తిత్వమే మనకు కావాలిగాని అల్పమైన లోపాలు అవసరం లేదు. కథా రచయితలమీద, నవలా రచయితలమీద ఆయన ప్రభావం అద్వితీయమైనది. అదిఎంత? అంటే ఆయనమీద అసూయపుట్టించేటంత.

ఈ సంకలనాన్ని వెలుగులోనికి తెచ్చిన, తేవటానికి ముందు అమితంగా కృషిచేసిన సంపాదకుడు అత్తలూరి నరసింహారావుగారు, కాళీపట్నం రామారావు గారు ఎంతైనా అభినంద నీయులు.

టి. యల్. కాంతారావు

*Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press Gandhinagar Vijayawada-3. Editor : S. Radhakrishna Vijayawada Phones : 75667 & 61247*











అమృతాంజన్‌కే
తెలుసు
ఒంటి నొప్పులు
మరియు
బెణుకుల బాధ



మృదువైన మూలపదార్థము వల్ల
ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల
మందు శక్తికి రక్షణ




# అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని
శీఘ్ర నివారిణిని నమ్మండి



1984 ఒలింపిక్స్ క్రీడలలో
పాల్గొన్న భారత క్రీడాకారులకు
అధికారపూర్వకంగా పెయిన్ బామ్
సరఫరా చేసినవారు.

OBM 8777 TG